ఫిబ్రవరి 2014

రూ. 12/-

# చతుర



* సుషమ్ బేదీ నవల

## నన్ను క్షమించు చిన్నూ! .. 6

# అక్షరధార

వేల ఏళ్ళ క్రితం మన ప్రాచీనులు మనిషి ప్రవర్తనా నియమావళిని నిర్దేశిస్తూ వాటిని శ్లోకబద్ధం చేశారు. అవి అన్ని కాలాలకి, అన్ని ప్రదేశాలకి చెందిన అందరికీ సమానంగా వర్తించే నిత్య సత్యాలు.

## సమయ పాలన

సమయ్యా సంయమా యే తు తే భవన్త్యల్ప జీవినః ।
వరమాయుః కిమప్యస్తాం తేషాం నృణాం విచార్యతామ్ ॥

భావం: సమయాన్ని సక్రమంగా వినియోగించుకోకపోవడం, సమయం చాలదనుకోవడం అల్పజీవులు చేసే పని. సమయం, ఆయువు ఎవరి కోసం ఆగని దైవదత్తాలు. అల్పజీవులు కాలాన్ని వినియోగించుకోక, అనవసర ఆలోచనలతో వృథా చేస్తారు.

## విషాన్ని మించినవి

సందర్శనం విషయిణాం
అథ యోషితాం చ
హా హంత హంత
విషభక్షణతో వ్యసాధు

భావం: విషయలోలురిని, కామినీ స్త్రీలని చూస్తే విషభక్షణం చేసిన దాని కన్నా ఎక్కువ హాని కలుగుతుంది.

## వివాహానికి అనర్హత

కామ మామరణాత్తిష్ఠేత్ గృహేకన్యర్తుమత్యపి
న చైవానాం ప్రయచ్ఛేత్ గుణహీనాయ కర్హి చిత్

భావం: స్త్రీ, పురుషులు మరణ పర్యంతం బ్రహ్మచారులుగా ఉన్నా ఉండచ్చు కాని, పరస్పర విరుద్ధ గుణ కర్మ స్వభావాలు కలిగి ఉంటే, వారికి వివాహం ఎన్నటికీ కాకూడదు. అలా అయితే వారికి కలిగే సంతానం దుర్బలం, నిస్తేజం అవుతుంది.

## అభ్యాసం గొప్పతనం

అభ్యాసానుసరీ విద్యాచ
బుద్ధిః కర్మానుసారిణీ
ఉద్యోగానుసరీ లక్ష్మీ
ఫలం భాగ్యానుసారిణీ

భావం: అభ్యాసాన్ని బట్టి విద్య ప్రాప్తిస్తుంది. కర్మని అనుసరించి బుద్ధి కలుగుతుంది. ప్రయత్నాన్ని బట్టి సంపద లభిస్తుంది. అదృష్టాన్ని బట్టి ఫలితం లభిస్తుంది.

## పుత్ర ధర్మం

జీవతోర్వాక్య కరణాత్ ప్రత్యబ్దం భూరి భోజనాత్
గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా

భావం: జీవించి ఉన్నప్పుడే తల్లిదండ్రుల మాటలని పాటించాలి. మరణించాక శ్రాద్ధ దినాన విరివిగా అన్నదానం చేయాలి. గయలో పిండదానం చేయాలి. ఈ మూడిటిని అనుసరించడం వల్లే కొడుకు పుత్రధర్మాన్ని నిలబెట్టుకుంటాడు.

## నిత్యసత్యాలు

నాస్తి కామ సమో వ్యాధిః
నాస్తి మోహ సమో రిపుః
నాస్తి క్రోధ సమో వహ్నిః
నాస్తి జ్ఞానాత్పరం సుఖం

భావం: కామాన్ని మించిన వ్యాధి, మోహాన్ని మించిన శత్రువు, క్రోధాన్ని మించిన అగ్ని, జ్ఞానాన్ని మించిన సుఖం లేవు.

సేకరణ : లిపి

# భలే భలే!



'ది వార్ ఆఫ్ ది వరల్డ్స్', 'ది టైమ్ మెషిన్' వంటి గొప్ప కాల్పనిక రచనలు చేసిన హెచ్.జి. వెల్స్ ఎపుడూ రెండు ఫౌంటెయిన్ పెన్నులు దగ్గర పెట్టుకునేవాడు. ఒకటి పెద్ద పదాలు, మరొకటి చిన్న పదాలు రాయడానికి ఉపయోగించేవాడు. ఆయనను 'ది ఫాదర్ ఆఫ్ సైన్స్ ఫిక్షన్' అని పిలుస్తారు.

# భలే భలే!



ఐరిష్, బ్రిటిష్ సాహిత్య ఆద్యులలో ఒకరైన కవి డబ్ల్యు. బి. ఈట్స్ కచ్చితమైన పదాలు పడే వరకు తన పద్యాలను మళ్లీ మళ్లీ రాస్తుండే వాడు. ఆయన చనిపోయే సమయంలో కూడా యుక్తవయసులో రాసుకున్న పద్యాలను తిరిగి రాసాడు! ఇరవయ్యో శతాబ్దపు సాహిత్యాన్ని అందించిన ముఖ్యులలో ఒకరు ఈట్స్.

# భళేభళే!

పంతొమ్మిదో శతాబ్దపు నార్వే నాటకరచయిత హెన్రిక్ ఇబ్సెన్‌ను 'ది ఫాదర్ ఆఫ్ రియలిజమ్' అనేవారు. స్వీడిష్ నవలా రచయిత, చిత్రకారుడు ఆగస్ట్ స్ట్రిండ్‌బర్గ్ పెయింటింగ్‌ను ఎదురుగా పెట్టుకుంటేనే ఇబ్సెన్ రచనలు ఉత్సాహంగా సాగేవట! ఇబ్సెన్ నాటకం 'ఎ డాల్స్ హౌస్' ఎక్కువసార్లు ప్రదర్శించిన నాటకంగా పేరు పొందింది.

# భలేభలే!



విలియం గిరాల్డి పరుపు మీద కూచుని రాసుకుంటాడు. అయితే పరుపు చుట్టూ ఎత్తుగా గొప్పరచయితల పుస్తకాలను దొంతరలుగా పెట్టుకుంటాడు. విమర్శనాత్మక రచనలు చేసేపుడు వైల్డ్ అండ్ పేటర్, డాక్టర్ జాన్సన్ పుస్తకాలు, చిన్నకథలు రాసేపుడు హెమింగ్‌వే, ఫ్లన్నరీ పుస్తకాలు, నవలలు రాసేపుడు నొకొబొవ్, ఇలియట్ పుస్తకాలు పెట్టుకుంటాడు.

# భలేభలే!



అమెరికా మాజీ అధ్యక్షుడు, రచయిత బెంజమిన్ ఫ్రాంక్లిన్ బాత్‌టబ్‌లో జలకాలాడే సమయంలో రాయడానికి ఇష్టపడేవాడు. అమెరికాలో మొట్టమొదట బాత్‌టబ్‌ను దిగుమతి చేసుకున్నది ఆయనేనని చెప్తారు.

# భళేభళే!

'వానిటీ ఫెయిర్' సంపాదకుడైన అమెరికన్ రచయిత మైకేల్ మన్రో లూయిస్‌కు రాత్రుళ్లే రాసుకునేందుకు అనువైన సమయం. రాత్రి ఏడు గంటలకు రాయడం మొదలుపెడితే తెల్లారి నాలుగింటి వరకూ ఆయన కలం సాగుతూనే ఉంటుందట! అందరూ నిద్రపోయే సమయం కాబట్టి ఇతరుల వల్ల తన రచనకు ఆటంకం కలగదని ఆయన చెప్తాడు!

# భలేభలే!



'ద వే వి లివ్ నౌ', 'ది వాల్కనో లవర్', 'ఇన్ అమెరికా' వంటి రచనలు చేసిన రచయిత్రి సుసన్ సాన్‌టాగ్ తాను రాయదలచుకున్న దానికి సంబంధించి ఓ అవగాహనకు వచ్చిందంటే అది పూర్తయ్యేవరకు తిండి, నిద్ర కూడా సరిగ్గా పట్టించుకునేది కాదట!

# భలేభలే!



అమెరికన్ కవి హెన్రీ చార్లెస్ బకొస్కి మధ్యాహ్నం 12 గంటలు కానిదే నిద్ర లేచే వాడు కాదట! లేవగానే కొంచెం తిన్నాక రేసు గుర్రాల మీద పందెం కాసేవాడట! సాయంత్రం డిన్నర్ అయిన తర్వాత రెండు బాటిల్స్ మద్యంతో మేడపైకెక్కి రాయడం ప్రారంభిస్తే నడిరేయి దాటాక ఒకటిన్నర, రెండున్నర వరకూ అవిరామంగా రచన సాగుతుండేదట!

# నన్ను క్షమించు చిన్నా!

మూలం: సుషమ్ బేదీ

అనువాదం: ఆర్. శాంతసుందరి



"అక్కా! స్కూల్లో చదివే రోజులనుంచే మామూలు డిగ్రీలని ఈసడించుకునేవాణ్ణి. అందుకే దేవుడు నాపై ఇలా పగ తీర్చుకున్నాడేమో!" అన్నాడు చిన్నూ బాధగా.

"ఏమిట్రా ఆ మాటలు? ఎందుకంత నిరాశ?" ఊరడింపుగా అంది అక్క శశి.

"అక్కా! తెలివైనవాణ్ణి కానందుకే నాకు డాక్టర్‌సీటు రాలేదంటావా?" అడిగాడు చిన్నూ.

"తెలివికి ఇదొక్కటే కొలమానం కాదుగా?"

"మన ఇంట్లోకూడా అందరికీ ఇదే కొలమానం కదక్కా? అమ్మా, నాన్నా, అన్నయ్యా.. అందరూ మారిపోయారు. మునుపటిలా నాపై వారికి ప్రేమ లేదు!" గాద్గదికంగా అన్నాడు చిన్నూ.

కుటుంబసభ్యుల తిరస్కారానికి గురైన ఓ కుర్రాడి జీవితం ఏ మలుపులు తిరిగింది? పిల్లల భవిష్యత్తుపై పెద్దల ఆలోచనలలో ఉండే అపోహలకు అద్దం పట్టిన సుప్రసిద్ధ హిందీ రచయిత్రి **సుషమ్ బేదీ** మనోవైజ్ఞానిక నవలకు **ఆర్. శాంతసుందరి** తేటతెనుగు అనువాదం **నన్ను క్షమించు చిన్నూ!** చతుర జన్మదినోత్సవ కానుక!



జీవితంలో అన్నిటికన్నా బాధపెట్టే విషయాలమీదికే ఎందుకో మనసు వెళ్తూ ఉంటుంది. ఎంత వదలించుకుందా మన్నా, గాయం మాని పెచ్చుకట్టిన చోటికే చెయ్యి వెళ్ళినట్టు, ఈ నయంకాని పుండు వైపుకే మనసు ఎందుకు లాక్కెళ్తుందో నాకు అర్థంకాదు. బాధ ఎక్కువైన కొద్దీ దాన్ని అణిచివెయ్యడం అటుంచి ఇంకా దాన్ని గురించే ఎక్కువగా ఆలోచిస్తూ ఉంటాను. ఇలాంటి బాధే ఒకటి ఎన్నో ఏళ్ళుగా మనసులో విషపు గూడులా వేలా డుతోంది. విషప్పురుగులు ఎగురుతూ నా చుట్టూ ముసురుతూంటే మనసు విలవిల లాడుతుందే తప్ప వాటి మీంచి నా దృష్టి మాత్రం మరలదు.

ఈ కథ నేనలా మొదలుపెట్టకూడ దేమో.. ఎందుకంటే ఇది ఉత్త మానని పచ్చిపుండు కథ కాదు. అణువణువుగా హరించిపోవడం గురించిన కథ. అణువ ణువుగా నశిస్తూ, అణువణువుగా రూపు దిద్దుకునే కథ. అసలు ఈ గాయాలు రెండు రకాలుగా ఉన్నాయి. ఒకవైపు తగ్గే గాయం, మరోవైపు ఎప్పటికీ మానని రాచ పుండులాంటి గాయం. ఇంతవరకూ ఎవరూ కూడా ఒక మనిషిని స్వతంత్రంగా బతికేట్టు చెయ్యడం ఎంతో ముఖ్యమనీ, ఒకరికి ఉపకారం చేసి రుణగ్రస్థుడ్ని చే యడమనేది ఆ మనిషిని హత్య చేయడం తో సమానమనీ చెప్పలేదు. అలా ఇంకొ కరు చెయ్యవలసిన పని మనమే చేసి పె డుతూ వాళ్ళని పూర్తిగా మనమీద ఆధార పడేట్టు చేసేస్తాం. వాళ్ళలో సొంతంగా ఏ పనీ చేసే సామర్థ్యం ఉండదు, ఆత్మవి శ్వాసం పూర్తిగా కోల్పోతారు. కాలం నాకెంతో నేర్పింది. పాతికేళ్ళుగా నా జీవితం ఎత్తు పల్లాల్లో పడి కొట్టుకుం టోంది.

నా జీవితంలో రెండు ఘట్టాల్లోనూ జరి గినది మాత్రం ఒకటే. తేడా ఎక్కడైనా ఉందీ అంటే, అది సంఘటన జరిగిన చోటుకీ, వాతావరణానికీ.. ఇంకా చెప్పా లంటే నా మనస్థితికీ సంబంధించినది మాత్రమే అనాలి. ఒక వయసులో మనకి భయం గొలిపేవి ఆనాడు అసలవి ఉన్న దానికన్నా ఎంతో భయంకరంగా కనిపి స్తాయి. మనం మరీ చిన్నపిల్లలుగా ఉన్న ప్పుడు పొట్టి మనిషి కూడా భయంకర మైన రాక్షసుడిలా కనిపిస్తాడు. చిన్న కేన్వాస్ మీద ఒక మాదిరి ఆకారంలో ఉన్న ఒక చుక్క ఎంతో పెద్దదిలా అనిపి స్తుంది. అదే మనం పెద్దయాక కొండల్ని కూడా దాటెయ్యగలం అనుకుంటాం. కానీ నిజంగా నా చిన్నప్పటి ఆ చుక్క చిన్న దేనా? లేక నేను చిన్నదాన్నవడం వల్ల అప్పుడు అది పెద్దదిగా అనిపించిందా? ఈ రోజు నా వయసు నలభై. చిన్నప్పుడు కేన్వాస్ మీద ఒక చిన్న చుక్కలా కనబ డ్డది ఇప్పుడు నాతో బాటు పెరుగుతూ నన్ను మించేస్తోందెందుకు? నేను దాన్నించి ఎలాగైనా బయటపడి తప్పించు కునేందుకు గిలగిల్లాడిపోతున్నానే? నా మనసులో బాధ ఇప్పటిదా, గతంలోనిదా అని కూడా నాకర్థం కావడం లేదు. అది ఇనుప గుండులాగ బరువుగా బాధ పెడు తూనే ఉంటుంది. ఎన్ని పట్టీలు వేసినా రక్తం కారే గాయంలా సలుపుతూనే ఉంటుంది. మరోపక్క ఆ రక్తస్రావాన్ని ఆపితే లోపల విషం చేరుతుందేమోనన్న భయం పీడిస్తూనే వుంటుంది.

"వీడుత్త మాంసపు ముద్ద శశీ! వీడి మీద మమకారం పెంచుకోకు" అన్నాడు అశోక్. అప్పుడు నేను పెట్టిన కేక కొండల్ని కూడా పిండి చేసేంత బలంగా నా గుండెలని చీల్చుకుని బైటికొచ్చింది. వాడిని.. నా కన్న తండ్రిని.. మాంసపు ముద్ద అనుకుంటే నేను ప్రాణాలతో ఉండ లేనని అశోక్‌కి ఎలా చెప్పను! లేదు, నేను అప్పుడే చనిపోవడానికి సిద్ధంగా లేను.

అందుకే వాడు కూడా బతికే ఉండాలి.

ఈ కథని నేను మళ్ళీ ఇంకోసారి చెప్ప బోవడం లేదు. నా వర్తమానంలోకి యాదృచ్ఛికంగా వచ్చిపడిన గతాన్ని మునుపటంత అసహాయ స్థితిలో ఉండని వ్వను. ఇంతవరకూ జరిగినది వేరు. ఏది ఎక్కువ బాధాకరమో చెప్పలేను- పుట్టగానే జీవితాన్ని కోల్పోవడమా? లేక యౌవనం లోకి ప్రవేశిస్తుండగా జీవితం కుళ్ళిపోవడం మొదలుపెడితే భరించడమా? నేను ఆ రెండు పరిస్థితులతోనూ పోరాడుతు న్నాను.

నా భుజంమీద వేసి ఉన్న అశోక్ చేతులు కూడా నాకు ఓదార్పునివ్వడం లేదు. కన్నీళ్ళు తుడుచుకోకుండానే "లేదు అశోక్, వీడు నా కొడుకు. నా శాయశ క్తులా ప్రయత్నించి వీణ్ణి బతికించుకుం టాను... ఏం చేసైనా సరే!" అన్నాను.

డాక్టర్ని ఎప్పుడు చూసినా అవే ప్రశ్నలు అడగడం "నిజంగా వీడెప్పటికీ మామూ లుగా ఉండలేడా? "

డాక్టరు కూడా కొన్ని పదాల మార్పుతో చెప్పే సమాధానం కూడా ఒకటే. "ఇలాటి కేసుల్లో ఏం జరుగుతుందో చెప్పడం కష్టం. పిల్లాణ్ణి మీరు మానసిక రోగుల ఆస్పత్రిలో చేర్పించడమే మంచిది. ఎలాగూ ఎక్కువకాలం బతుకుతాడన్న ఆ శ లేదు. మీరే స్వయంగా పెంచాలను కుంటే అనవసరంగా మరింత బాధకి గుర వుతారు. పిల్లలకి నిజమైన ప్రేమ దొరికేది తల్లి దగ్గరే. కానీ ప్రతి తల్లీ అంత ఓర్పుగా చూసుకోగలదని కూడా చెప్పలేం. అది స్త్రీ ఓర్పును బట్టి ఉంటుంది. ఇలాంటి పిల్ల వాణ్ణి ఇరవైనాలుగ్గంటలూ కనిపెట్టుకుని ఉండాలి. అంకితభావంతో పనిచేసే ఒక నర్స్ అవసరం ఉంది. వైద్య సహాయం అడుగడుక్కీ అవసరం అవుతుంది. అన్నీ మీరే చూడలనుకుంటే మీ జీవితం నర

కంగా మారిపోతుంది. ఇవన్నీ చేసేందుకు మీరు సిద్ధమేనా? పైగా మీరు అంత కష్ట పడ్డా ఫలితం దక్కుతుందని హామీ ఇవ్వ లేను.. మీరు రిస్క్ తీసుకుంటానంటే సరే, నా వల్ల వీలైన సహాయం నేనూ తప్ప కుండా చేస్తాను"

డాక్టర్ అంతగా వద్దని చెప్పినా అంశుని నా దగ్గరే ఇంట్లోనే అట్టిపెట్టుకోవాలని మనసు మొండికేసింది. గతంలో చిన్నూ గాడు నాతో అన్న మాటలు సీసం కరగ బోసి చెవిలో పోసినట్టు ఇంకా బాధ పెడు తూనే ఉన్నాయి. "అక్కా, నేను బాగానే ఉన్నాగా? నన్ను నీతో ఇంటికి తీసుకె ళ్ళవా? ఇంటికెందుకు రానివ్వరే? నాకే మైందక్కా? "

వాడలా అనగానే నాన్నవైపు కొంచెం ఆశగా చూశాను. ఆయన నిట్టూర్చి "డాక్ట ర్‌తో మాట్లాడి చూస్తాను, ఏమంటాడో!" అన్నాడు. కానీ ఆయన మొహంలో నాక ప్పుడు నిరాశే తప్ప ఇంకేమీ కనిపించ లేదు.

నాన్న అలా అనగానే చిన్నూ మొహంలో కోపం, రోషం తన్నుకొచ్చాయి. వాడు ఇంటికి రాలేకపోవడానికి నాన్నే కారణమని నిర్ణయించుకున్నట్టు ఆయన వైపు అసహ్యంగా చూశాడు. కానీ నా మీద వాడికి నమ్మకం పోలేదు, బతిమాలుతు న్నట్టు నా చెయ్యి పట్టుకుని "అక్కా! నీకు కూడా నేను ఇక్కడున్న పిచ్చివాడిలా కని పిస్తున్నానా? నాన్నకి చెప్పవా, నన్నింటికి తీసుకెళ్ళమని? " అంటూంటే నాకు కన్నీళ్ళు ఆగలేదు.

వాడికి నా కన్నీళ్ళు కనబడకూడదని నేలవైపు చూస్తూ "ఇవాళ ఇంటికెళ్ళాక నాన్నతో మాట్లాడి ఒప్పిస్తాలేరా. ఒకటి రెండు రోజుల్లో నువ్వు వచ్చేద్దువుగాని, సరేనా? " అన్నాను.

చిన్నూ ఏదో సన్నగా గొణిగాడు. అది నాకర్థం కాలేదు. నా లోపల ఏదో కల్లోలం! 'వీడు చిన్నప్పటి నా చిన్నూ యేనా? ఇంతవరకూ నా జీవితంలో ప్రతి క్షణాన్నీ పంచుకున్న ఆ తమ్ముడూ, వీడూ ఒకరేనా? అందరిలా నేను కూడా వీడు మారిపోయాడని అనుకుంటున్నానా? అసలీ డాక్టర్లకి వాడి సమస్యేమిటో తెలుసా? అసలు వాడికి సమస్య ఉందా లేదా, పోనీ అదైనా తెలుసా? వాడు చెప్పే ది మాకు అర్థమవకపోతే డాక్టర్లే మాకు వివరించాలా? డాక్టర్లు మాత్రం రోగులం దర్నీ ఒకే గాటనకట్టి చూడడం లేదూ? పాపం వీడు అన్యాయంగా ఇక్కడ ఇరు క్కుపోలేదు కదా? ఇలా నా మనసులో ఎన్నో అనుమానాలు, భయాలు.

వచ్చేప్పుడు చిన్నూ చూసిన చూపు, నా చేతులు పట్టుకుని బతిమాలడం గుర్తొచ్చి ఎన్నో రాత్రులు నేను నిద్రపోలేక పోయే దాన్ని. 'వాడికేమీ అవలేదు' అని నా మనసు గోల చేసేది. ఆ డాక్టర్ల చేతుల్లో పడ్డాక మాకు కూడా వేరే దారి లేకుండా పోయింది. డాక్టర్ల మీద పూర్తి నమ్మక మూ లేదు. అలాగనీ మొండిగా వాణ్ణి ఇంటికి తీసుకొచ్చే ధైర్యమూ లేదు. త్రిశంకు స్వర్గంలో ఉన్నట్టయింది మాస్థితి.

కానీ చిన్నూలో ఏదో మార్పు వచ్చిందని మాత్రం ఒప్పుకోక తప్పదు. చాలాకాలం వరకూ ఎవరూ గమనించలేదు. అందరి కన్నా ముందు వాడి ప్రవర్తనలో తేడా

పసిగట్టింది నేనే. నా తరవాత నాన్నకి కనిపించింది. అమ్మ గమనించిందో లేదో తెలీదు కాని పైకి ఆవిడ ఏమీ అనలేదు. కానీ నాన్న మార్పు అనుకునేది నాకు మార్పులా తోచలేదు. అది ఒకవేళ మార్పే అయితే వయసులో వచ్చే మార్పు తాత్కాలికంగా సృష్టించే అలజడి మాత్రమే. మా నాన్న దృష్టిలో అది మహాపాపమే అయినా, నా దృష్టిలో మాత్రం సహజంగా జరిగేదే. అదొక్కటే కాక ఇంకా కొన్ని మార్పులు కనిపించాయి. నా మనసు వాటిని కూడా ఊహాశక్తి మరీ ఎక్కువై ఫేంటసీలో బతికే మనిషిలో కలిగే వికారాలుగా సర్దుకుపోయిందేమో... కానీ వాటికి మిగతావాళ్ళు పెట్టిన పేరు నా గుండెని దహించివేసింది.

చిన్నూ గురించి నాకు తెలిసినంతగా ఎవరికీ తెలీదని అనుకునేదాన్ని. మేం ఆరుగురు తోబుట్టువులం. అందరిలోకీ చిన్నవాడు చిన్నూ. నేను వాడికన్నా రెండేళ్ళు పెద్ద. నాకూ మా అక్కకీ నాలుగున్నరేళ్ళు తేడా. అందుకే తనతో అంత చనువు వుండేది కాదు. చిన్నూ నేనూ రోజంతా కలిసి ఆడుకుంటూ ఉండేవాళ్ళం. మా ఇద్దరికీ అన్నిట్లోనూ పోటీయే. ఒకర్నొకరం వదలకుండా ఉంటూ, పోట్లాట వస్తే మాత్రం వెంటనే పెద్దవాళ్ళకి వెళ్ళి చెప్పేసేవాళ్లం. అక్కకీ అమ్మకీ చెప్పడం, వాళ్లు వినిపించుకోకపోతే సుప్రీంకోర్టు, నాన్నకి చెప్పడం. కానీ నాన్న రోజంతా ఇంట్లో ఉండడు కదా? అందుకే ఆయన మాకు దొరికే లోపల అన్నీ మర్చిపోయి మళ్ళీ ఆటల్లో పడిపోయేవాళ్ళం. అమ్మా, అక్కా నన్నే కోప్పడేవాళ్ళు. వాడు చిన్నవాడు కదా, అందుకే వాడంటే ఇంట్లో అందరికీ చాలా ముద్దు. అసలు వాడు చూసేందుకు కూడా ముద్దొస్తూ ఉండేవాడు. పచ్చని రంగూ, పెద్ద నుదురూ, నల్లటి కళ్ళూ, కొనదేలిన ముక్కూ, నవ్వితే ఎడమ బుగ్గమీద పడే సొట్టా, చాలా అందంగా ఉండేవాడు. పెద్దవాడయాక అమ్మాయిలు వీడంటే పడిచస్తారని అనేవాళ్ళు అందరూ. అది విని నాకు ఒక్కోసారి గర్వమనిపించినా, ఒక్కోసారి అసూయ కూడా కలిగేది.

పెద్దవాళ్ళు ఎవరి పనుల్లో వాళ్ళు లోపలెక్కడో ఉంటే ఇంక ఇల్లు రణరంగమే అయేది. ఒకర్నొకరం తరుముకుంటూ ఇల్లంతా పరుగులు పెట్టేవాళ్ళం. మంచాల కిందా, బల్లలకిందా దూరి ఒకరికొకరం అందకుండా తప్పించుకోడానికి చేసే ప్రయత్నంలో అన్ని వస్తువులూ తల్లకిందులైపోయేవి. వాడు నా జుట్టు పీకేవాడు. నేను వాణ్ణి గోళ్ళతో రక్కేదాన్ని. చివరికి నేనే ఓడిపోయి ఏడుపు లంకించుకునేదాన్ని. చిన్నూ అదేమీ పట్టించుకోకుండా పారిపోయేవాడు. వాడు నన్ను ఏడిపించినా వాణ్ణి ఎవరూ కోప్పడేవారు కాదు. అందరిలోకీ చిన్నవాడని గారాబం. పైగా నాకన్నా ఎక్కువ బలంగా ఉండడం వల్ల వాడే ఎప్పుడూ గెలిచేవాడు.

మా ఇద్దరికీ వేసవి సెలవుల్లో గొడవలు మరీ ఎక్కువగా ఉండేవి. అల్లరి ఎక్కువయేది. సెలవులకి ఎప్పుడూ అమ్మమ్మా వాళ్ళింటికి వెళ్ళేవాళ్ళం. అక్కడ మా పోట్లాటలకి న్యాయం మా అమ్మమ్మ చెప్పేది. అప్పుడు నా వయసు ఎనిమిదేళ్ళు, చిన్నూ ఆరేళ్ళవాడు. ఇద్దరం రోజంతా పేకాడుతూ గడిపేవాళ్ళం. ఎవరు ఓడిపోయినా ఓడిపోయామని ఒప్పుకునేవాళ్ళం కాదు. ప్రతిసారీ ఆట పోట్లాటగానే ముగిసేది. ఏడుస్తూ వెళ్ళి అమ్మమ్మకి ఫిర్యాదు చేసేదాన్ని. అమ్మమ్మ బుజ్జగించగానే అన్నీ మర్చిపోయేదాన్ని. మా పోట్లాటలు ఇంట్లో అందరికీ విసుగు తెప్పించేవి.

ఒకసారి అందరిముందూ నాకు అవమానం అనిపించే సంఘటన ఒకటి జరి

గింది. నాకప్పుడు తొమ్మిదేళ్ళుంటాయేమో. ఎప్పుడూ విపరీతమైన కడుపునొప్పి వస్తూ ఉండేది. ఎంతమంది డాక్టర్లకి చూపించినా ఏమీ కారణం కనిపెట్టలేకపోయారు. నాన్న నన్ను స్పెషలిస్టు దగ్గరికి తీసుకెళ్తా నన్నాడు. అమ్మా, నాన్నా, నేనూ, చిన్నూ రైలెక్కి అమృత్‌సర్ వెళ్ళాం. అమ్మా, నాన్నా ఎక్కడికెళ్ళినా చిన్నూ వెంట వెళ్ళే వాడు. అందుకు కూడా వాడంటే నాకు ఈర్ష్యగా ఉండేది. కానీ ఈ సారి మాత్రం వాడు మాతో రావడం నాకు బాగా అని పించింది. రైల్లో కూడా మేం ఎన్నో ఆటలు ఆడుకున్నాం. డాక్ బంగళా చేరు కున్నాక అక్కడ కూడా బాగా అల్లరి చేశాం. ఇద్దరం ఇంకో ఊరికి సెలవులకి వెళ్లడం అదే మొదటిసారి. అక్కడ మేమి ద్దరం అసలు పోట్లాడుకోనే లేదు. నాకు ఒక్కసారి కూడా కడుపునొప్పి రాలేదు. మర్నాడు, డాక్టర్ దగ్గరకెళ్ళాం. రక్త పరీక్షా, మల మూత్రాల పరీక్షా, అన్ని రకాల పరీ క్షలూ చేశారు. ఎక్కడా ఏమీ కారణం కని పించలేదు. పైగా అక్కడికెళ్ళినప్పట్నించీ చిన్నూకీ నాకూ విపరీతమైన ఆకలి వేసేది. మామూలు కన్నా చాలా ఎక్కువ తిండి తినేవాళ్ళం. డాక్ బంగళాలోని వంటాయన పల్చగా, అతి మెత్తగా ఉండే రొట్టెలు చేసేవాడు. నేను పదేసి రొట్టెలు తినేసేదాన్ని. అయినా కడుపునొప్పి వచ్చేది కాదు. మూడు రోజుల్లో అన్ని రకాల వైద్య పరీక్షలూ అయిపోయాయి. డాక్టర్‌కి నాలో ఎటువంటి వ్యాధీ కనిపించకపోయేసరికి, మానసికంగా నేను ఆరోగ్యంగా ఉన్నానా లేదా? అని తెలుసుకునేందుకు అమ్మానా న్నల్ని పిలిచి వాళ్ళతో మాట్లాడాడు. నాకే మైనా అసంతృప్తిలాంటిది ఉందా? మామూలుగా ఎప్పుడూ సంతోషంగా ఉంటానా? లేక లోపల్లోపల కుళ్ళుతూ, అందరికీ దూరంగా ఒంటరిగా గడుపు తానా? అని అడిగాడు. అమ్మ నా గురించి ఎప్పుడూ ఆనందంగానే ఉంటుం దని చెప్పింది. కానీ నేను చిన్నూతో ఎప్పుడూ పోట్లాడుతూనే ఉంటానని మాటల్లో చెప్పేసింది.

అంతే, డాక్టర్ ఆ మాట పట్టుకున్నాడు. అమ్మనీ నాన్ననీ సంతృప్తి పరిచేందుకు ఏదో ఒక కారణం చెప్పాలి కదా? శారీర కంగా నాలో ఆయనకి ఎటువంటి సమస్యా కనిపించలేదు. వెంటనే "అదీ అసలు సంగతి! చిన్నూని అందరూ ఎక్కువ ముద్దు చేస్తారు. మీ అమ్మాయి అసూయతో అందరి దృష్టీ ఆకర్షించేందుకే అలా కడుపునొప్పని అంటూ ఉంటుంది. కడుపునొప్పికి నాకు వేరే కారణమేదీ కని పించడం లేదు. మీ అమ్మాయి ఆరోగ్యం చక్కగా ఉంది" అన్నాడు డాక్టర్.

ఆ డాక్టర్ ఇంగ్లాండులో చదువుకున్నా డట. అమ్మకీ నాన్నకీ ఆయన మాటల మీద బాగా గురి కుదిరింది. అంతే! మర్నాటినించీ ఇంట్లో ఇదే విషయం మీద చర్చించడం మొదలెట్టారు. ఇంటికొచ్చిన చుట్టాలకీ, స్నేహితులకీ ఆ డాక్టరు గొప్ప దనం గురించి ఒకటే చెప్పడం. నాకు చాలా బాధేసేది, అవమానమనిపించేది. చిన్నూకి నన్ను ఏడిపించేందుకు ఇంకొక అస్త్రం దొరికినట్టయింది. ఆ డాక్టర్ మీద నాకు చెప్పలేనంత కోపం వచ్చేది. అసలు డాక్టర్లంటేనే అసహ్యం వెయ్యసాగింది.

ఇప్పుడు కూడా డాక్టర్ల మీదా, వాళ్ళ వృత్తిమీదా అసహ్యం వేస్తోంది. చిన్నప్ప ట్లాగే మళ్ళీ వాళ్ళు నన్ను మోసం చేస్తున్నా రనిపిస్తోంది.

నాకు కడుపునొప్పి వస్తూనే ఉంది, కానీ ఇంట్లో వాళ్ళకి దాన్ని గురించి చెప్పడం మానేశాను. ఎప్పట్లాగే దానంతట అదే తగ్గిపోయేది. ఎవరిని నమ్మాలో తెలీ కుండా పోయింది నాకు. నమ్మకపోయినా ఇబ్బందే! మనలోని అసంపూర్తిని ఇతరుల అసంపూర్తితో నింపే ప్రయత్నం చేసిన

ప్పుడు, ఏమీ ప్రయోజనం లేకపోగా, మరింత పోగొట్టుకున్న భావన కలుగుతుంది.

ఆరుగురు పిల్లల్ని కన్నాక అమ్మలో ఓపిక చచ్చిపోయింది. చిన్నూ అంటే ఎంత ప్రేమ ఉన్నా వాడి అల్లరికి తట్టుకోలేక చీదరించుకునేది. వాడిక్కావలసింది ఇవ్వకపోయినా, చెయ్యకపోయినా చాలా గొడవ చేసేవాడు.

నాకింకా గుర్తే! నేనప్పుడు ఆరో తరగతిలో ఉన్నాను, వాడు నాలుగులో ఉన్నాడు. నాది మిడిల్ స్కూలు. వాడిది ప్రైమరీ స్కూలు. వాడి క్లాసులు ఒంటిగంటన్నరకి అయిపోయేవి. మధ్యాహ్నం మా భోజన సమయం కూడా దాదాపు అదే. ఒక్కోసారి వంట కొంత ఆలస్యమయేది. అందరం వంట అయేదాకా ఆగేవాళ్ళం. నాన్నకి కొద్దిరోజుల క్రితమే లక్నోకి బదిలీ అయింది. ఇంకా వంటకీ, ఇంటిపనికీ ఎవరూ దొరకలేదు. అమ్మ ఒక్కతే మొత్తం పని చేసుకోవలసి రావడం వల్ల ఒక్కోసారి వంట పూర్తయేందుకు ఆలస్యమయేది. కానీ అలాటప్పుడు చిన్నూ ఆకలితో ఉన్నాడంటే ఇల్లు పీకి పందిరేసేవాడు. ఒకసారి నేను స్కూలునించి ఇంటికొచ్చేప్పటికి వాడు ఇంటిమీద రాళ్ళు రువ్వుతున్నాడు. 'ఉండరా.. అయిపోవచ్చింది, కిటికీ అద్దాలు పగులుతాయి, ఊరుకోరా!' అని అమ్మ వంటింట్లోంచి అరుస్తోంది. కానీ చిన్నూ వినిపించుకోటం లేదు. నేను వాడిని కొట్టేందుకు వెంటపడితే పారిపోయాడు. కానీ అమ్మ నన్నే తిట్టింది. వాడు అన్నం తినకుండా అడ్డుపడ్డానని తప్పుపట్టింది. సాయంత్రం నాన్న వచ్చాక వాడు చేసిన అల్లరి గురించి చెపుతానంటే కూడా అమ్మ నన్నే తిట్టింది, "చాల్లే, అసలే వాడు పొద్దున్నించీ ఏమీ తినలేదు. నువ్వు నోరు తెరవద్దు" అంది.

కానీ అమ్మమీద రాళ్ళు రువ్వినందుకు నాకైతే వాడిమీద చాలా కోపం వచ్చింది. అయినా అమ్మ మాత్రం వాణ్ణే వెనకేసుకొస్తోంది! ఇంట్లో అందరూ వాడి స్వభావమే కాస్త దూకుడుగా ఉంటుందనీ, వాణ్ణి తిట్టడం, కొట్టడం వల్ల లాభమేమీ ఉండదనీ ఊరుకుంటూ భరిస్తున్నారు. అదేమంత పెద్ద విషయం కాదన్నట్టు ప్రవర్తిస్తున్నారు. బైటికెళ్ళినప్పుడు నన్ను కాపాడడం తన బాధ్యత అన్నట్టు ప్రవర్తించేవాడు. ఒకసారి ఒక అబ్బాయి నన్ను తోసి కింద పడేశాడు. చిన్నూ వాణ్ని చితకబాదాడు. ఆ అబ్బాయి అమ్మా నాన్నా మా ఇంటికి వచ్చి గొడవ చేశారు.

చిన్నూ చక్కగా చదువుకునేవాడు. మంచి మార్కులు తెచ్చుకునేవాడు. వాణ్ణి డాక్టర్ చెయ్యాలని అమ్మా నాన్నా అనుకునేవాళ్ళు. పిల్లలందర్లోకీ తెలివైనవాడు వాడేననీ, తప్పక డాక్టరవుతాడనీ అనేవాళ్ళు. అది విని నాకు అసూయ కలిగేది. 'నేను కూడా డాక్టరయి చూపిస్తాను' అనుకునేదాన్ని మనసులో. చిన్నూ నా కన్నా తెలివైనవాడని ఎవరైనా అంటే భరించలేకపోయేదాన్ని. మా ఇద్దరికీ పరీక్షల్లో మంచి మార్కులే వచ్చేవి. నాకు ఒక్కొక్కప్పుడు వాడికన్నా ఎక్కువ మార్కులే వచ్చినప్పటికీ అమ్మా నాన్నా వాణ్నే ఎక్కువ పొగిడేవారు. నన్ను కూడా కొంచెం పొగిడేవారనుకోండి... అయినా ఆ తేడా నా భ్రమో, నిజమో తెలీదు.

పదో తరగతిలోకొచ్చేసరికి డాక్టరవాలన్న కోరిక నాకు లేకుండా పోయింది. కానీ చిన్నూ బుర్రలో పెద్దవాళ్ళు ఆ కోరికని బలంగా నాటారు. ఒకసారి నాకు ఫ్లూజ్వరం వచ్చింది. వాడికి నాతో ఏదో ఒక కారణానికి పోట్లాడాలని ఉంది. కానీ ఆ జ్వరంతో నేను వారం రోజులు పడకేశాను. "నేను డాక్టరయాక ఫ్లూని ఒక్క రోజులో తగ్గించే మందు కనిపెడతాను" అన్నాడు చిన్నూ. మళ్ళీ కొంతసేపు ఆగి,

“కానీ బహుశా నేను సైకియాట్రిస్ట్ అయి తేనే బావుంటుందేమో!? అప్పుడు అన్ని రోగాలకీ మూలకారణం తెలుసుకోవచ్చు, అవునా అక్కా? ” అన్నాడు.

నా కడుపునొప్పి విషయం నన్ను మర్చి పోనిచ్చేవాడు కాదు. మామూలుగా మొద లైన ఆ మాట కాలక్రమాన వాడు డాక్టర్ అయితేగాని వీల్లేదన్నంతగా నాటుకుంది. పురుగులా అందరి మనసుల్నీ తొలిచె య్యడం మొదలెట్టింది.




అప్పట్లో నాన్నకి ఢిల్లీకి బదిలీ అయింది. నేనప్పుడు బి.ఎ. మొదటి సంవత్సరంలో ఉన్నాను. చిన్నూ హైస్కూల్ పరీక్షా ఫలితాల కోసం ఎదురు చూస్తున్నాడు. అన్ని ఇంజనీరింగ్ కాలేజీ లకి, మెడికల్ కాలేజీలకి దరఖాస్తులు పంపుతున్నాడు. ఆ రెండింట్లో సీట్లకి పోటీ ఎంత తీవ్రస్థాయిలో ఉందో చిన్నూకి గాని, ఇంట్లోవాళ్ళకి గాని తెలీదు. నేను మొదట్నించే ఈ విషయంలో కల్పించుకో కుండా దూరంగా, నా ఆర్ట్స్ కోర్సులో ఆనందంగా గడుపుతున్నాను! కానీ చిన్నూ అప్పుడప్పుడూ నెర్వస్ అయిపోయేవాడు. ‘సీటు రాకపోతే ఎలా? ’ అని తెగ గాభరా పడేవాడు. ‘ఎక్కడో ఒకచోట సీటు దొర క్కపోదు’ అనే నమ్మకం మాత్రం వాడికి ఉండేది.



ఒకసారి నన్ను “అక్కా! నీకేమనిపి స్తోందే? నాకు మెడికల్‌లో సీటొస్తుందా? ఇంజనీరింగ్‌లోనా? ” అని అడిగాడు.

“నీకేది ఇష్టం? ”

“మెడికల్ తరవాత ఇంకా పెద్ద చదు వులు చదివేందుకు ఇంగ్లండుకి వెళ్తాను!”

అమృత్‌సర్ డాక్టర్ని వాడింకా మర్చిపో యినట్టు లేదు.

మొదటిసారి ఆడపిల్లనైనందుకు సంతోషం వేసింది. నామీద ఇలాంటి ఒత్తిళ్ళూ, నా నుంచి ఇలాంటివి మరొకరు ఎదురుచూడడం లేవు. చిన్నప్పుడు అమ్మా నాన్నా గురించి ఉన్న అసంతృప్తి మొత్తం పోయింది. మంచి మార్కులు తెచ్చుకో మనీ, కెరీరు గురించి ఆలోచించమనీ నన్ను వాళ్ళెప్పుడూ పీడించలేదు. కాలేజీలో క్లాసులు ఎగ్గొట్టి సినిమాలకెళ్ళినా, షాపింగ్ కని వెళ్ళి బజారులో తిరిగినా, నన్నెవరూ ఏమీ అనేవారు కాదు. అదే చిన్నూ ఒకటి రెండు మార్కులు తక్కువ తెచ్చుకున్నా కోప్పడేవాళ్ళు. ఇంకొన్నేళ్ళలో నాన్న రిటైర వబోతున్నాడు. అందుకే బహుశా చిన్నూ గురించి ఆయనకంత ఆందోళన. తను రిటైరయేలోగా వాడు ఏదో ఒక రకంగా చదువులో సెటిలవాలని అనుకునేవాడా యన. చిన్నప్పుడు వాణ్ణి నెత్తికెక్కించు కున్న నాన్నకి ప్రస్తుతం వాణ్ణి ఎప్పుడూ కోప్పడడం, హెచ్చరించడం, వాడి గురించి కంగారుపడడం ఎక్కువైంది. మా అన్న య్యలిద్దరికీ పెళ్ళయి బెంగళూరులో ఉంటున్నారు. వాళ్ళనించి నాన్న ఏమీ ఆశించడు.

ఇకపోతే ఆడపిల్లల దగ్గర్నించి ఆశించడ మనేది వాళ్ళ రక్తంలోనే లేని విషయం. చిన్నూని ఎలాగైనా వాడికాళ్ళమీద వాడు నిలబడేట్టు చెయ్యాలి. అదే ఆయన లక్ష్యం. నాన్న తన కూతుళ్ళని అసలు ఎందుకు చదివించాడా? అని అప్పుడ ప్పుడు నేను ఆశ్చర్యపోతూ ఉంటాను. మా చదువులన్నీ మధ్యలోనే ఆగిపోయాయి.

ఎం.ఎ. పూర్తి కాకుండానే పెళ్ళయిపో యింది మాకు. చదివిన చదువంతా దమ్మిడీకి పనికిరాకుండా పోయింది. 'అబ్బాయిలకి చదువుకున్న అమ్మాయిలు కావాలి కాబట్టే ఆడపిల్లల్ని చదివిస్తున్నాం' అంటూ ఉంటారు అందరు తల్లిదండ్రులూ. నాకూ మా పెద్దక్కకీ ఎప్పుడూ మంచిమార్కులు వచ్చేవి. అది చూసి అమ్మా నాన్నా సంతోషించేవాళ్ళు. అందరికీ ఆ సంగతి గొప్పగా చెప్పేవాళ్ళు. 'ఆడపిల్ల ఎంత బాగా చదువుకుంటే ఏం లాభం? ఎప్పుడో ఒకప్పుడు పరాయింటికి వెళ్ళవలసిందే కదా!' అనేవాళ్ళు. ఇప్పుడు ఆలోచిస్తే మేం బుద్ధిమంతులవడం వల్ల సమాజంలో వాళ్ళకి గౌరవం లభించిందనుకున్నారని అనిపిస్తుంది నాకు. 'అమ్మాయిలే ఇంత బాగా చదువుతూంటే ఆ కుటుంబంలో ఇక అబ్బాయిలకి ఢోకా ఏముంటుంది?' అని అందరూ అనుకుంటారన్న ధీమా కూడా ఉందేమో తెలీదు. అసలు అమ్మ జోక్యం లేకపోతే నాన్న మమ్మల్ని ఎం.ఏ. పూర్తిచెయ్యనిచ్చి ఉండేవారే. ఆవిడే మా పెళ్ళిళ్ళు చెయ్యాలని పట్టుపట్టింది.

నా విషయంలో ఎలా జరిగినా ఒకటే. బాగా చదవకపోయినా ఎవరూ ఏమీ అనరు. బాగా చదివి ఫస్టు మార్కులు తెచ్చుకున్నా పై చదువులు చదవనివ్వరు. ఎలా చూసినా నాకు నష్టమే అని తెలుసుకునేందుకు నాకు చాలాకాలం పట్టింది. నేను మొండికేసి పెద్ద రాద్ధాంతం చేసేసరికి నాన్న అమ్మని ఒప్పించాడు. అమ్మ ఒప్పుకోడానికి కూడా కారణం, 'మంచి సంబంధం దొరికేదాకా చదువుకోనీలే' అనుకోడమే. అసలు అమ్మ ఎప్పుడూ ఏదో

బాధలో ఉన్నట్టే కనిపించేది. మాతో ఉన్నా ఆవిడ ఎక్కడో దూరంగా ఉన్నట్టు అనిపించేది మాకు.

నేను కూతుళ్ళలో అందరికన్నా చిన్న దాన్ని కావడం, చిన్నూ నేనూ చాలా ప్రేమగా ఉండడం వల్లనేమో, పెళ్ళయే దాకా నన్ను అమ్మ ఎం.ఏ.లో చేరి చదువుకోనిచ్చింది. వాడి భవిష్యత్తూ నా భవిష్యత్తూ ముడిపడి ఉన్నాయని ఆవిడకెందుకో గట్టి నమ్మకం ఉండేది. చిన్నూ చాలా కష్టపడి చదవసాగాడు. మధ్యరాత్రి నాకు మెలకువొచ్చి చూస్తే వాడి బల్లమీద టేబుల్ ల్యాంప్ వెలుగుతూ ఉండేది. ఒక్కోసారి అలాగే బల్లమీద తలపెట్టి నిద్రపోతూ కనిపించేవాడు, నేను చప్పుడు చెయ్యకుండా లైటు ఆఫ్ చేస్తే వెంటనే లేచి, "ఉండనీ అక్కా, చదువుకోవాలి" అనేవాడు.

కేవలం ఆరు మార్కులు తక్కువ వచ్చి చిన్నూ ఫస్ట్‌క్లాస్ పోగొట్టుకున్నాడు. ఏడాదంతా ఎంత కష్టపడినా ఆ ఎనిమిది రోజుల్లో మనం రాసే పరీక్షల్లోనే ఫలితం తెలిసేది. ఆ తరవాత ఎంత బాధపడ్డా ఆ మచ్చ పోదు. తరవాత రాబోయే మచ్చలని మీరు నివారించినా ఒకసారి పడ్డ మచ్చమాత్రం పోదు. అలాటి మచ్చలు, ఇంకా అంతకన్నా పెద్దవి కూడా రావచ్చునీ, ఇదేమంత బాధపడాల్సిన విషయం కాదనీ ఆ చిన్న వయసులో తెలీదు. పైగా ఇదేదో పెద్ద చీకటి గుహలాగా మింగేస్తూ, మనిషిని పాతాళానికి నెట్టేసేట్టు కనిపిస్తుంది. చిన్నూ భవిష్యత్తు మీద నల్లటి మేఘాలు కమ్ముకున్నాయి. నాన్న ఎంతో ప్రయత్నించాడు. తెలిసినవాళ్ళచేత సిఫార్సు కూడా చేయించాడు. కానీ ఆయనకి పెద్ద హోదా లేకపోవడంతో, ఎవరూ పట్టించుకోలేదు. చిన్నూకి ఇంజనీరింగ్‌లో కాని, మెడికల్‌లో కానీ సీటు రాలేదు.

నాన్న పూర్తిగా నిస్పృహ చెందాడు. మాటి మాటికీ నిట్టూరుస్తూ, "ఇప్పుడిక వీడేం చెయ్యాలో!" అనుకోసాగాడు.

చిన్నూ పూర్తిగా డీలా పడిపోయి, ఇంట్లో ఎవరితోనూ అసలు మాట్లాడకుండా ఉండడం మొదలెట్టాడు. రోజంతా ఎక్కడో బైట తిరగడం, నాన్నకి ఎదురుపడకుండా ఉండేందుకు ప్రయత్నించడం.. ఇదీ వరస. నాన్న ఇంటికొచ్చి చిన్నూ ఎక్కడని అడిగేవాడు. కానీ మేం ఆయన ప్రశ్న విననట్టు నటించేవాళ్ళం. ఇంట్లో అందరికీ ఎవరో చనిపోయినంత శోకం, దిగులూ! పైగా పెద్దన్నయ్య రాసిన ఉత్తరం కూడా అదే ధోరణిలో ఉంది. 'చిన్నూ రిజల్ట్ తెలిసి చాలా బాధపడ్డాం. వాడి జీవితం ఇక పాడైపోయినట్టే! ఇంజనీర్రూ, డాక్టరూ కాలేకపోతే ఇక ఏ గుమస్తా ఉద్యోగంలోనో జీవితాంతం మగ్గాల్సిందే. ఇకపోతే మరో అవకాశం లేకపోలేదు. అదే సివిల్ సర్వీస్ పరీక్ష, ఐఏఎస్! బీఏలో బాగా కష్టపడి చదవాలి. అదీకాక ఐఏఎస్‌కి కూడా చాలా గట్టి పోటీ ఉంటుంది. వీడు దాన్లోనైనా పాసవుతాడో లేదో! ఏం చేసినా ఈ వయసులోనే చెయ్యాలి. ఆడుతూ పాడుతూ, తింటూ తిరుగుతూ గడపవచ్చు, బాగా శ్రద్ధగా చదువుమీదా దృష్టి పెట్టచ్చు. నేనెప్పుడూ మీతోనూ, అమ్మతోనూ చెపుతూనే ఉన్నాను, చిన్నూని అంత ముద్దుచేసి

పాడు చెయ్యొద్దని. కానీ నా మాట ఎవ రైనా వినిపించుకుంటేగా? '

అన్నయ్య ఉత్తరం చూశాక నాకూ చిన్నూ విషయంలో ఆదుర్దా కలిగింది. నిజంగానే ఇంట్లో ఎవరో చనిపోయినంత భయం వేసింది. చిన్నూ మొహంలో నాకా శ్మశాన నిశ్శబ్దమే కనిపించేది. నాన్న ఎప్పుడూ అలా నిరాశగా ఉండడం కూడా నేను భరించలేకపోయేదాన్ని. నాలోనూ భయంకరమైన నిరాశ నల్లటి నీడలా పరు చుకోసాగింది. పాపం నాన్న చిన్నూ మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. చిన్నూకి పదహారేళ్ళు నిండేవరకూ ఆయన ఎంత ఆనందంగా ఉండేవాడు! కానీ ఇప్పుడు ఆయన మొహంలో ఆ ఆనందమంతా తుడిచిపెట్టుకుపోయింది. రుతువులు మారినా మళ్ళీ అవే అవే కాలాన్ని బట్టి వస్తూ ఉంటాయి. కానీ నాన్నలో వచ్చిన మార్పు అలాంటిది కాదు. చిన్నూతోబాటు ఆకాశంలో ఎగరాలని చూసిన ఆయన ఇప్పుడు రెక్కలు తెగిన పక్షిలా పైకి ఎగ రలేకుండా అయిపోయాడు. నేలమీదే రాజీ పడి బతకాల్సిన పరిస్థితి వచ్చింది.

చిన్నూ మామూలు డిగ్రీ కాలేజీలకి అప్లి కేషన్లు కూడా పంపలేదు. ఆ ఏడాది ఇంట్లో కూర్చోడం ఇష్టంలేక ఒక మామూలు కాలేజీలో చేరాడు. బీఎస్సీ అయిపోయాక ఇంకో చోట అప్లై చెయ్యొ చ్చులే అని సర్ది చెప్పుకున్నాడు. వాడు బుద్ధిగా కాలేజీకి వెళ్లడం ప్రారంభించాడు. నా కాలేజి క్యాంపస్‌లో కాబట్టి నేను పొద్దున్నే బస్సులో వెళ్లిపోయేదాన్ని. వాడి కాలేజీ చాలా దగ్గరలో ఉండేది. అందుకే వాడు తాపీగా ఇంటి నించి బైలుదేరేవాడు. సాయంత్రం ఇంటికొచ్చాక మేం కాలేజీ కబుర్లు చెప్పుకునేవాళ్ళం.

"ఏరా చిన్నూ.. కాలేజీ ఎలా ఉంది? "

"బాగానే ఉంది"

"బాగానే ఉండడమేమిటి? నచ్చిందా లేదా? "

"ఊc..."

"ఏమైంది? నచ్చలేదా? "

"లేదు, బాగుంది"

"..."

"..."

"లెక్చరర్లు ఎలా ఉన్నారు? "

"ఫరవాలేదు. ఇంకా క్లాసులు సరిగ్గా జర గడంలేదుగా"

"మన స్కూలువాళ్ళు తెలిసిన వాళ్లెవ రన్నా అక్కడ చేరారా? "

"ఇంతవరకూ ఎవరూ కనబడలేదు. నేను కూడా ఎవరైనా కనిపిస్తారేమోనని చూస్తున్నాను. కనబడకపోతేనే నయంలే. ఇద్దరికీ ఇబ్బంది"

"ఎందుకు ఇబ్బంది? "

"ఏం లేదు.. వీడూ ఇక్కడికే వచ్చాడా.. అనుకుంటారు"

"అంటే? " అన్నాను అర్థం కానట్టు నటిస్తూ.

"అక్కా! ఎందుకో స్కూల్లో కూడా అందరూ అమ్మానాన్నల్లాగే నేనేదో పొడి చేస్తాననుకునేవాళ్ళు. అందుకే ఇలాటి మామూలు కాలేజీలని చాలా హీనంగా అనుకునేవాణ్ణి. దేవుడు పగ తీర్చు కుంటాడంటారు.. అది ఇదేనేమో!"

"ఏమిట్రా ఆ మాటలు? "

వాడు కాసేపు ఏమీ మాట్లాడలేదు. తర

వాత "అక్కా! నేనంత తెలివైనవాణ్ణి కాదా? " అని అడిగాడు.

"ఎందుకలా అడుగుతున్నావు? " అన్నాను.

"నేను తెలివైనవాణ్ణి అనుకుంటున్నాను. మరి ఇలా ఎందుకైంది? "

"తెలివికి ఇదొక్కటే కొలమానం కాదు చిన్నూ"

"కానీ అందరికీ ఇదే కొలమానం కదా? నేను చూస్తూనే ఉన్నాగా.. నువ్వూ, అమ్మా, నాన్నా, అన్నయ్యా.. మీరందరూ మారిపోయారు. మునుపటిలా నా మీద మీకు ప్రేమ ఉందా? నాకు మీ కళ్ళలో తేడా కనిపించడం లేదనుకుంటున్నావా? ఒక నెలలోపలే ఎంత మార్పు! నేను మరీ అంత తెలివితక్కువ వాణ్ణి కాదక్కా. ఆ మాత్రం గ్రహించలేనని అనుకుంటు న్నావా? నాకంతా తెలుస్తూనే ఉంది"

అంతే, హఠాత్తుగా వాడు మాట్లాడడం ఆపేసి గదిలోంచి బైటికెళ్ళిపోయాడు. వాడికి తగిలిన దెబ్బ ఎంత పెద్దదో నేను గ్రహించాను. కానీ అది ఇప్పుడు నగ్నంగా బైటికి స్పష్టమైపోయింది. నేనేమైనా సాయం చెయ్యగలనా.. ఏం చెయ్యను? అలా చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపో యాను. కేవలం సానుభూతి చూపించినంత మాత్రాన ఈ గాయం మానదు!

కాలేజీ చదువు, స్నేహితులూ తాత్కా లికంగా నా ధ్యాసని తమవైపు తిప్పుకున్నా, ఎక్కడో ఒక మూల చిన్నూ గురించి ఆలో చనలు ఉంటూనే ఉండేవి. ఏదో విధంగా నా తమ్ముడికి సంతోషాన్నిమ్మని దేవుణ్ణి ప్రార్థించేదాన్ని. కానీ నాకు వాడిలో ఆనందం ఏమాత్రం కనిపించేది కాదు. ఒకట్రెండు సార్లు ఇద్దరం కలిసి సినిమా చూసేందుకు వెళ్ళాం. ఆ తరవాత వాడు రాననేశాడు. 'నా స్నేహితురాలి ఇంటికి వెళ్తున్నాను, వస్తావా? ' అని అడిగితే, రాన న్నాడు.

ఒక రోజు నేనింటికి వచ్చేసరికి వాడు ముందే ఇంటికొచ్చి ఉన్నాడు. మామూలుగా వాడి క్లాసులు ఆలస్యంగా ముగుస్తాయి.

"ఇవాళ ఇంత త్వరగా వచ్చేశావేం? " అన్నాను.

"ఊరకనే" అన్నాడు వాడు.

"క్లాసులు జరగలేదా? "

"బోరు కొడుతోంది. అక్కడేమీ జరగదు"

"స్నేహితులెవరూ లేరా నీకు? "

"స్నేహం చేసేట్టు ఎవరూ లేరక్కడ. అందరూ పల్లెటూరి బైతులు!"

"ఎవరో ఒక్కరైనా..? "

"కాలేజీకి వెళ్ళాలనిపించడంలేదు"

"ఏమిట్రా అలా అంటావు? ఇంకోసారి మార్కులు సరిగ్గా రాకపోతే ఆ కాస్త చాన్సు కూడా ఉండదని తెలుసు కదా? "

"హూ! అసలు చాన్సు ఉంటేగా పోయేందుకు? "

"అయినా అలా నీరుకారిపోకు"

"ఏం చెయ్యమంటావే, అక్కడ నాకస్సలు బాలేదు!"

వాడు నిస్త్రాణగా పక్కమీద వాలిపో యాడు. వాడి కళ్ళు పైకప్పుకేసి తదేకంగా చూడసాగాయి.

ఆ తరవాత తరచూ కాలేజీకెళ్ళకుండా చాలాసేపు పక్కమీదే పడుకుని ఉండిపో సాగాడు. నేను మూడూ మూడున్నరకి ఇంటికొచ్చేసరికి కూడా వాడలాగే పడుకుని కనిపించేవాడు.

అమ్మ విసుక్కునేది. "ఏమైందో వీడికి? అన్నం తినడానికి రమ్మంటే రాడు. సాయంకాలం నాలుగ్గంటలకి ఎంతో కొంత తింటాడు. అంతవరకూ అలా పడుకునే ఉంటాడు"

సాయంత్రం నాన్న వచ్చేసరికి వాడు ఇంట్లో ఉండేవాడు కాదు. తయారై ఎటో వెళ్ళేవాడు. కొన్నాళ్ళు అమ్మ వాడిలో

వచ్చిన ఈ మార్పును నాన్నకి చెప్పకుండా దాచింది. నన్ను కూడా చెప్పద్దంది. కానీ కొన్నాళ్ళకి నాన్న ఇంట్లో ఉన్నప్పుడు కూడా పడుకునే ఉండడం మొదలెట్టాడు. ఒక ఆదివారం మధ్యాహ్నం చిన్నూ అందరితో పాటు అన్నం తినేందుకు బల్ల దగ్గరికి రాకపోవడం చూసి నాన్న ఆశ్చర్యపోతూ, "చిన్నూ ఇంకా లేవలేదా? " అని అడిగాడు.

అమ్మ ఏమాత్రం తొణక్కుండా, అదేమంత పెద్ద విషయం కాదన్నట్టు "ఈమధ్య అలాగే చేస్తున్నాడు" అంది.

చిన్నూ విషయంలో అమ్మ ప్రవర్తించే తీరు నాకసలు అర్థమయేదే కాదు. ఎందుకిలా వాడి ప్రవర్తనలో ఏమీ తేడా లేనట్టు మాట్లాడుతుంది? తనని తాను మభ్యపెట్టుకుంటోందా లేక అమ్మకే ఏమైనా సమస్య ఉండి అందరి దగ్గరా దాస్తోందా? మా అమ్మ మొహంలో అప్పుడప్పుడూ ఆమె మనసులో బాధ పడుతున్నట్లు నాకు కనిపించేది.

"ఏమిటిది? ప్రతిరోజూ వీడిలాగే పడుకుంటాడా? పొద్దున్న నేను ఆఫీసుకెళ్ళేటప్పుడు కూడా నిద్రపోతూనే ఉంటాడు!" అని అరిచాడు నాన్న.

ఆయన లేచి వాడి గది గుమ్మం దగ్గర కెళ్ళి సింహంలా గర్జించాడు "రా, వచ్చి అన్నం తిను"

చేతులూమొహం కడుక్కోకుండా చిన్నూ బల్ల దగ్గరకొచ్చి కూర్చోవడం చూసి అమ్మ కోప్పడింది. "వెళ్ళి, కనీసం పళ్ళైనా తోముకుని రా. అలా ఎలా తింటావు? "

చిన్నూ వెంటనే లేచి వెళ్ళాడు. వాడు మొహం కడుక్కుని వచ్చే లోపల మా అందరి భోజనాలూ అయిపోయాయి.

వాడు మాట్లాడకుండా భోజనాల బల్ల దగ్గరికి వచ్చి కూర్చున్నాడు. వాడి మొహంలో విచిత్రమైన భయమూ, తప్పు చేశానన్న భావమూ కనిపించాయి. అన్నం పెట్టమని అడక్కుండా అలా ఎంతసేపు కూర్చునేవాడో కానీ అమ్మ, "అన్నీ మళ్ళీ వేడిచేసి తీసుకొస్తున్నాను. ఇలా బైటికొచ్చి ఎండలో కూర్చుని తినరాదూ? మేమందరం అక్కడే కూర్చుంటాం కాసేపు" అంది.

"లేదు, నాకిక్కడే పెట్టు" అని ముక్తసరిగా జవాబు చెప్పాడు చిన్నూ.




**అ**ర్ధవార్షిక పరీక్షలు దగ్గర పడ్డా చిన్నూ ఏమీ చదవటంలేదు. నాన్న బలవంతంగా వాణ్ణి కాలేజీకి పొద్దున్నే తోలేస్తాడు. అక్కడికెళ్ళాక వాడేం చేస్తాడో మాకెవరికీ తెలీదు. తను క్లాసులన్నింటికీ వెళ్తున్నానని వాడు అంటాడు గాని, అటెండెన్స్ తక్కువైందని వాణ్ణి పరీక్షలకి కూర్చోనివ్వలేదు. ఎలాగో తంటాలు పడి నాన్న లెక్చరర్లని బతిమాలి బామాలి ఒప్పించాడు.

పరీక్షలు అయిపోయాక నేనొకసారి స్నేహితురాళ్ళతో బుద్ధజయంతి పార్కుకెళ్ళాను. చిన్నూ అక్కడ ఒక్కడే తిరుగుతూ కనిపించాడు. నా స్నేహితురాళ్ళకి వాణ్ణి పరిచయం చేస్తే కళ్ళు దించుకుని అందరికీ ఒకేసారి 'హలో' చెప్పేశాడు. చిన్నూ పొడుగ్గా, సన్నగా చెక్కినట్లున్న కనుముక్కు తీరుతో అందంగా తయారయాడు. ఇప్పుడిప్పుడే నూనూగు మీసాలు వస్తున్నాయి. బుగ్గమీదున్న సొట్ట ఇంకొంచెం లోతయింది. అయినా మొహంలో ఏదో పోగొట్టుకున్నట్టు

దిగులు. బట్టలు నలిగిపోయినవి వేసుకు న్నాడు. నాకు స్నేహితురాళ్ళ ముందర అవమానం అనిపించింది. వాడి చదువు సంధ్యల సంగతి అడుగుతారేమోనని భయపడి చచ్చాను.

చిన్నూ బై చెప్పి అటు వెళ్ళగానే ఒక మ్మాయి అడగనే అడిగింది "మీ తమ్ముడేం చేస్తున్నాడు? "

"కాలేజీలో చదువుతున్నాడు"

"ఏ కాలేజీ? "

చెప్పాను.

ఆ తరవాత తను ఇంకేమీ అడగలేదు. నేను ముక్తసరిగా జవాబులు చెప్పడం చూసి కొంతా, మా తమ్ముడి వాలకం చూసి కొంతా నాకు చెప్పడం ఇష్టం లేదని అనుకునుంటుంది.

ఆ తరవాత మార్చి నెలలో మామిడి పూత సువాసనలతో ఎండాకాలం రావడం మేం మా చెట్టునించి మామిడి పిందెలు కోసుకునేవాళ్లం. ఆ చెట్టు మాకు మంచి నీడనీ, ఊరగాయలకి కాయలనీ, తినేం దుకు పళ్ళనీ ఇచ్చేది. చెట్టునున్న కాయలు పండేలోపలే చిలకలూ, ఉడతలూ కొట్టే సేవి. పచ్చటి ఆకుల్లో ఆ చిలకలు ఎక్కడు న్నాయో కనిపించేవే కావు. మేం రాళ్ళు విసిరితే ఒక్కసారిగా ఎగిరిపోయేవి. మా అమ్మ పచ్చికాయలే కోసి ఊరగాయలు పెట్టేది. నాకు ఆ చెట్టుకింద కూర్చుని చదువుకోడమంటే భలే ఇష్టంగా ఉండేది. ఎప్పుడూ అక్కడే కూర్చుని చదువుకునే దాన్ని. నేను సైకాలజీలో బి.ఏ. చేస్తు న్నాను. కలల గురించి ఫ్రాయిడ్ చెప్పిన సిద్ధాంతం ఉన్న అధ్యాయం చదువుతూం డగా నాన్న భయంకరంగా అరవడం విని పించింది. ఎవర్నో ఘోరంగా తిడుతున్నా డాయన. ఇంకెవర్ని, చిన్నూనే అయుం టుంది.

"సిగ్గులేని వెధవా! ఇలాంటి దరిద్రపు పనులు కూడా చెయ్యడం మొదలెట్టావా? నా కడుపున చెడబుట్టావు కదరా!"

నేను వణుకుతూ లేచి ఇంట్లోకి నడి చాను. నాన్న చిన్నూ పడకగదిలో ఉన్నాడు. పక్కమీదున్న వాణ్ణి పట్టుకుని ఎడాపెడా వాయిస్తున్నాడు. వాడు ఆయన దెబ్బల్ని తప్పించుకునేందుకు మొహానికి చేతులు అడ్డు పెడుతున్నాడు. నాన్న కాళ్ళతో వాడి పొట్టలో తంతున్నాడు! అందిన చోటల్లా పిడిగుద్దులు గుద్దుతు న్నాడు.

అమ్మ కూడా వాణ్ణి కాపాడేందుకు రాక పోవడం చూసి ఆశ్చర్యపోయాను. అయితే వాడు చాలా చండాలపు పనేదో చేసుంటా డని అనుకున్నాను. నేను హడలిపోయి వంటింట్లో ఉన్న అమ్మ దగ్గరికి పరిగె త్తాను.

"నాన్నకి అడ్డు వెళ్ళడంలేదేం అమ్మా? అంతలా ఎందుకు కొడుతున్నాడు నాన్న? "

"వాడు చేసిన పని అలాంటిది"

"ఏం చేశాడేం? "

"అబ్బాయిలు చేస్తారే, ఆ పనే.."

"ఏమిటది? అబ్బాయిలేం చేస్తారు? "

"అదేనే... దాన్ని చేత్తో..." అమ్మ స్పష్టంగా చెప్పకపోయినా నాకు అర్థ మైంది.

"దానికి ఇంతలా చావబాదాలా? వాడు చేసింది అంత మహాపాపమేమీ కాదుగా? "

"ఊరికే వాగకు. వాడి సంగతి ఆయన చూసుకుంటారు. ఇది నీకు సంబంధించిన విషయం కాదు. బైటికెళ్ళి చదువుకో" అంది అమ్మ విసుగ్గా.

అది నాకు సంబంధించిన విషయం కాదుట! కానీ ఆ ఇంట్లో మనస్తత్వ శాస్త్రం చదువుకుంటున్నది నేనొక్కదాన్నే. ఇలాంటి విషయాల గురించి కాస్తో కూస్తో అవగాహన ఉంది నాకు. అయినా నన్ను ఈ విషయంలో మా అమ్మ నోరు మెదప నివ్వలేదు. నాకు సంబంధించిన విషయం కాదని ఆవిడ అలా చెప్పాక నేనేమీ అన

లేక చిన్నబుచ్చుకుని వచ్చేశాను.

చిన్నూ చేసిన పనికి అమ్మానాన్న అంత కోపం ఎందుకు తెచ్చుకున్నారో నాకు అర్థమైంది. వాళ్ళు పెరిగిన పద్ధతి అది. నాన్నకి సిగరెట్టు తాగేవాళ్ళన్నా, మద్యం ముట్టుకునేవాళ్ళన్నా పరమ రోత. అమ్మ పొద్దున్నే పూజ చేసి కానీ పచ్చి మంచి నీళ్ళు కూడా తాగదు. పాతకాలం అలవాట్లూ, ఆలోచనలూ. మా తాత చనిపోయాక పెద్ద కొడుకవడంతో తమ్ముళ్ళనీ, చెల్లెళ్లనీ నాన్నే పెంచాడు. అందుకే చిన్నప్పట్నించీ పిల్లల క్రమశిక్షణ పట్ల అంత కచ్చితంగా ఉండేవాడు. గాంధీ, ఆర్యసమాజం, సనాతన ధర్మ సంఘం... వాళ్ళ ప్రభావం నాన్న మీద విపరీతంగా ఉంది. అందుకే చిన్నూ ఏమాత్రం క్రమశిక్షణ పాటించకపోయినా, వికారమైన చేష్టలు చేసినా ఆయన భరించలేకపోయేవాడు. ఆయనకి ఎప్పుడూ నేను ఎదురు చెప్పకపోయినా, ఆయన కాఠిన్యం నాకు నచ్చేది కాదు.

కానీ ఆ తరవాత నేను వాడా పని చెయ్యడం నా కళ్ళతో చూశాను. వాడు గది తలుపు వేసుకోకూడదని నాన్న రూల్ పెట్టడం వల్ల, గది తలుపు ఆ రోజు కూడా ఎప్పట్లా తెరిచే ఉంది. వాడు తప్పకుండా డాక్టర్ కోర్సు చదువుతాడని ఇంట్లో అన్నిటికన్నా పెద్ద గది వాడికిచ్చారు. మెడిసిన్‌లో సీట్ రాకపోయినప్పటికీ వాడు అక్కడే ఉంటున్నాడు. మంచం మీద బోర్లా పడుకుని వాడు అదే పని చేస్తూ చుట్టూ ఏం జరుగుతోందో కూడా పట్టించుకోలేని స్థితిలో పూనకం వచ్చినవాడిలా ఉన్నాడు. ఎక్కణ్ణించొచ్చాడో హఠాత్తుగా వచ్చాడు నాన్న. వాణ్ణి జుట్టు పట్టుకుని పైకి లేపి పిడిగుద్దులు గుద్దడం మొదలెట్టాడు. చాలాసేపు వాడు దిండు అడ్డు పెట్టుకుని దెబ్బల్ని తప్పించుకోవాలని చూశాడు. కానీ అసలే బక్కప్రాణి, నాన్న ధాటికి ఆగలేకపోయాడు. ఉన్నట్టుండి వాడు గొంతు చించుకుని "నన్ను క్షమించు నాన్నా.. ఇంకెప్పుడూ చెయ్యను.." అని అరిచాడు.

ఆ గొంతులో ఎంత నిస్పృహ.. ఎంత వేదన! లైంగికానందానికి అడ్డు తగిలిన సందర్భాన్ని ఆదికవి గొప్ప కావ్యంగా మలిచాడు. కానీ ఒక మనిషి తనలోని ఏదో లోటునీ, మానసికమైన బాధనీ తప్పించుకోడానికి అదే పని చేస్తే దానికి ఇంత అవమానం, చావుదెబ్బలూ ఎదుర్కోవలసి వస్తుంది కదా! బుద్ధిగా ఉండడం అంటే అన్నీ అణచుకుని బతకడమేనా? చిన్నూ గొంతులోని ఆవేదన, వాడా పని చెయ్యడానికి గల కారణాలూ వీళ్ళెవరికీ కనిపించ లేదా? వాడిని అంత నిర్దయగా శిక్షించాలా? నేనింక ఆగలేకపోయాను. నాన్నకీ, వాడికీ మధ్య దూరి, రెండు చేతులూ అడ్డుపెట్టి ఆయన్ని ఆపేందుకు ప్రయత్నించాను.

"చాలు నాన్నా, ఇంక ఆపు, ప్లీజ్! వాడిప్పుడు చిన్నపిల్లాడు కాదు, పదహారేళ్ళు వచ్చాయి వాడికి" అన్నాను.

"మళ్ళీ ఇలాంటి పని చేశావో రక్తం కళ్ళజూస్తాను, జాగ్రత్త! కాలేజీకెళ్ళి నువ్వు నేర్చుకుంటున్నది ఇదటరా, సిగ్గులేని గాడిదా? వెధవ బతుకు, పోయిన జన్మలో ఏ పాపం చేశానో ఇలాటి కొడుకుని కన్నాను. నీకు చదువుసంధ్యలు లేకపోతే పోయె.. ఇలాటి దరిద్రపు అలవాట్లేమిటి? " అని నాన్న చీదరించుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

"కాస్త జాగ్రత్తగా ఉండచ్చు కదరా! అనవసరంగా ఎందుకు దెబ్బలు తింటావు? " అన్నాను చిన్నూతో.

వాడు శక్తి లేనట్టు మంచం మీద వాలిపోయి నాకు జవాబేమీ చెప్పకుండా అటు తిరిగి పడుకున్నాడు.

ఇంకొక రోజు అదే మామిడిచెట్టు కింద

కూర్చుని చదువుకుంటున్నాను. చిన్నూ నా దగ్గరకొచ్చి నిలబడ్డాడు. చాలా రోజుల తరవాత నాతో ఇలా ఒంటరిగా మాట్లాడేందుకు వచ్చాడు వాడు.

"చెప్పు చిన్నూ, ఏమిటి సంగతి? "

"నిన్నొకటడగాలి అక్కయ్యా"

"చెప్పు!"

వాడు జంకడం చూసి "చెప్పరా, ఏమిటి? " అన్నాను.

"అక్కా! ఆ అమ్మాయి ఉండేదే.. తన పేరేమిటి? "

"ఏ అమ్మాయి? "

"అదే, చిన్నప్పుడు నాతో ఆడుకునేదే? "

"నీతో ఆడుకునేదా? ఎవరబ్బా? "

"ఆ అమ్మాయేనే, మీరంతా తన పేరు చెప్పి నన్ను ఏడిపించేవారుగా? "

"ఓ నువ్వనేది ఆ గుడ్డీ సంగతా? "

"అవును, తన గురించే. ఇప్పుడు గుడ్డీ ఎక్కడుంది? వాళ్ళ వాళ్ళంతా ఎక్కడున్నారు? "

"ఎక్కడున్నారో నాకు తెలీదుకానీ అది ఎప్పటిమాటో కదా? నీకు ఇప్పుడెందుకు జ్ఞాపకం వచ్చింది? "

"నేనా పిల్లని కలుసుకోవాలి"

నేను ఉలిక్కిపడ్డాను. చిన్నూ ఏమిటిలా మాట్లాడుతున్నాడు! ఎప్పుడో చిన్నప్పుడు తమాషాకి అన్న మాటలు ఇంకా వీడికి గుర్తున్నాయా? అయినా ఇదంతా ఊరికే అంటున్నాడా, సీరియస్‌గానా? అనుకున్నాను. వాడివైపు చూశాను. వాడి మొహం చాలా గంభీరంగా ఉంది.

"అక్కా! నేనా అమ్మాయిని కలవాలి. తనతో ముఖ్య విషయం మాట్లాడాలి" అన్నాడు చాలా సీరియస్‌గా.

"ఏమిటంత ముఖ్యమైన విషయం? "

"ఉంది. ముఖ్యమైనదే. తనకే చెపుతాను" అన్నాడు మొండిగా.

అది నాకు చికాకు పుట్టించింది.

"వాళ్ళనాన్నకి ఇప్పుడెక్కడ పోస్టింగ్ అయిందో నాకు తెలీదు. కానీ ఆ అమ్మాయికి అంత పాత విషయాలు ఇంకా జ్ఞాపకం ఉండకపోవచ్చు. అప్పుడు దానికి పట్టుమని మూడేళ్ళు కూడా ఉండవేమో! అయినా అవన్నీ మేం చిన్నతనంలో సరదాకి అన్న మాటలు, వాటిని సీరియస్‌గా తీసుకోనక్కర్లేదు" అన్నాను విసుగ్గా.

"మీకు సీరియస్ కాకపోవచ్చు, కానీ నాకు మాత్రం సీరియసే. నేనా అమ్మాయిని కలుసుకోవలసిందే అక్కా! ప్లీజ్ నాకు సాయం చెయ్యవా? "

వీడిది గొంతెమ్మ కోరిక అని నాకు తెలుసు, కానీ వాడు మొండికేశాడు. వాడి లెక్కన నేను తల్చుకుంటే ఈ పని చెయ్యగలను! పైగా ఉన్నట్టుండి వీడికి ఆ పిల్ల ఎందుకు జ్ఞాపకం వచ్చిందో నాకైతే అర్థం కాలేదు. పది పదకొండేళ్ళ క్రితం సంగతి అది. పెద్దవాళ్ళు వీడికీ, ఆ పిల్లకీ ముడి పెట్టి వేళాకోళం చెయ్యడం అప్పట్లో నాకంత పెద్ద విషయమని అనిపించలేదు. చిన్నూ కూడా పట్టించుకుంటాడనుకోలేదు. అక్కయ్య గాని, అమ్మ గాని, "ఒరే! ఈ పిల్ల అందంగా ఉంది కదూ? పెళ్ళి చేసుకుంటావా? " అంటే, వాడు అమ్మ కొంగులో మొహం దాచుకుని సిగ్గుపడేవాడు. ఆ అమాయకమైన మాటలు వాడి మనసులో అంత లోతుగా నాటుకున్నాయా? చాలా ఏళ్ళ క్రితం వాళ్ళు మా

పక్కింట్లో ఉండేవాళ్ళు. తరవాత బదిలీ అయి ఎక్కడికెళ్ళారో గుర్తులేదు. అందరం వాళ్ళని ఎప్పుడో మర్చిపోయాం.

చిన్నూ జ్ఞాపకశక్తి చూసి నాకు ఆశ్చర్యం వేసింది.

"సరేలే, వాకబు చేస్తాను" అన్నాను.

"ప్లీజ్ అక్కా! ఎలాగైనా కనుక్కుని చెప్పు" అనేసి చిన్నూ వెళ్ళిపోయాడు.

నేను మళ్ళీ నా పుస్తకాల్లో తల దూర్చాను. బహుశా ఎంత చిన్నపిల్లలైనా వాళ్ళతో ఇలాటి వేళాకోళం చెయ్యకూడదేమో! అని ఒక పక్క ఆలోచిస్తూ, పుస్తకంలోని మనస్తత్వశాస్త్రానికి సంబంధించిన క్లిష్టమైన విషయాలని అర్థం చేసుకునేందుకు కుస్తీ పట్టడం మొదలెట్టాను. నాన్నతో ఈ విషయం చెప్పాలని అనిపించింది. ఆయన మళ్ళీ చిన్నూని చావగొడతాడేమో అని భయం ఒక పక్క ఉంది. కానీ అప్పట్లో అన్ని విషయాలూ నాన్నకి చెప్పడం ఒక అలవాటూ, అవసరమూ అనిపించేది.

నేనాయన్ని అడిగేలోపలే వాడు మళ్ళీ నాకు గుర్తు చేశాడు.

"అలాగే నాన్నతో మాట్లాడతాలే" అన్నాను.

ఒక్కసారిగా వాడిమొహం పాలిపోయింది. "ప్లీజ్ వద్దే, ఆయనకేమీ చెప్పద్దు" అన్నాడు.

నేను చేసిన పొరపాటేమిటో తెలిసి సర్దుకున్నాను. "కానీ చిన్నూ, వాళ్ళకి ఏ ఊరికి బదిలీ అయిందో నాన్నకే కదా తెలుస్తుంది! నువ్వు అడగమన్నావని చెప్పనులేరా" అన్నాను.

వాడు కుదుటపడి వెళ్తూ "త్వరగా కనుక్కో అక్కయ్యా, లేకపోతే ఆలస్యమైపోగలదు!" అన్నాడు.

నేను నిర్ఘాంతపోయాను. వీడికి దేని గురించి ఇంత తొందర? అనుకున్నాను.




**చి**న్నూ మరీ మౌనంగా డిప్పలోపలికి ముడుచుకుపోయే తాబేల్లా ప్రవర్తించసాగాడు. ఇంట్లో ఉన్నంతసేపూ తన గది దాటి బైటికొచ్చేవాడే కాదు. పిలవగా పిలవగా భోజనానికి వచ్చి, నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని మళ్ళీ గదిలోకి వెళ్ళిపోయేవాడు. వాడు మాతో కూర్చున్నంతసేపూ అందరికీ ఏదో చెప్పలేని ఒత్తిడి అనిపించేది. అమ్మ కళ్ళయితే వాణ్ణే చూస్తూ ఉండేవి. ఆవిడ కళ్ళలోని భావం నాకైతే అంతు చిక్కేదేకాదు. చిన్నూ సమస్య ఏమిటో గ్రహించేందుకు ప్రయత్నిస్తోందా? లేక ఆ కళ్ళలో ఇంకేదైనా రహస్యం దాగివుందా? అని అనుమానమొచ్చేది నాకు.

ఒక్కోసారి రోజంతా బైట ఎక్కడెక్కడో తిరిగి వచ్చేవాడు. ఒక రకంగా వాడు మా చెయ్యిదాటి పోతున్నట్టే అనిపించేది. వాడు భోజనం చేసి వెళ్ళగానే నాన్న అమ్మతో "ఇలా ఎన్నాళ్ళు చూస్తూ ఊరుకుంటాం? ఏమైనా చెయ్యరాదూ!" అనేవాడు.

అమ్మ ఏం చేస్తుంది? ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? వాడిలో ఏదో మార్పు వస్తోంది కానీ అది పూర్తిగా అసహజమైనదిగా తోచలేదు.

ఒకరోజు నేను కాలేజీకి బైలుదేరుతూంటే అమ్మ ముందు గదిలో ఆచారిగారితో చాలా సీరియస్‌గా ఏదో మాట్లాడడం కనిపించింది. సాయంత్రం ఇంటికి రాగానే

అమ్మ నాతో "పొద్దున్నే లేచి స్నానం అదీ చేసి సిద్ధంగా ఉండు. పంతులుగారు వచ్చి హోమం చేస్తారు" అంది.

ఆ హోమం చేయించింది చిన్నూ కోసం. ఆ తంతు చాలాసేపు జరిగింది. ఆహుతి చిన్నూ చేతే చేయించాడాయన. చిన్నూ మనసు మారాలని, బుద్ధిగా ఉండాలని ఆశీర్వదించాడు. వెళ్తున్నప్పుడు చిన్నూ తప్పకుండా డాక్టరవుతాడని, విదేశాలకి కూడా వెళ్తాడని, మాకు మంచిపేరు తెస్తాడనీ అన్నాడు. అమ్మ మనసు కుదుటపడింది. మొహంలో భయంపోయి సంతృప్తి చోటు చేసుకుంది. హోమంలో నెయ్యి పొయ్యమన్నప్పుడు ఒక్కోసారి చిన్నూ పరధ్యానంగా ఉంటే అమ్మేవాడి చెయ్యి పట్టుకుని పోయించింది. ఆవిడకి ఆ హోమం తప్పక ప్రభావం చూపుతుందన్న పిచ్చి నమ్మకం. ఆ నమ్మకంతోనే ఆవిడ ఆచారిగారికి 501 రూపాయలు దక్షిణ ఇచ్చేసింది. అప్పట్లో అది మా నాన్న ఒక నెల జీతానికి సమం! తన అవసరాల కోసం, ఎప్పటినుంచో మనసులో ఉన్న తీరని కోరికలు తీర్చుకోడం కోసం ఎన్నాళ్ళబట్టీ కూడబెట్టిందో దాన్ని! ఇంటి వాతావరణంలో మార్పొచ్చింది. అందరిలో ఏదో కొత్త ఆశ. నేను మాత్రం ఎప్పుడూ ఉదాసీనంగా ఉండే చిన్నూ మొహంలో సంతోషం కనిపిస్తుందేమోనని వెతకసాగాను. కానీ వాడు ఎప్పుడూ మరో లోకంలో ఉన్నట్టుండేవాడు.

కొన్నాళ్ళు పోయాక ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. చిన్నూ నా దగ్గరకి ఒక పత్రిక తీసుకొచ్చాడు. అదొక ఆంగ్ల సచిత్ర వారపత్రిక. అందులో ఇంగ్లాండు రాణీ బొమ్మ ఉంది. దాన్ని చూపిస్తూ వాడు "ఈవిడ నాకు తెలుసు.. మనం ఫిరోజ్ పూర్‌లో ఉండగా మనింటికి వచ్చేది, గుర్తుందా? " అన్నాడు.

చిన్నూ మమ్మల్నందరినీ వదిలి దూరంగా ఎక్కడికో వెళ్ళిపోతున్నాడనిపించింది నాకు. నేను అదేమీ గమనించనట్టు "ఎలిజబెత్ రాణి మనింటికి ఎలా వస్తుంది? " అన్నాను.

"కానీ బాగా పరిచయస్తురాలిలా అనిపిస్తోంది" అన్నాడు వాడు.

"నువ్వావిడ ఫొటో ఇంతకు ముందు చాలాసార్లు చూశావు కదా, అందుకే"

"ఉత్త ఫొటో కాదక్కా, నేనీవిణ్ణి కలుసుకున్నాను. నిజం! కావాలంటే అడిగిచూడు"

"ఎవర్ని అడగమంటావు? "

"ఈవిణ్ణే"

"అంటే రాణీనా? "

"ఆ.. ఇప్పుడే ఫోన్‌చేసి కనుక్కో"

"నీకేమైంది చిన్నూ? ఆవిడ ఉండేది ఇంగ్లండులో!"

"ఫోన్ చెయ్యాలంటే చాలా డబ్బవుతుందా? "

"డబ్బు సంగతి వదిలెయ్యి. ఆవిడ ప్యాలెస్‌లో ఉంటుంది, ఆవిడతో ఫోన్‌లో మాట్లాడడం కుదరదు"

"కానీ ఆ అమ్మాయి అడ్రసు ఈవిడే చెప్పగలదు.. ఈవిడకి కూడా ఆ అమ్మాయి తెలుసు"

"ఏ అమ్మాయి? "

"ఆవాళ చెప్పలే, ఆ అమ్మాయే!"

"ఎవరు.. గుడ్డీ సంగతా? "

"అవును.. గుడ్డీ!"

నా గుండె గొంతుకలోకొచ్చినట్టయింది. దిగులు కమ్ముకొచ్చింది. చూస్తూండగానే పెద్ద మార్పు వచ్చేసింది. పిడికిట్లో నీళ్ళని పట్టి ఉంచేందుకు ప్రయత్నిస్తున్నట్టనిపించింది నాకు. వాడి ప్రశ్నలకి ఎలా ప్రతిస్పందించాలో కూడా తెలియని అయోమయంలో పడ్డాను. వాడికి వాస్తవానికీ, కల్పనకీ ఉన్న తేడా తెలీకుండా పోతోందని మాత్రం గ్రహించాను. కానీ నాతో ఎవరైనా ఇలా మాట్లాడడం ఇదే మొదటి సారి.. అది కూడా స్వయానా నా తమ్ముడు.... వాడి ముందు నా గాభరాని ప్రకటించేందుకు కూడా వీల్లేదు. ఇక మీదట సరదాకి కూడా వాణ్ణి 'పిచ్చి వెధవ' అనే సాహసం చెయ్యలేను.

చిన్నూ నా దగ్గర్నించి వెళ్ళిపోగానే ఏదో జరగకూడనిది జరుగుతుందన్న భయంతో నాకు ఏడుపు ముంచుకొచ్చింది. ఇప్పుడీ సమస్యని నాన్నకి చెప్పకుండా ఉండలేను, ఉండకూడదు. ఇప్పటికే సమస్య చెయ్యిదాటిపోయిందేమో అనే అనుమానం కూడా వచ్చింది.

★ ★ ★

నేను చెప్పింది వినగానే నాన్న మ్రాన్పడిపోయాడు. మొహంలో కత్తివేటుకి రక్తం చుక్క లేకుండా పాలిపోయింది. ఆయన నాకన్నా వాడి పరిస్థితి బాగా అర్థం చేసుకున్నాడు. చిన్నూని కొడతాడనుకున్నందుకు నా తెలివితక్కువతనానికి సిగ్గేసింది. జీవితంలో అనుభవం ఎన్ని పాఠాలని నేర్పుతుందో! అవే లేకపోతే ప్రతిదానికీ భయపడుతూ బతుకుతాం. కానీ కొన్ని విషయాలు బాగా తెలిస్తే కూడా భయాందోళనలు కలుగుతాయి. అందుకే ఆయన మొహంలో విపరీతమైన భయం కనిపించి నేను బిక్కచచ్చిపోయాను. కాసేపు వున్నాక నాన్న "బహుశా ఎవరైనా డాక్టర్‌కి చూపించాలేమో! పవన్‌తో మాట్లాడి చూస్తాను" అన్నాడు.

పవన్ మా బాబాయి. ఆయన సర్జన్... నాన్నకి ఆయన కజిన్. ఇద్దరికీ మంచి స్నేహం. బాబాయీ, పిన్నీ అంటే నాకు కూడా చాలా ఇష్టమే. కానీ వాళ్ళింట్లో పద్ధతులు మాకు చాలా వ్యత్యాసంగా ఉంటాయి. పిన్ని ఇంగ్లాండులో ఉండి రావడంవల్ల ఆవిడది పాశ్చాత్య ధోరణి. మామూలుగా ఎంతో స్మార్ట్‌గా ఉండే అమ్మ కూడా ఆవిడ ముందు మామూలు గృహిణిలా ఉంటుంది. వాళ్ళమ్మాయి కాన్వెంట్‌లో చదువుతోంది. ఇంట్లో ఎప్పుడూ విదేశీ వంటలే చేస్తారు. మేము ఎప్పుడైనా అమ్మా, నాన్నతో వాళ్ళింటికి వెళ్ళేవాళ్ళం. కానీ ఎక్కువగా కలుపుగోలుగా ఉండలేకపోయేవాళ్ళం. నాన్న మా ఇద్దరి గురించీ వాళ్ళకి చాలా గొప్పగా చెప్పేవాడు. ఇంగ్లాండుకి వెళ్ళకపోయినా పిల్లల్ని ఎంత బాగా పెంచుతున్నానో చూడు, నేనేమీ సాధించలేకపోయినా వీళ్ళు సాధించి చూపిస్తారు అని చెప్పాలనుకునే వాడో ఏమిటో! ఇప్పుడు ఆ మాటల్లో ఎంత వెలితి ఉందనిపిస్తుందో కదా నాన్నకి? బాబాయి దగ్గరికే వెళ్ళి ఏ మొహం పెట్టుకుని చిన్నూ సమస్య చెప్పగలడాయన?

బాబాయి తన ఆస్పత్రిలో ఒక సైకియాట్రిస్టుతో మాట్లాడి చిన్నూని ఆయన దగ్గరకి తీసుకెళ్ళమని నాన్నకి చెప్పాడు. కానీ

చిన్నూని ఆస్పత్రికి రమ్మని ఒప్పించడం ఎవరివల్ల అవుతుంది? నాన్న నాకా పని అప్పజెప్పాడు. ఏదో ఒకటి చెప్పి వాణ్ణి ఒప్పించమని అన్నాడు.

చిన్నూ ఇంకా ఆ అమ్మాయి, గుడ్డీ, ఆచూకీ తెలుసుకోమని నన్ను అడుగుతూనే ఉన్నాడు. నేను వాణ్ణి యథాలా పంగా కోప్పడి "నువ్వీ మధ్య ఎంత పిచ్చి మాటలు మాట్లాడుతున్నావో తెలుసా? పవన్ బాబాయి నిన్ను సైకియాట్రిస్టు దగ్గరకి తీసుకెళ్ళమన్నాడు!" అన్నాను.

"అంటే నాకు పిచ్చెక్కిందా? "

"ఛీ! పిచ్చెక్కిందని ఎవరన్నార్రా? సైకియాట్రిస్టంటే మనస్తత్వశాస్త్రం తెలిసిన డాక్టరన్నమాట. ఆయన దగ్గరకెళ్ళి నీకున్న సందేహాలన్నీ అడగచ్చు. నీకు కాలేజీకి ఎందుకెళ్ళాలని లేదో, చదువుమీద ధ్యాస ఎందుకుండడం లేదో, ఏమైనా అడగచ్చు. ఆయన నీ ప్రశ్నలకన్నిటికీ జవాబులు చెప్పి సహాయం చేస్తాడు. భయపడాల్సిన పనిలేదు"

వాడికి నా మాటలు నమ్మచ్చనిపించినట్టుంది. అసలు ఇంట్లో అందరికన్నా నామీదే వాడికి ఎక్కువ నమ్మకం. వాడి మనసు నేనొక్కదాన్నే అర్థం చేసుకోగలనని అనుకుంటాడు. నాన్నంటే భయం, అమ్మ ఎప్పుడూ వాణ్ణి మౌనంగా చూస్తూ ఏమీ మాట్లాడకపోవడం... వాణ్ణి ఆవిడకి దూరం చేసేది. ఆవిడ తనని అర్థం చేసుకోదని వాడి నమ్మకం. అదీ నిజమే, నాతో అన్న మాటలు ఆవిడతో అని ఉంటే ఈ పాటికి ఇల్లెగిరిపోయేంత గోల చేసి ఉండేది. నేను అమ్మ గురించి పొరబడ్డానేమో తెలీదు. కానీ ఆవిడకి చిన్నూ పరిస్థితి గురించి మేమెవరమూ ఏమీ చెప్పలేదు. వాడి సమస్య ఎంత జటిలమైనదో ఆవిడకి బొత్తిగా తెలీదు. కానీ ఆవిడ వాడి ప్రసక్తి వస్తే చాలు ఏడుపు లంకించుకునేది. అందుకే వాడూ భయం వల్ల ఆవిడకి దూరంగా ఉండేవాడు.

బాబాయి తన కారు తెచ్చాడు. నాన్న చిన్నూని షికారుకి తీసుకెళ్తున్నట్టు కారెక్కించాడు. ఇంతకుమునుపు బాబాయి కారులో సరదాగా తిరిగేందుకే వెళ్ళేవాళ్ళం. నాన్న జీతం తక్కువ, కుటుంబమేమో పెద్దది, అందువల్ల కారు కొనే స్థోమత ఆయనకి లేదు. ఆరుగురు పిల్లలతో సంసారాన్ని ఈడ్చుకు రావడమే కష్టమయేది. ఎప్పుడైనా బాబాయి పాతకారు అడిగి, మమ్మల్ని ఎక్కడికైనా తీసుకెళ్ళేవాడు నాన్న. ఈసారి బాబాయి కొత్తకారులో వచ్చాడు. అమెరికన్ కారు తళతళలాడిపోతోంది. చిన్నూ ఇంకేమీ ఆలోచించకుండా ఆ కారెక్కినందుకే తెగ ఆనందపడిపోయాడు. వాణ్ణి మోసం చేశానని నాకు బాధ వేసింది. మందు అని చెప్పి విషం ఇస్తున్నట్టు అనిపించింది. కానీ బాబాయి మంచి పేరుమోసిన డాక్టరు. ఆయన తప్పు సలహా ఇవ్వడని మాకు గట్టి నమ్మకం. ఏం ఫరవాలేదని ఆయన హామీ ఇచ్చినప్పటికీ నాకు మాత్రం ఏ మూలో భయం వేస్తూనే ఉంది.

★ ★ ★

నా పిల్లాడు అంశూని ఆస్పత్రికి తీసుకెళ్తున్నప్పుడు ఆ భయం ఎన్నో రెట్లు పెరిగింది. ఎందుకంటే వాడు బతుకుతాడన్న ఆశ కూడా అంతంత మాత్రమే ఉంది.

మొదటి అంతస్తు కిటికీలోంచి పడితే ఇంక బతుకుతాడని ఎలా అనుకుంటాం? అదీ రెండేళ్ళ పసివాడు! రెప్పపాటులో ఎలా జరిగిపోయింది? ఇక జీవితాంతం బాధే మిగిలింది. దానికి పూర్తి బాధ్యత నాదే. ఇంకెవరినైనా తప్పు పట్టేందుకు కూడా వీల్లేదు. నా మూర్ఖత్వమా, అమాయక త్వమా లేక దురదృష్టమా? ఏమనాలి దీన్ని? ఇంత సులభంగా ఒక్క క్షణంలో ఎవరైనా సర్వస్వం ఎలా కోల్పోతారు? తల్చుకుంటే నమ్మబుద్ధికాదు, కానీ జరిగి నది అదే! నమ్మితే ఏమిటి? నమ్మకపోతే ఏమిటి? వాస్తవం క్రూరంగా, ఎదురుగ్గా కళ్ళకి కనిపిస్తూంటే! ఈ బాధకి మందు లేదు. ఒక్క క్షణం అలా నిద్రతో కళ్ళు మూతలు పడి ఉండకపోతే ఇంత ఘోరం జరిగేదా? ముందే తెలిస్తే నిద్రపోకుండా ఉండేదాన్ని కాదా? ఇప్పుడు రమ్మన్నా నిద్ర రాదే! ఆ ఒక్కక్షణంలో ఎంత భయంకరమైన మార్పు!

లేకపోతే నా అంశూ ఎంత అల్లరి పిల్లాడు? వాడి అల్లరి కూడా ఎంత ముద్దొచ్చేదో! వాడి కళ్ళలో అల్లరి కనిపిం చేది... నన్ను కావాలని ఏడిపించేవాడు. నేను అలిగితే కిలకిలా నవ్వేవాడు. గట్టిగా అరవద్దని కోప్పడితే ఇంకా గట్టిగా అరుస్తూ నాకు అందకుండా పరిగెత్తేవాడు. ఆ ఆట లన్నీ ఎక్కడికి పోయాయిప్పుడు? అప్పుడు అల్లరి చెయ్యద్దని అన్నాను కానీ ఇప్పుడు వాడు అల్లరిచేస్తే బావుణ్ణని తపించిపోతు న్నాను. ఒకప్పటి ఆ అంశూని చూడాలని మనసు తహతహలాడుతోంది. ఒక్కోసారి వాడి పాతరూపం చూడకపోయినా బావుండేదనిపిస్తుంది, మళ్ళీ కనీసం రెండేళ్లపాటయినా వాడి ఆటపాటలన్నీ చూసే అవకాశం దొరికింది కదా అని కూడా అనిపిస్తుంది. ఆ తియ్యటి జ్ఞాపకా లైనా మిగిలాయి కదా అనుకుంటాను.



ఇంతకు మునుపు ఇలా లేడు కదా? అని అనుకోగానే ఇంకొన్ని రోజులకి మళ్ళీ మామూలవుతాడేమో అన్న ఆశ కలుగు తుంది. ఈ ఆశని వదలకుండా పట్టుకుని అన్నీ భరిస్తూ బతికాను... అప్పుడు బతి కాను... ఇప్పుడు కూడా బతుకుతున్నాను.




ఎన్నో గంటలు గడిచాక తమ్ముడు చిన్నూ ఆస్పత్రి నించి ఇంటికి వచ్చాడు. మొహంలోని జీవకళంతా పోయి శవంలా ఉన్నాడు. కళ్ళు ఎటో శూన్యంలోకి చూస్తు న్నాయి. ప్రాణంలేని ప్రేతంలా భయంక రంగా ఉంది మొహం. నాకేసి చూస్తున్నా డన్నమాటే గాని, నన్ను గుర్తుపట్టిన లక్ష ణాలేవీ ఆ మొహంలో నాకు కనిపించ లేదు. యంత్రంలా లోపలికి నడిచి వచ్చాడు.

నాన్న మొహంలో ఆందోళనా, ఉద్వేగం, చెప్పలేనంత బాధా కనిపించాయి. ఆయన కూడా ఎవరి కళ్ళలోకి చూడకుండా తప్పు చేసినవాడిలా, తలదించుకుని ఉన్నాడు. కారు దిగేప్పుడు కూడా బాబాయే ఏం భయపడవద్దని అన్నా, నాన్న ఏమీ మాట్లాడలేదు. బాబాయి కారు ఇంజను కూడా ఆపకుండా, బైటినించే జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాడు.

నేను వరండాలో నిలబడి చూస్తూ ఉండిపోయాను. నా నోటకూడా మాట రాలేదు. ఒక్కొక్క అడుగే వేస్తూ నాన్న దగ్గరికెళ్ళాను. నావైపు చూడనట్టు చిన్నూ

తన గదిలోకెళ్ళిపోయాడు.

"డాక్టరేమన్నాడు? " అని అడిగాను నాన్నని.

"కరెంటు షాకిచ్చాడు... ఈ రోజే వైద్యం చెయ్యడం మొదలెడతానన్నాడు.. ఆలస్యం చేస్తే ఇంకా విషమిస్తుందట"

"అయ్యో! అందుకేనా వాడలా..? "

"ఏమైంది? "

"వాడు ఏమీ మాట్లాడకుండా ఉంటేనూ.. నాతో కూడా మాట్లాడలేదు కదా? "

"అవును. షాకిచ్చినప్పట్నించీ అలాగే ఉన్నాడు"

"నేను మాట్లాడించి చూడనా? " అని వాడి గదిలోకెళ్ళాను.

వాడు మంచంమీద పడుకున్నాడు.

"ఏమైంది చిన్నూ? "

"చాలా నొప్పి పెట్టింది. నాకు నిద్రొస్తోంది" అన్నాడు.

★ ★ ★

కొన్నాళ్లకి ఒకరోజు పొద్దున్న నిద్రలేచి గదిలోంచి బైటికొచ్చాడు. వాడి మొహం తేటగా అనిపించింది. చిరునవ్వు కూడా కనిపించి ఏదో కొత్తగా ఉన్నట్టనిపించింది.

"ఇవాళ సినిమాకెళ్దామా చిన్నూ? నీకిష్టమైన హీరో కొత్తసినిమా రిలీజయింది" అన్నాను. వాడు నామాట వినిపించుకోకుండా డ్రస్సింగ్ టేబుల్ అద్దంలో తన మొహం చూసుకోసాగాడు.

"ఇవాళ సెలూన్ కెళ్తాను, జుట్టు బాగా పెరిగిపోయింది" అన్నాడు.

డబ్బులకోసం అమ్మని పిలుస్తూ బైటికెళ్ళిపోయాడు. వాడి మొహంలో అలల్లా ఏవో భావాలు లేస్తున్నాయి. అవి ఎక్కడ మొదలై, ఎక్కడ విరిగిపడతాయో నాకు అర్థం కాలేదు. సాయంత్రం వాడు తన పుస్తకాలూ, నోట్సూ తిరగేస్తూ కనిపించాడు. "అక్కయ్యా, నీ దగ్గర ఖాళీ నోటు బుక్కు ఏమైనా ఉందా? " అని అడిగాడు.

"ఎందుకు? " అన్నాను.

"రేపు కాలేజీకి తీసుకెళ్ళాలి"

"రేపు నువ్వు కాలేజీకి వెళ్తావా? "

"ఆ.. ఇన్నాళ్ళూ మిస్సయాను కదా? "

నా మనసులో ఎక్కడో ఆశాకిరణం వెలిగింది. వీడు మళ్ళీ కాలేజీకి వెళ్ళడం మొదలెడితే అంతా సర్దుకుంటుందేమోననే ఆశ.

మర్నాడు వాడు నిజంగానే కాలేజీకి వెళ్ళాడు. ఆ తరవాత కూడా కొన్నాళ్ళు వెళ్తూనే ఉన్నాడు. కానీ మాతో కాలేజీ విషయాలేవీ చెప్పేవాడు కాదు. ఏదైనా అడిగినా అయిష్టంగా ఏదో చెప్పి తప్పించుకునేవాడు. ఒక రోజు నాకు ఈ విషయం ఆరా తియ్యాలనిపించింది.

"నీ క్లాస్‌మేట్లు ఇన్నాళ్ళూ ఎక్కడికిపోయావని అడగలేదా? " అన్నాను.

"ఏ క్లాస్‌మేట్లు? "

"నీ క్లాసులో చదివే కుర్రాళ్ళు"

"నేనే క్లాసుకీ వెళ్ళడంలేదు"

"అదేమిటి, కాలేజికి వెళ్ళడం ఎందుకు మానేశావ్? ఎప్పట్నించి వెళ్ళడంలేదు? "

"కొన్ని రోజులైంది. అక్కడికి వెళ్తే వాళ్ళు నన్ను వింతగా చూస్తున్నారు"

"అంటే? "

"వాళ్ళు మంచివాళ్ళు కాదక్కా"

చిన్నూ కళ్ళలో భయం, బాధా కలగలిసిన భావం కనిపించింది.

"ఎందుకలా అంటున్నావు? "

"వాళ్ళంతా చాలా నిర్దయగా.. క్రూరంగా..."

"లెక్చరర్ని కలిశావా? "

"లేదు, లెక్చరర్ చాలా దూరంగా ఉంటాడు"

వాడి జవాబు నాకు చాలా వింతగా ఉన్నట్టనిపించింది. కొంతసేపు ఆలోచిస్తూ ఉండిపోయాను.

"నీతో నేను రానా? కావాలంటే నాన్న కూడా వస్తాడు"

"ఒద్దొద్దు... అస్సలు నువ్వాయన దగ్గ



రకి వెళ్ళద్దు"

"కానీ ఇలా అయితే ఎలారా చిన్నూ? లెక్చరర్‌తో మాట్లాడాలి కదా? లేకపోతే నిన్ను పరీక్షకి కూడా కూర్చోనివ్వరు కదా? "

"సర్లే. నేను మాట్లాడతాను. నువ్వు కాలేజీకి రావద్దు. నాన్న కూడా రానక్కర్లేదు"

అసలు చిన్నూ కాలేజి బిల్డింగ్‌లోకి వెళ్ళాడా లేదా? అని అనుమానం వచ్చింది. పగలు క్లాసులు ఎగ్గొట్టి, వాడి కాలేజ్‌కి వెళ్ళాను. వాడు కాలేజి ఆవరణలో కనిపించాడు. కాలేజి భవనానికి దూరంగా, నిర్మానుష్యమైన ఓ మూలన తిరుగుతూ కనిపించాడు. వాడు నన్ను చూడలేదు. వాడికి కనిపించడం నాకూ ఇష్టం లేదు. కానీ ఆరోజు నా మనసులో తుపాను చెలరేగింది. ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూ ఉండిపోయాను.

నేనింకా ఆలోచిస్తూనే ఉన్నాను. చిన్నూ కాలేజీకి వెళ్ళడం మానేశాడు. ఇంతకు ముందు అబద్ధాలు చెప్పి వెళ్లడం.. నిజంగా వెళ్ళడమని అనాలో లేదో తెలీదు. కానీ రోజంతా ఇంట్లోనే ఉండిపోవడం కన్నా మెరుగే అనిపించింది. మళ్ళీ అయిష్టమైన పరిస్థితి ఇంట్లో నెలకొనసాగింది.

ఒకరోజు ఉన్నట్టుండి నన్ను, "ఆ ఫోన్ నంబర్ దొరికిందా అక్కయ్యా? " అని అడిగాడు.

"ఏ ఫోన్ నంబరు? "




“అదే.. ఆ అమ్మాయిది”

“ఏ అమ్మాయిది రా? ”

“నా చిన్ననాటి స్నేహితురాలిది”

“ఏ స్నేహితురాలు? ”

నేను కావాలనే ఈ విషయాన్ని ఇంతటితో ముగించాలని ప్రయత్నించాను.

“నువ్వే కదా ఆ అమ్మాయి నా స్నేహితురాలని అనేదానివి? నా పెళ్ళి కూడా ఆ పిల్లతోనే జరుగుతుందన్నావు. నేనా పిల్లని ప్రేమిస్తున్నాను!”

“వాట్ నాన్సెన్స్! అప్పుడేదో సరదాకన్న మాటల్ని అంత సీరియస్‌గా తీసుకుంటావేమిటి? ” అని చిన్నూని కసురుకునేసరికి వాడు నోరు మూసుకున్నాడు.

మళ్ళీ వాడు నాన్నకి పిచ్చికోపం తెప్పించే అదే పనిచేస్తూ చాలాసార్లు దొరికిపోయాడు. మళ్ళీ దెబ్బలూ, తన్నులూ తిన్నాడు. “కొట్టద్దు నాన్నా.. ఇంకెప్పుడూ చెయ్యను నాన్నా” అంటూ గోలగా ఏడ్చాడు.

నాన్నకి ఉన్న ఏకైక సలహాదారు బాబాయి. ఆయన మళ్ళీ ఆస్పత్రికి తీసుకెళ్ళి షాక్ ట్రీట్మెంట్ ఇప్పించమని సలహా ఇచ్చాడు.

వాణ్ణి డాక్టర్ దగ్గరకి ఎలా తీసుకెళ్ళాలి అనేదే సమస్య. “నేను ఆస్పత్రికి రాను ఆ కరెంటు షాకులు చాలా నొప్పెడతాయి” అంటూ వాడు గొడవ చేశాడు.

“ఈసారి వద్దని చెపుదాం లే! నువ్వు ముందు పద” అన్నాడు నాన్న.

ఒకరోజు అన్నయ్య అనుకోకుండా వచ్చాడు. అప్పుడు అన్నయ్యా, నాన్నా కలిసి ఎలాగో చిన్నూని ఒప్పించి డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళారు. మళ్ళీ వాడికి షాక్ ట్రీట్మెంట్ ఇచ్చాడు డాక్టర్.

ఇప్పుడిక చిన్నూకి నాన్నని చూసినా, అన్నయ్యని చూసినా భయమే. వాడి కళ్ళలో చెప్పలేనంత భయం కనిపించింది నాకు.

"ఒకసారి నువ్వు బాగైపోతే ఇంక కరెంటు షాకులివ్వరు లేరా" అన్నాడు నాన్న.

"నేను బానే ఉన్నాగా? ఏమైంది నాకు? " అన్నాడు చిన్నూ.

"వచ్చేవారం మళ్ళీ రమన్నాడు డాక్టర్.. వెళ్ళాలి"

"ఆ డాక్టర్‌కేమీ తెలీదు. ఎంత పెద్ద షాకిస్తాడో తెలుసా? నేను రాను"

"వెళ్ళాల్సిందే చిన్నూ. లేకపోతే తగ్గదు. మంగళవారానికి అపాయింట్‌మెంట్ తీసుకుంటున్నాను. అంతవరకూ రఘు అన్నయ్య కూడా ఇక్కడే ఉంటాడు"

నాన్న అదే ఆఖరి మాటన్నట్టు చెప్పేశాడు. అలా నాన్న నిక్కచ్చిగా ఏదైనా చెపితే చిన్నూ బెదిరిపోయి జవాబు చెప్పడు. ఈసారి కూడా వాడు ఏమీ అనకుండా ఆయన వైపే భయం భయంగా చూస్తూ ఉండిపోయాడు.

★ ★ ★

సోమవారం నేను కాలేజి నుంచి ఇంటికొచ్చేసరికి చిన్నూ ఇంట్లో లేడు. రాత్రి మేమందరం మౌనంగా భోజనం ముగించి లేచాం. అప్పటికీ వాడు ఇల్లు చేరలేదు. అమ్మకి ఇంక కంగారు పుట్టింది. నాన్న నీరసపడిపోయినట్టు "వాడికోసం ఎదురు చూడడం తప్ప ఇంకేమీ చెయ్యలేం" అన్నాడు.

అర్ధరాత్రి వరకూ ఎవరం నిద్రపోలేదు. పోలీసులకి రిపోర్ట్ చేద్దామంది అమ్మ. అన్నయ్య అనవసరంగా ఊరంతా తెలుస్తుందని వద్దన్నాడు. పొద్దున్న తొమ్మిది వరకూ రాకపోతే వెతుకుదామని అన్నాడు.

ఆ రాత్రి అంతా కలత నిద్రలోనే గడిచింది మాకందరికీ. ఎవరో ఒకరు లేచి బాత్రూమ్‌కి వెళ్తూనే ఉన్నారు. చిన్నూ ఏమీ అఘాయిత్యం చేసుకుని ఉండడు కదా? అని అనుమానమొచ్చింది. భయాలు, అనుమానాలు, దిగుళ్ళు వాణ్ణి పట్టి పీడిస్తున్నాయి. అలాటప్పుడు పర్యవసానం ఎలా ఉంటుందో! ఊహిస్తేనే గుండెలవిసిపోయాయి నాకు. అమ్మ కంట్లో నీళ్ళు ఉబికి కారేందుకు సిద్ధమవుతుండగా ఫోన్ మోగింది. చిన్నూ తమ ఇంటికి వచ్చాడని పిన్ని దగ్గర్నించి ఫోను. మామూలుగా పిన్నివాళ్ళింటికి మేం వెళ్తూనే ఉంటాం. వాడలా హఠాత్తుగా వచ్చినందుకు ముందు పిన్ని ఆశ్చర్యపోయింది. వాడు ఇంట్లో చెప్పకుండా వచ్చి ఉంటాడని ఆమె ఊహించలేదు. పొద్దున్న వాడంతట వాడే తను ఇంట్లో చెప్పకుండా వచ్చానని ఆమెతో అనేసరికి ఇంట్లోవాళ్లెంత కంగారుపడుతున్నారో అనుకుని వెంటనే ఫోన్ చేసింది. అమ్మ మనసు కుదుటపడింది. కానీ నాన్నకి మాత్రం కోపం ముంచుకొచ్చింది. వాణ్ణి డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళేందుకు ఆయన తయారై కూర్చున్నాడు. వాణ్ణి వెంటనే ఇంటికి పంపించమని పిన్నికి చెప్పాడు. చిన్నూ ఫోన్లో మాట్లాడలేదు. ఇంటికి రావాలని కూడా వాడికి లేదు. 'నాన్నకి చెప్పద్దు. ఆయన నన్ను తీసుకెళ్ళిపోతాడు' అని పిన్నితో అనడం నాన్నకి వినిపించింది.

చిన్నూ అలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడో పిన్నికి ఏమీ అర్థం కాలేదు. వాణ్ణి ఎక్కడికి తీసుకెళ్తారంటున్నాడో తెలీలేదు. ఆవిడకి ఈ విషయాలేవీ తెలీవు. ఆవిడ నాన్నతో "మీరు చిన్నూని బాగా కొట్టినట్టున్నారు..

అంత పెద్ద తప్పేం చేశాడు? చిన్న వెధవ భయపడుతున్నాడు.. పిల్లలు తప్పు చేసి నంతమాత్రాన ఇంట్లోంచి పారిపోయేట్టు అంతలా కొట్టాలా? " అందావిడ.

నాన్న జవాబేమీ చెప్పలేదు. సాయంత్రం అన్నయ్యని వెంట పెట్టుకుని వెళ్ళి వాణ్ణి ఇంటికి తీసుకొచ్చారు.

ఇంట్లో 'డాక్టర్', 'ఆస్పత్రి' అనే మాటలు నిషిద్ధమయ్యాయి. చిన్నూ గురించి ఏమైనా మాట్లాడాలంటే వాడు దరిదాపుల్లో లేనప్పుడు రహస్యంగా మాట్లాడుకుం టున్నాం. పొద్దున్నే చిన్నూ కాలేజీకి వెళ్తు న్నానని చెప్పి బైటికి వెళ్ళిపోతాడు. నాన్న కంట పడకుండా వెళ్ళిపోవాలని వాడి ప్రయత్నం. తరచు తన గదిలోనే కూర్చుని భోంచేస్తాడు. చదువుకోవాలని సాకు చెపు తాడు. తరచు నాన్నకి పిచ్చికోపం తెప్పించే ఆ పని చేసి తన్నులు తింటాడు. కానీ చెయ్యకుండా ఉండడం వాడికి సాధ్యం కాదు. వాడి ధోరణి రోజురోజుకి అధ్వాన్నం అవుతోందని ఇంట్లో అందరికీ తెలుస్తోంది. డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళడం వల్ల ప్రయోజనం లేకపోగా ఇంకా పరిస్థితి ఘోరంగా తయారవుతుందేమో అని అను మానం కూడా వస్తోంది. అందరం మాకు తోచిన విధంగా సహాయం చేసేందుకు ప్రయత్నిస్తూనే ఉన్నాం. చిన్నూ మెదడు చురుగ్గా పనిచెయ్యాలని అమ్మ వాడికి బాదంపప్పు నూరి పాలలో కలిపి తాగిం చడం మొదలెట్టింది. నాన్నకి దిగులు ముంచుకొచ్చినప్పుడు బాబాయి దగ్గరకె ళ్తాడు. ఏదైనా దారి చూపిస్తాడేమోనని ఆయన ఆశ. కానీ బాబాయికి తెలిసిన ఒకే ఒక మార్గం ఆస్పత్రిలో చేర్పించడం. నాన్న ఆరోగ్యం దెబ్బ తినసాగింది. ఆయ నకి ఇరవై నాలుగ్గంటలూ చిన్నూ గురిం చిన దిగులే.

నాకెందుకో చిన్నూ ఇలా తయారవడా నికి వాడి లైంగిక అసంతృప్తే అసలు కార ణమని నమ్మకం కలిగింది. క్లాసు పుస్త కాలే కాక మనస్తత్వశాస్త్రానికి సంబంధిం చిన ఎన్నో పుస్తకాలని నేను ఎంతో ఆస క్తిగా చదివేదాన్ని. ఇక ఫ్రాయిడ్ సిద్ధాంతా లయితే చాలా ప్రసిద్ధి చెందాయి. నాకు కూడా ఆయనే గురువు. ఆయన పుస్తకాలు చదివిన ప్రభావం వల్లే నేను చిన్నూ గురించి అలాంటి నిర్ధారణకి వచ్చాను. కానీ ఆ కారణంగా వాడి జీవితాన్ని నాశనం కానివ్వడం ఎంత తెలివి తక్కువ విషయమో ఆలోచించినకొద్దీ నాకు గాభరా పెరిగిపోయింది. వాడు మానసి కంగా పెడదారి పడుతున్నాడన్నది తెలు స్తోంది. కానీ వాడి గురించి నేను అనుకు న్నది ఎవరికైనా చెప్పే ధైర్యం నాకు లేక పోయింది. అసలు ఆ విషయాన్ని నాలో నేనే అనుకోడానికే సంకోచంగా ఉండేది! జీవితం నియమాలకన్నా, నిషేధాలకన్నా గొప్పదని నేను అర్థం చేసుకోగలను. వాడి జీవితంకన్నా ఇవేమీ ముఖ్యం కాదని నాకు గట్టి నమ్మకం. కానీ చిన్నూని ఎలా కాపా డాలో తెలీలేదు.

ఒకరోజు అమ్మా, నాన్న కూర్చునుంటే వాళ్ళ దగ్గరకి వెళ్ళి "చిన్నూని ఎవరైనా ఒక వేశ్య ఇంటికి తీసుకెళ్తే ఎలాగుంటుంది? " అన్నాను.

అమ్మ ఉలిక్కిపడి "ఏమిటి? ఏమంటు న్నావే నువ్వు? " అంది కోపంగా.

నాన్నవైపు తిరిగి "దీనికి మతి చెడినట్టుంది" అంది.

"అలాటి మాటనడానికి నీకు సిగ్గులేదా? కాలేజీకెళ్ళి నువ్వు నేర్చుకుంటున్నది ఇదే నటే? రేపట్నించీ నువ్వు కూడా కాలేజీకి వెళ్ళక్కర్లేదు. చూస్తున్నాను, రోజురోజుకి బొత్తిగా సిగ్గులేకుండా తయారవుతున్నారు మీరిద్దరూ. పోయేకాలం వచ్చి ఇలాటి లక్షణాలు అలవరచుకుంటున్నారు!" అని మండిపడింది అమ్మ.

అమ్మకి ఇంకా నేనన్న మాట ముల్లులా గుచ్చుకుంటూనే ఉన్నట్టుంది. "దరిద్రపు మొహమా! సొంత తమ్ముడి గురించి అసలి లాంటి మాటెలా వచ్చిందే నీ నోటంట? " అంది.

'వేశ్య' అనేమాట వినగానే అమ్మ వాళ్ళ మీదున్న కోపాన్నంతా నా మీద కక్కింది. నన్ను 'నీతిలేని కులట'లాంటి అనరాని మాటలంది. నాన్నకి నా ఉద్దేశం అర్థమైనా నా తరపున మాట్లాడలేదు. పైగా 'కాస్త ఆలోచించి మాట్లాడు' అని నన్ను మందలించాడు.

నేను అంతటితో ఆగకుండా "అలా చేస్తే వాడు బాగవుతాడని నాకు గట్టి నమ్మకం" అన్నాను.

"సర్లే, ఇక ఆపు. నాలుగు పుస్తకాలు చదివావో లేదో.. అన్నీ నీకే తెలుసనుకుంటున్నావా? పో ఇక్కణ్ణించి!" అని నాన్న కసిరారు. ఇక చెప్పి లాభం లేదనీ, పెద్దవాళ్ళు పిల్లల మాటలకి విలువివ్వరనీ అర్థమైంది. నేను సూచించినది మాత్రం సరైనదో కాదో నాకు కచ్చితంగా తెలుసని కూడా అనలేని పరిస్థితి.

కానీ నేను చదివిన పుస్తకాల్లో విషయాలు నిజమైతే మాత్రం చిన్నూ పెద్ద సుడిగుండంలో చిక్కుకున్నాడనాలి. వీళ్ళకి అదేమీ అర్థం కావడంలేదు. నాలో కూడా రక్తం ఉరకలు వేసిన క్షణాలు లేకపోలేదు. కానీ పెళ్ళయ్యే వరకూ ఓపిగ్గా తట్టుకోవాలని నిశ్చయించుకున్నాను. సమాజపు కట్టుబాట్లని మార్చడం సాధ్యం కాదని నాకు తెలుసు. క్లాసులో స్నేహితురాళ్ళతో అబ్బాయిల గురించి మాట్లాడడం, ఎవరినైనా ఒక అబ్బాయితో ముడిపెట్టి ఏడిపించడం, రోడ్డుమీద పోయే మగపిల్లలు అనే మాటలు పరస్పరం చెప్పుకుని గిలిగింతలు పెట్టినట్టు అనుభూతి చెందడం, సినిమాల్లో హీరో హీరోయిన్ల హావభావాల మీద కామెంట్లు చెయ్యడం.. వీటి ద్వారా మా లైంగిక ఆసక్తి కొంత తృప్తి పడేది. కానీ చిన్నూకి స్నేహితులే లేరు.. వాడు తన మనసులో మాటలు ఎవరికి చెప్పుకుంటాడు? అందుకే వాడి దృష్టి తన శరీరంవైపే తిరిగింది. వాడు ఒంటరితనంతో బాధపడుతున్నాడు.

నేను నా తమ్ముడికి ఎటువంటి సహాయమూ చెయ్యలేనా? అనుకునేదాన్ని తరచూ. నా బాధ్యతలు ఏమిటి... వాటికి హద్దులున్నాయా? వాడి పరిస్థితి ఏమిటో చెప్పకుండా వాడికి ఎవరైనా అమ్మాయిని పరిచయం చెయ్యగలుగుతానా? కానీ ఏ అమ్మాయినైనా అలాంటి ఇబ్బందికరమైన పరిస్థితికి చూస్తూ చూస్తూ ఎలా గురిచెయ్యగలను? దానికి బదులు నేనే..? మేము అక్కా తమ్ముళ్ళమే.. కానీ నా తోబుట్టువుని కాపాడేందుకు నేనలాంటి పనిచేస్తే తప్పేమిటి? అలాంటి ఆలోచన రాగానే వెన్ను జలదరించింది. నాకంత ధైర్యం ఉందా? సమాజం, ఇంట్లో వాళ్ళూ నన్ను అసహ్యించుకుంటే తట్టుకోగలనా?

అలా ఆలోచిస్తున్నప్పుడు మరీ చిన్నతనంలో ఒకరోజు మధ్యాన్నం నేనూ, చిన్నూ ఆడుకుంటూ ఒకర్నొకరం తాకడం, మా శరీరాల్లో తేడాని కుతూహలంతో తెలుసుకోడం గుర్తొచ్చింది. మిట్ట మధ్యాహ్నం, నాన్న ఇంట్లో లేడు. అమ్మ పనిచేసి అల

సిపోయి తన గదిలో నిద్రపోతోంది. నాకప్పుడు అయిదేళ్ళుంటాయి. వాడు ఇంకా పసివాడు. పిల్లలకి సహజంగా ఉండే కుతూహలంతో అలా చేశామే తప్ప వేరే ఉద్దేశమేమీ లేదు మాకు. ఆ దశలో మాకు అక్కా తమ్ముళ్ళ పవిత్ర బంధం గురించి ఏం తెలుస్తుంది? అది పెద్దయ్యాక అర్థమైంది. అప్పట్లో ఆ పని అనైతికమైనదనీ, అనుచితమనీ తెలీని అతి అమాయకమైన వయసు మాది.

ఈ వయసులో అన్నీ తెలిసి కూడా నేనా పని చెయ్యగలనా? కానీ ప్రస్తుతం నా మనసులో బాధా, సానుభూతీ మాత్రమే ఉన్నాయి. మిగతా విషయాలకి చోటు లేదు. కుతూహలమో అవసరమో కాదు. వాడిమీద ఆప్యాయతతో ఇలాంటి ఆలోచన వచ్చింది, అంతే. అన్ని సామాజిక నియమాలనీ అధిగమించాలన్న ఆవేశమైతే చాలాసార్లే వచ్చింది, కానీ అది ఆచరణ వరకూ రాకుండానే అణిగిపోయింది. అసలు మా ఇంట్లో పెద్దవాళ్ళకి చిన్నూని వేశ్య దగ్గరకి పంపించమన్నందుకే అంత కోపం వచ్చింది. ఇక ఇలాంటిది ఏదైనా జరిగిందని తెలిస్తే ఎలాంటి ఉపద్రవం ముంచుకొస్తుందో!!!




**చి**న్నూలో మార్పు వస్తుందనే ఆశతో నాన్న వాణ్ణి సిమ్లాలో ఉండే మా పెద్దక్కయ్య దగ్గరికి పంపాడు. "వీడికి చదువు సంధ్యలమీద ధ్యాస లేదు. రోజంతా ఆవారాలాగా రోడ్లమ్మట తిరుగుతాడు. సిమ్లాలో ఏదైనా కాలేజీలో చేర్పించడం వీలవుతుందేమో చూడు. అక్కడ హాస్టల్ లో ఉండి చదువుకుంటాడు" అన్నాడు నాన్న అక్కయ్యతో.

అక్కయ్య సంతోషంగా ఒప్పుకుంది. అక్కయ్య కూతుళ్ళు కూడా తమ మామయ్య వస్తున్నాడని సంబరపడ్డారు. చిన్నూ వెంటనే ఒప్పుకున్నాడు. వాడికే తనలో మార్పు రావాలన్న కోరిక ఉన్నట్టు అనిపించింది నాకు. అక్కయ్య ఇంట్లో వాడికి సొంత ఇంట్లో ఉన్నంత సుఖంగా ఉంటుంది. పైగా నాన్న క్రమశిక్షణ పేరుతో పీడించడం ఉండదు. అందుకే మా అందరికీ సిమ్లా వెళ్ళడమంటే చాలా సరదా. అక్కయ్య మమ్మల్ని విచ్చలవిడిగా వదిలేస్తుందని కాదు... ఎప్పుడో ఒకసారి వెళ్తాం కాబట్టి ఎక్కువ గారాబం చేస్తుందంతే.

అక్కయ్యకి చిన్నూలో ఎటువంటి అసహజమైన గుణాలూ కనిపించలేదు. మొదట్లో పిల్లలతో ఆడుకునేవాడు. వాళ్ళని సైకిల్ మీద బజారుకి తీసుకెళ్ళేవాడు. కానీ కొన్నాళ్ళు పోయాక వాడు మరీ మౌనంగా ఉండడం, తనలోతానే గొణుక్కోవడం అక్కయ్య గమనించింది. నాన్నకి అక్కయ్య ఉత్తరం రాసింది. 'చిన్నూకి ఏమైందో తెలీటం లేదు. స్నానం చెయ్యడు. వేళకి తినడు. బల్లమీద అన్నీ పెట్టి వాణ్ణి ఎన్నిసార్లు పిలిచినా రాడు. పొద్దున్న పదకొండు గంటలకి నిద్ర లేస్తాడు. అసలు మన లోకంలో లేనట్టు ఎప్పుడూ పరధ్యానమే. నేనేమైనా అడిగినా జవాబు చెప్పడు. మీ దగ్గరున్నప్పుడు కూడా ఇలాగే చేసేవాడా? బహుశా ఎటూ కాని వయసు వల్ల వచ్చిన సమస్య

కావచ్చు. కానీ నాకు వీడి ప్రవర్తన వింతగా అనిపిస్తోంది'

ఆ తరవాత ఉత్తరంలో రాయని ఎన్నో విషయాలు అక్కయ్య మమ్మల్ని కలిసినప్పుడు చెప్పింది.. రాత్రిళ్ళు రెండు గంటల వరకూ నిద్రపోయేవాడు కాదనీ, ఒకరోజు వాడి గదిలో పొద్దుపోయాక కూడా లైటు వెలుగుతూ ఉండడం చూసి తను వెళ్ళేసరికి వాడు ఏదో పత్రికలో ఒక మోడల్ ఫోటో చూస్తూ ఉన్నాడనీ, తనని చూడగానే "అక్కయ్యా! ఇదే ఆ అమ్మాయి, తనని నేను ఢిల్లీలో కలిశాను. నాకీ అమ్మాయి తెలుసు" అన్నాడనీ చెప్పింది.

అక్కయ్యకి తలాతోకా అర్థం కాలేదు.

కానీ వాడి మొహంలో భావం అసహజంగా ఉన్నట్టనిపించింది. మా బావ కూడా మాటలు వినిపించి లేచి వచ్చాడు. అన్నీ విన్నాక, ఇకనించీ అమ్మాయిల్ని చిన్నూతో ఒంటరిగా ఉండనివ్వద్దనీ, ఎక్కడికీ పంపద్దనీ అక్కయ్యకి ఆర్డరు వేశాడాయన. తన తమ్ముణ్ణి గురించి భర్త అలా అన్నాడని మనసు బాధపడినప్పటికీ, తన కూతుళ్ళకి ఎలాంటి హానీ కలగకూడదన్న ఉద్దేశంతో అక్కయ్య చిన్నూని జాగ్రత్తగా గమనించసాగింది.

నాన్నా అమ్మా చిన్నూని మరీ గారాబం చేసి పాడుచేశారని అక్కయ్య ఎప్పుడూ అంటూ ఉండేది. 'నాన్నే ముద్దుచేసి వాణ్ణి పాడుచేశాడు. తనవెంట క్లబ్బులకి తీసుకెళ్ళేవాడు, ఇంగ్లీషు సినిమాలు చూపించేవాడు. లేత వయసులో ఇలాంటివి పిల్లల మనస్సుని పెడదోవ పట్టిస్తాయి. ఆ సినిమాలవల్లే వీడి బుర్రలో సెక్సు కోరికలు విపరీతంగా నాటుకున్నాయి. అది తప్పు ఇంకేమీ ఆలోచించలేని స్థితికి వచ్చాడు. మనమీద నాన్న ఆడపిల్లలమని ఎన్ని రకాల కట్టుబాట్లు పెట్టాడు. వాడిని కూడా అదేవిధంగా కట్టుబాట్లతో పెంచితే ఇలా తయారయేవాడా? పిల్లలకి.. ఆడయినా మగయినా సరైన గైడెన్సు ఉండాలి!' అనేది అక్కయ్య ఎప్పుడూ.

ఒకే ఇంట్లో పుట్టి పెరిగినా నాకూ అక్కయ్యకీ ఆలోచనల్లో చాలా తేడా ఉండేది. బహుశా తను నాకన్నా పదేళ్ళు పెద్దది కావడం వల్లనేమో కానీ తను చెప్పినది కూడా కొంతవరకూ నిజమే.

అక్కయ్య ఉత్తరం చదివి "ఎంతైనా అదీ మనమ్మాయే కదా.. ముందే దానికి అన్ని విషయాలూ చెప్పాల్సింది" అన్నాడు నాన్న.

"ఏమని చెపుతాం? ఫలానా జబ్బంటూ లేదుగా వాడికి? " అంది అమ్మ.

నాకూ ఆ మాట నిజమే అనిపించింది. అసలు మాలో ఎవరికీ చిన్నూకి ఏదో సమస్య ఉందని నమ్మడం ఇష్టంలేదు. తప్పు మాదేననీ, నాన్నదనీ, లేకపోతే ఇంట్లో వాతావరణం సరిగా లేదనీ, అసలు ఈ ఊరే సరైనది కాదనీ.. అందుకే చిన్నూ పాడైపోయాడనీ మా నమ్మకం. ఇక్కణ్ణించి వాణ్ణి దూరంగా ఎక్కడికైనా తీసుకెళ్తే అన్నీ సర్దుకుంటాయనిపించేది. అక్కయ్య దగ్గరికి కూడా అందుకే పంపించాం.

అక్కయ్య ఉత్తరం చూసి మళ్ళీ కొత్తగా తప్పు చేశామన్న భావం, అవమానం అని

పించాయి. అంతేకాక, చిన్నూ బాగుపడతాడన్న ఆశ మళ్ళీ ఇంకోసారి అడుగంటింది.

అక్కయ్యా దగ్గర్నించి చిన్నూ వెనక్కి వచ్చేశాడు. చాలా నీరసంగా అయిపోయాడు. లోపల్లోపల ఏదో దుఃఖం వాణ్ణి తొలిచేస్తున్నట్టు అనిపించింది. మళ్ళీ తన డిప్పలోకి ముడుచుకుపోయి ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. ఇప్పుడు ఉన్న కష్టాలకి తోడు వాడి ఆరోగ్యం సమస్య కూడా అమ్మనీ నాన్ననీ పీడించసాగింది. అమ్మ పసిపిల్లాడికి తినిపించినట్టు దగ్గర కూర్చోపెట్టుకుని తినిపించడం మొదలెట్టింది. మునుపటి కన్నా వాడు తక్కువ తింటున్నాడు.

మానసిక వ్యాధితో బాధపడే రోగులకి దయా భావంతో చికిత్స చేసే ఒక కొత్త ప్రైవేట్ ఆస్పత్రి ఈ మధ్యనే తెరిచారని బాబాయి నాన్నకి చెప్పాడు. అక్కడ షాక్ ట్రీట్‌మెంట్ ఇవ్వరని అన్నాడు. మందులతోనే మెదడులో దెబ్బతిన్న రసాయనిక క్రియల సమతూకాన్ని సరిచేస్తారని అన్నాడు. నాన్నా, బాబాయీ కలిసి చిన్నూకి ఈ ఆస్పత్రి గురించి చాలాసేపు వివరంగా చెప్పారు. షాక్ గురించి భయపడక్కర్లేదనీ, ఈ కొత్త ఆస్పత్రిలో అలాంటివి ఉండవనీ చెప్పేసరికి వాడు సరేనన్నాడు.

ఆస్పత్రిలో ముఖ్య అధికారిగా ఉన్న డాక్టర్ విదేశాల్లో చదువుకుని వచ్చాడు. చాలా కొద్ది సమయంలో ఊళ్ళో మంచి పేరు సంపాదించుకున్నాడు.

నాన్న వెంట డాక్టర్ దగ్గరికి వెళ్ళొచ్చాక చిన్నూ కూడా సంతోషంగా కనిపించాడు.

"ఈ డాక్టర్ చాలా నచ్చాడు.. స్నేహితుడిలాగ మాట్లాడుతున్నాడక్కా!" అన్నాడు నాతో. ఒకటి రెండుసార్లు వాడిని కలుసుకున్న తరువాత డాక్టర్ చిన్నూని ఆస్పత్రిలో చేరిస్తే మంచిదనీ, తను దగ్గరుండి చూసుకోవాల్సిన అవసరం ఉంటుందనీ అన్నాడు. డాక్టర్ స్వభావం నచ్చడంతో చిన్నూ కూడా వెంటనే ఒప్పుకున్నాడు.

వార్డులో ఉన్న మిగతా రోగుల పరిస్థితి చిన్నూ కన్నా అధ్వాన్నంగా ఉంది. అయినా డాక్టరంటే ఉన్న ఇష్టం వల్ల చిన్నూ ఏమీ అభ్యంతరం చెప్పలేదు. వార్డులో అడుగు పెట్టగానే అక్కడున్న కుర్రాళ్ళందరూ చిన్నూ చుట్టూ మూగారు. వాళ్ళ ప్రవర్తన వాణ్ణి చికాకు పెట్టింది. ఒకసారి నేను వెళ్ళినప్పుడు నావైపు నిస్సహాయంగా చూస్తూ మౌనంగా ఉండిపోయాడు. కొన్నాళ్ళు ఓపిక పడదామని అనుకున్నట్టున్నాడు.

మూడు నాలుగు వారాల్లోనే వాడిలో మంచి మార్పు కనిపించింది. సమయానికి తిండి తింటున్నాడు. బుగ్గలు కొంచెం పూడుకున్నాయి. సహజంగానే వాడు చాలా సన్నం, కానీ ఇప్పుడు నీరసంగా కనిపించడం మానేశాడు. ఒకటే వాడికి ఇబ్బంది కలిగించేది, వార్డులోని మిగతావాళ్ళని చూస్తే వాడికి ఎలాగో ఉండేది. తరచు నాన్నా నేనూ ఆస్పత్రికి వెళ్ళేవాళ్ళం.

'నేను బాగయిపోయాగా, నన్నింటికి తీసుకెళ్ళకూడదా? నేను ఇక్కడున్న పిచ్చాళ్ళలా కనిపిస్తున్నానా మీకు?' అనేవాడు మాతో.

నాకు విపరీతంగా ఏడుపొచ్చేది. డాక్టర్ అంత త్వరగా వాణ్ణి ఇంటికి వెళ్ళనివ్వడని నాకు తెలుసు.

చిన్నూ అదేపనిగా గొడవ చేస్తూంటే కొన్నాళ్ల తరువాత, ఇంట్లో టైమ్ ప్రకారం మందు వేసుకునేట్టయితే వెళ్ళనిస్తానని అన్నాడు డాక్టర్. అప్పుడు వాడికి మందు ఇవ్వడం అంత కష్టమైన పని అని మాకు తెలీదు. చిన్నూకి ఆ మందు తాగడమంటే అసహ్యం. రోజూ వాడిచేత మందు తాగిం

# మానసిక సంఘర్షణకు అక్షరరూపం



సుషమ్ బేదీ 1945లో పంజాబులోని ఫిరోజ్‌పూర్‌లో జన్మించారు. ఆమె బహుముఖ ప్రజ్ఞాశాలి. రచయిత్రిగా, నటిగా, విద్యావేత్తగా ప్రఖ్యాతి గాంచారు. ఎన్నో నవలలు, కథానికలు, కవితలు రాశారు. ప్రస్తుతం ఆమె అమెరికాలో ఉంటున్నారు. 'మిడిల్ ఈస్ట్రన్ అండ్ ఏషియన్ లాంగ్వేజస్ అండ్ కల్చర్' విభాగంలో కొలంబియా విశ్వవిద్యాలయం, న్యూయార్క్‌లో హిందీ ప్రొఫెసర్‌గా పని చేశారు. ఆమె రచనల్లో ముఖ్యంగా కనిపించేది దక్షిణాసియా ప్రవాసుల అనుభవాలు, వాళ్ల ఎదుర్కొనే మానసిక, సాంస్కృతిక సంఘర్షణలు. ఇతర ఇండో అమెరికన్ రచయితల్లా ఆమె ఇంగ్లిష్‌లో రాయకుండా, హిందీలోనే అధికంగా రచనలు చేశారు. ఆమె రచనలు ఇంగ్లిష్, ఫ్రెంచ్, డచ్‌లాంటి ఎన్నో భాషల్లోకి అనువాదమయ్యాయి. 1960, 70లలో ఆమె భారతదేశ నటనారంగంలో కూడా కృషి చేశారు. ఈ మధ్యన అమెరికాలో ఎన్నో ఇంగ్లిష్ టీవీ కార్యక్రమాల్లో నటించారు. ఆమె కుమార్తె పూర్వాబేదీ కూడా నటే. 2006 జనవరిలో సాహిత్య అకాడెమీ, ఢిల్లీవారు ఆమె హిందీ సాహిత్యానికి చేసిన సేవకుగాను సన్మానించారు. 2007లో ఉత్తర ప్రదేశ్ హిందీ సంస్థాన్‌వారు ఆమె హిందీ భాష, సాహిత్యాలకు చేసిన సేవకుగాను లక్షరూపాయలను బహూకరించారు.

*చిరునామా:*
**సుషమ్ బేదీ**
C/o మోహిత్ ధమేజా,
డి5/16, వసంత్ విహార్,
న్యూఢిల్లీ -110057

చేందుకు కొత్త కొత్త ఉపాయాలు ఆలోచించాల్సి వచ్చేది. చాలాసార్లు మాట వినకపోతే మళ్ళీ ఆస్పత్రికి పంపిస్తామని బెదిరిస్తేనే తాగేవాడు. ఆస్పత్రి పేరు చెపితేనే హడిలిపోయేవాడు. చిన్నూ కోలుకోడం మొదలుపెట్టాక నాకు ఆందోళన తగ్గింది. నా పనుల్లో మునిగిపోయాను.

★ ★ ★

చీకూచింతా లేకుండా బతికే క్షణాలు జీవితంలో ఎంత తక్కువుంటాయో! అది నాకు అనుభవంలోకి వచ్చింది అంశూ పుట్టాకే. మొదట్లో చంటిపిల్లాడి తల్లిగా.. అదీ మొదటి సంతానం కావడంతో.. అన్నిటికీ భయపడేదాన్ని. వాడు పైనించి పడిపోయినప్పట్నించీ అది ఎన్నో రెట్లు పెరిగిపోయింది. ఇప్పుడు అనుక్షణం వాణ్ణి కనిపెట్టుకుని ఉండాల్సిందే. అశోక్ ఎప్పుడూ నా పరిస్థితి పట్ల సానుభూతి చూపడం గాని, అర్థం చేసుకోవడం గాని ఉండదు. తనకెప్పుడూ సమస్య అంశూతో కాదనీ నాతోనేననీ నమ్మకం.

అంశూని ఆస్పత్రి నించి ఇంటకి తీసుకురాగానే అశోక్ నన్ను బైటికెళ్ళేందుకు తయారవమన్నాడు. తాజ్ హోటల్‌లో సాయంకాలం పార్టీ ఉంది. అశోక్ అప్పటికే మంచి బట్టలు వేసుకుని ఇటలీలో కొన్న సిల్కు టై కట్టుకుని సిద్ధమైపోయాడు.

"ఎనిమిదిన్నరయింది.. ఇంకా అలాగే కూర్చున్నావేమిటి? వాడి పక్కన అలా కూర్చునివుంటే బాగయిపోతాడా? "
అన్నాడు.

"నాకెక్కడికీ వెళ్ళాలని లేదు"

"ఇప్పుడంత కష్టం ఏమొచ్చిందని? "

"వీణ్ణి ఒంటిగా వదిలి రాలేను"

"రామ్‌సింగ్ ఉన్నాడుగా? "

"ఒంట్లో బాగాలేనప్పుడు నౌకర్లమీద వదిలి ఎలా వెళ్తాం? మళ్ళీ ఎక్కడైనా పడిపోతే?

"అబ్బా, నీకు ఇలాంటి భయాలు ఎందుకో నాకర్థం కాదు. డోంట్ బి సిల్లీ.. లే, లేచి తయారవు, అసలే ఆలస్యమైంది"

"లేదు అశోక్, నేను రాను.. నువ్వు కావాలంటే వెళ్ళు. వీణ్ణి ఈ స్థితిలో వదిలి నేను రాలేను"

నేను వెంట లేకుండా పార్టీకి వెళ్ళడం అశోక్‌కి అదే మొదటిసారి. వెళ్ళేముందు మళ్ళీ ఒకసారి "చెప్పు, మనసు మార్చుకుంటే తయారవు. ఆలస్యంగా వెళ్లినా ఫరవాలేదు" అన్నాడు. నేను రానన్నాను. మనసంతా ఇక్కడే ఉంటుందనీ, అక్కడికొచ్చినా ఎవరితోనూ సరిగ్గా మాట్లాడలేననీ చెప్పాను.

"సరే నీ ఇష్టం. నేను వెళ్ళక తప్పదు.. వెళ్ళకపోతే బిజినెస్ పడుకుంటుంది"

రెండు మూడుసార్లు ఇలాగే అయ్యేసరికి అశోక్ నన్ను పిలవకుండా ఒక్కడే వెళ్ళసాగాడు. సాయంకాలాలు నాతో గడపడం మానేశాడు. నేను కూడా ఏమీ అనలేదు. కానీ అశోక్ అనుకుంటున్నంత సులభంగా అంశూని నేను మాంసపు ముద్ద అనుకోలేకపోయాను. వీడికోసం ఏమైనా చేసేందుకు, దేన్నైనా వదులుకునేందుకు నేను సిద్ధం. కానీ కన్నతండ్రి అశోక్ అలా అనుకోడెందుకని? మాతృత్వమంటే అసహాయ స్థితేనా? అందుకేనేమో, నేను చిన్నూ ఇంటికి రాగానే స్నేహితురాళ్ళతో జైపూర్, ఆగ్రా తిరిగి రావడానికి చెక్కేసేదాన్ని. అమ్మ మాత్రం ఇంకా చిన్నూ గురించిన దిగులుతో రోజూ కన్నీళ్ళు కారుస్తూ వాడి కోసం ఇంట్లో ఉండిపోయేది. అమ్మ ఎప్పుడూ చిన్నూ అలా అవడానికి తనే కారణమని బాధపడేది. బహుశా నాన్న కూడా తన పెంపకంలో ఎక్కడో పొరపాటు జరిగిపోయిందనే అనుకునేవాడు. అంతకన్నా ఎక్కువ ఆయన ఆలోచించలేకపోయేవాడు.

అందుకే ఇప్పుడు నావల్ల ఎలాంటి పొర

## అనువాదాలంటే ప్రీతి



**ఆర్. శాంతసుందరి**

చెన్నైలో 1945లో పుట్టాను. హిందీలో ఎం.ఎ, బీ.ఎడ్ చదివాను. హిందీ, ఆంగ్లం, తమిళం నుంచి అనేక రచనల్ని తెలుగు చేశాను. అలాగే ఇంతవరకూ తెలుగు నుంచి హిందీలోకి నేను అనువదించిన 29 పుస్తకాలు అచ్చయ్యాయి. అనువాద సాహిత్యంలో మొత్తం అరవై రెండు పుస్తకాలు నా ఖాతాలోకి జమయ్యాయి. ఇవికాక ఎన్నో కవితలు, కథలూ, వ్యాసాలు అనువాదాల రూపంలో వివిధ పత్రికలలో వచ్చాయి. 2005లో భారతీయ్ అనువాద్ పరిషత్, ఢిల్లీవారిచే 'డాక్టర్ గార్గీగుప్త్ ద్వివాగీశ్ పురస్కార్' అందుకున్నాను. సుప్రసిద్ధ తెలుగు రచయిత సలీమ్ నవల 'కాలుతున్న పూలతోట'ను హిందీ చేశాను. దీనికి 2006లో రాష్ట్రీయ మానవ హక్కుల సంఘం, ఢిల్లీ వారి నుంచి ప్రథమ బహుమతి పొందాను. 2007లో హైదరాబాద్‌లో జరిగిన బహుభాషా నాటకోత్సవంలో నేను అనువదించిన గాంధీజయంతి నాటకం విజయ్‌భాస్కర్‌గారిచే ప్రదర్శితమైంది. 2010లో తెలుగు విశ్వవిద్యాలయం వారిచే ప్రేమ్‌చంద్ బాల సాహిత్యానికి ఉత్తమ అనువాదకురాలి పురస్కారాన్ని అందుకున్నాను.

*చిరునామా:*
**ఆర్. శాంతసుందరి**
506, వెస్ట్‌ఎండ్ అపార్ట్‌మెంట్స్,
మసీద్ బండ, కొండాపూర్,
హైదరాబాద్-500084

పాటు జరగకూడదని జాగ్రత్త పడతాను. తరువాత జీవితాంతం చేసిన తప్పుకి కుమిలిపోతూ బతకడం ఇష్టం లేక ఇరవైనాలుగ్గంటలూ అంశూని కంటికి రెప్పలా కాపాడుకుంటున్నాను. ఒక్క క్షణం చూపు మరల్చుకున్నా వాడు మాయమైపోతాడేమో అన్న భయం నాకు!

★ ★ ★

ఆగ్రాలో నేను నిజంగానే అమ్మనీ, నాన్ననీ, చిన్నూనీ పూర్తిగా మర్చిపోయాను. కార్తీక మాసపు వెన్నెల్లో తాజ్ దూదిపింజల్లా తెల్లగా మెరిసిపోతోంది. తాజ్‌మహల్ ప్రేమకి అజరామరమైన గుర్తు. అలాంటి ప్రేమ గురించి కలలు కంటూ మేమందరం మైమరచిపోయాం. ఏదో దేవలోకంలో ఉన్నట్టు అనిపించింది. ప్రస్తుతం నిద్రపోతున్న ఒక రాజకుమారుడు ఏదో దేవలోకంలో ఉన్నాడనీ, నిద్ర లేవగానే మాకోసం వస్తాడనీ ఏవేవో ఊహించుకుని మురిసిపోయాం. గులాబీ మహల్, పంచ్‌మహల్, జల్‌మహల్‌లో అతని కోసం వెతికాం. అతనెక్కడా కనిపించలేదు! అలా మబ్బుల్లో తేలిపోతూ గడిపిన నాకు ఇంటికెళ్ళేందుకు బస్సులో కూర్చోగానే దిగులు ముంచుకొచ్చింది. ఆ ప్రసక్తి రాకపోయినా నా పక్కన కూర్చున్న స్నేహితురాలికి చిన్నూ సంగతీ, ఇంట్లో వాళ్ళ సంగతీ చెప్పేశాను. ఇంతకు ముందెన్నడూ నా స్నేహితురాళ్ళకి చిన్నూ సమస్య గురించి చెప్పని దాన్ని ఆరోజు మాత్రం "మా తమ్ముడికి ఏమైందో తెలీదు. ఎప్పుడూ పరధ్యానంగా, ఎవరితోనూ కలవకుండా అదోలా ఉంటాడు. నాకు వాడి గురించి ఆందోళనతో బాటు, మా నాన్నకి ఆ విచారం వల్ల జరగకూడనిది ఏదైనా జరుగుతుందేమోనన్న భయం మరీ ఎక్కువగా ఉంటోంది" అన్నాను.

బస్సు డిపోలో దిగి లోకల్ బస్సుకోసం ఎదురు చూడకుండా ఆటో చేసుకుని ఇల్లు చేరుకున్నాను. ఇంటికి త్వరగా వెళ్ళాలన్న ఆరాటం నాకు. గేటు దగ్గర ఆటో ఆగిన చప్పుడైనా ఎవరూ బైటికొచ్చి తొంగి చూడలేదు. నాకు ఆశ్చర్యమేసింది. పొద్దుగూకుతున్నా ఇంట్లో ఒక లైటు కూడా వెలగడం లేదు. చడీ చప్పుడూ లేదు. గేటు తీసుకుని లోపలికెళ్ళాను. తలుపుకి తాళం కప్ప కనిపించింది. ఎక్కడికెళ్ళుంటారు అందరూ కట్టకట్టుకుని? నా దగ్గర తాళంచెవి కూడా లేదు. ఎప్పుడూ ఇలా తాళం వేసి వెళ్ళింది లేదు. అలాగే నిలబడి ఏంచెయ్యాలని ఆలోచిస్తూండగా ఇంటి ముందుకు టాక్సీ వచ్చి ఆగింది. అందులోంచి అన్నయ్యా, వదినా దిగారు. 'వీళ్లెందుకు ఉన్నట్టుండి వచ్చారా? ' అని ఆశ్చర్యపోయాను. వాళ్ళతోబాటు సామానేమీ లేదు. 'అంటే వీళ్ళు స్టేషన్ నుంచి రావడం లేదన్నమాట!' అని అనుకున్నాను. భయం, అయోమయం చుట్టుముట్టి నాకు నోరెండిపోయింది.

"మీరిద్దరూ ఎప్పుడొచ్చారు అన్నయ్యా? అందరూ ఏమయ్యారు? " అన్నాను.

అన్నయ్య చాలా సుతారంగా నన్ను పొదివి పట్టుకుని "పద, లోపలికెళ్దాం, అప్పుడు చెపుతా" అన్నాడు.

"మీ దగ్గర తాళంచెవి ఉందా? "

అన్నయ్య తాళం తీశాడు. క్షణక్షణానికీ నా భయం, ఆందోళనా పెరగసాగాయి.

"చిన్నూ ఏడీ? అమ్మా, నాన్నా ఎక్కడికెళ్ళారు? "

"కంగారేం లేదు, వాళ్ళు ఆస్పత్రిలో ఉన్నారు. పెద్ద ప్రమాదమేమీ లేదు"

"ఆస్పత్రిలోనా? ఎవరు? "

"నాన్న"

"ఆయనకేమైంది? " అంటూంటే నా గొంతు వణికింది.

"కత్తిపోటుకి గురయాడు"

"ఎలా? "

"చిన్నూకి బలవంతంగా మందు తాగించేందుకు ప్రయత్నించినట్టున్నాడు. కోపంతో వాడు పక్కనే ఉన్న పళ్ళు కోసే కత్తితో ఆయన పొట్టలో పొడిచాడు"

"గాయం లోతుగా ఉందా? "

"అవును. కొన్ని పేగులు తెగిపోయాయి. ఆపరేషన్ చేశారు"

'నేను సరదాగా గడిపేందుకు ఎందుకు ఆగ్రా వెళ్ళానా? ' అని బాధపడ్డాను. నేనుంటే ఇలాంటిది జరిగేదికాదు. 'మందు తాగేందుకు వాడు అంత పేచీ పెడుతున్నప్పుడు మళ్ళీ ఆస్పత్రిలో చేర్చాల్సింది' అని నాన్న మీద కూడా కోపం వచ్చింది. నాన్న వాడు పెద్దయ్యాక వాడిపట్ల తనకున్న ప్రేమని బైటికి చెప్పి ఉండకపోవచ్చు, కానీ ఆయన ప్రాణాలన్నీ వాడిమీదే పెట్టుకున్నాడే! అది వాడికి అర్థం కాలేదా? అర్థమైతే ఇలాంటి పనిచేసేవాడా? ఎందుకిలా చేశాడు?

"చిన్నూ ఏడీ? "

"ఏమో.. పొద్దున్నించీ కనబడటం లేదు"

"వాడేదైనా అఘాయిత్యానికి? "

"చూడు శశీ! ఇప్పుడు చిన్నూ గురించి విచారించి లాభం లేదు. ఎక్కడికెళ్తాడు? ఎక్కడ తిరిగినా మళ్ళీ ఇంటికే కదా రావాలి? "

ఒకేసారి రెండు ప్రమాదాలు జరిగిపోయాయి. రెండిటిలో దేనికి ఎక్కువ బాధపడాలో నాకు తెలీలేదు. నాన్నకి ఏమైనా అవుతుందేమోనని భయపడనా? చిన్నూ ఎక్కడికెళ్ళాడు, అలాంటి పని ఎందుకు చేశాడని గాభరా పడనా? నిస్సహాయతకి ఏడుపొచ్చింది నాకు. 'తను ఏం చేశాడో వాడికి తెలుసా? ' అని అడిగాను అన్నయ్యని. అలా అడుగుతున్నప్పుడు నా గొంతు వణికింది.

"చెప్పా కదా, వాణ్ణి గురించి దిగులు పడకు. పోలీసులకి చెప్పాం. వాళ్ళు వెతికి వాణ్ణి తీసుకొస్తారు" అన్నాడు అన్నయ్య.

"పోలీసులకి చెప్పారా? "

"చెప్పకపోతే ఆస్పత్రివాళ్ళు చేర్చుకోమన్నారు. కత్తితో పొడవడం వల్ల అది పోలీసు కేసయింది"

"మరైతే ఇప్పుడు చిన్నూని జైల్లో పెడతారా? " అంటూంటే మళ్ళీ నా గొంతు వణకసాగింది.

"నువ్వేం కంగారు పడద్దు శశీ! అన్నీ నేను చూసుకుంటాగా!" అన్నాడు

అన్నయ్య.

వదిన వంటింట్లో ఉంటే నేను కూడా సాయం చేసేందుకు వెళ్ళాను. అన్నయ్య బాత్‌రూమ్‌లో ఉన్నాడు. ఇంతలో కాలింగ్ బెల్ మోగింది. నేను వెళ్ళి తలుపు తీశాను. బైట ఇద్దరు పోలీసులు నిలబడి ఉన్నారు.

"ఇవాళ ఉదయం ఇక్కడ కొట్లాట జరిగిందా? "

"అవును.."

"నేరగాడు హత్యాప్రయత్నం చేశాడా? "

"లేదు.. అలా జరగలేదు. మా నాన్నకి ప్రమాదవశాత్తు కత్తి పొట్టలో గుచ్చుకుంది"

"మీరు నేరగాడికి ఏమవుతారు? "

"వాడు నా తమ్ముడు"

"కొట్లాట జరిగినప్పుడు మీరిక్కడే ఉన్నారా? "

"లేదు, నేను బైటికెళ్ళాను. ఇంతకు ముందే వచ్చాను. చిన్నూ ఏడీ? "

"నేరగాడి పూర్తిపేరు చెప్పండి? "

"కుముద్ సైగల్. వాడెక్కడున్నాడు? మీకేమైనా తెలుసా? "

"పోలీస్ స్టేషన్‌లో ఉన్నాడు, కస్టడీలో"

అసలు పోలీసులని చూసే నా సగం ప్రాణాలు పోయాయి. కస్టడీ అన్న మాట వినగానే మూర్ఛ వచ్చినంత పనైంది.

"కానీ వాడు ఆ పని తెలీక చేశాడు. తెలిస్తే అలా ఎన్నటికీ చేసి ఉండడు"

'మీ ఆడవాళ్ళతో మాట్లాడడం వృథా' అన్నట్టు నావైపు చూశాడు పోలీసు.

"ఇంట్లో మగవాళ్ళెవరూ లేరా? " అన్నాడు.

"మా అన్నయ్య ఉన్నాడు"

"ఆయన్నొకసారి పిలవండి"

"కానీ ఆయన మాతో ఇక్కడ ఉండడు. నేనిక్కడే ఉంటాను. చిన్నూ గురించి నాకే ఎక్కువ తెలుసు. వాడు అలాంటివాడు కాదు.. ఈమధ్య వాడికి మెంటల్.."

"సరే, అవన్నీ మీరు మేజిస్ట్రేట్‌కి చెపుదురుగాని. మేం రిపోర్టు రాసుకునేందుకు వచ్చాం. మీ అన్నగారిని ఒకసారి పిలవండి"

అన్నయ్యని వాళ్ళు నాన్నగురించీ, చిన్నూ గురించీ ఇంకొన్ని విషయాలు అడిగారు. వాళ్ళు వెళ్ళిపోయాక అన్నయ్య, "బెయిలు మీద చిన్నూని విడిపించుకుని వస్తాను. కానీ వాడు ఇంక ఇక్కడ ఉంటే ప్రమాదం. మళ్ళీ ఎవరినైనా చంపేందుకు ప్రయత్నించచ్చు" అన్నాడు.

అన్నయ్య మాటలు నాకు చాలా చేదుగా అనిపించాయి. సొంత తమ్ముడిమీద, వాడెవరో పరాయి మనిషన్నట్టు అంత అపనమ్మకమా? పాపం వాడికి మేమిలా తన గురించి అనుకుంటున్నామని కాని, తను చాలా భయంకరమైన పని చేశానని గాని, తెలుసో లేదో! ప్రస్తుతం నాన్న గురించి నాకు ఎక్కువ బెంగగా ఉంది. త్వరగా రెండు ముద్దలు తిని, అన్నయ్యా, నేనూ అమ్మకి కొంత భోజనం ప్యాక్ చేసుకుని ఆస్పత్రికి వెళ్ళాం.

ఆస్పత్రికి చేరుకునేసరికి బాగా చీకటి పడింది. ఆస్పత్రి బైట వేరుశనగలూ, పళ్ళూ అమ్మే బళ్ళవాళ్ళు వెళ్ళిపోయేందుకు అన్నీ సర్దుకుంటున్నారు. వీధి దీపాలు వెలుగుతున్నప్పటికీ చీకటిని పారదోలలేక పోతున్నాయి అనిపించింది. ఆస్పత్రి కారిడార్లలో మసక వెల్తురు.. అక్కడ మందుల వాసనా, చెమ్మ వాసనా కలగలిసిపోయి అదోరకంగా అనిపించింది. ఎలాగో నాన్న గదికి చేరుకున్నాం. అమ్మ గదిబైట బెంచి మీద కళ్ళు మూసుకుని జపం చేస్తున్నట్టు కూర్చునుంది. నేను దగ్గరకెళ్ళి నెమ్మదిగా పిలిచాను. అమ్మ నిద్ర మేల్కొన్నదానిలా కళ్ళు తెరిచి "ఎప్పుడొచ్చారు? " అంది మమ్మల్ని చూస్తూ.

"నాన్న ఏడీ? " అన్నాను.

"ఇప్పుడు గదిలోకి తీసుకొస్తారు"

ఇంతలో ఇద్దరు నర్సులు స్ట్రెచర్ మీద నాన్నని అక్కడికి తీసుకొచ్చారు. అందరం లోపలికెళ్ళాం. నాన్న నోట్లో, ముక్కులో బోలెడన్ని ట్యూబులున్నాయి. ఆయన్ని పోల్చుకోడమే కష్టమనిపించింది. ఎడమ చేతికి ఒక గ్లూకోజ్ సీసాని సూది, గొట్టం సాయంతో అమర్చారు. నేనాయన తల దగ్గర చాలాసేపు కూర్చున్న తరవాత నాన్న కళ్ళు తెరిచి మొదట నన్నే చూశాడు. ఒక్కసారి చిన్నగా నవ్వి కళ్ళు మూసుకున్నాడు. నేను పిలిస్తే మళ్ళీ కళ్ళు తెరిచాడు. ఆయన అతి కష్టంమీద నోరు పెగుల్చుకుని "చిన్నూ ఎలా ఉన్నాడు?" అని అడిగాడు.

"బాగానే ఉన్నాడు నాన్నా"

"ఎక్కడున్నాడు?"

"ఇంట్లోనే" అన్నాను.

ఇంతలో నర్సు వచ్చి "ఇంతమంది ఇక్కడ ఉండడానికి వీల్లేదు. ఇక వెళ్ళండి" అని అరిచింది.




**మ**ర్నాడు పేపర్లో పెద్దపెద్ద అక్షరాలతో హెడ్‌లైన్లు వచ్చాయి. 'తండ్రి మీద కొడుకు హత్యా ప్రయత్నం... ఢిల్లీలోని కుముద్ సైగల్ అనే యువకుడు తన తండ్రి రమేష్ సైగల్ని కత్తితో పొట్టలో పొడిచి హత్య చేసేందుకు ప్రయత్నించాడు. చాలా తీవ్రంగా గాయపడిన రమేష్ సైగల్‌ని ఆస్పత్రికి తరలించారు. కుముద్ సైగల్ పోలీసుల నిర్బంధంలో ఉన్నాడు. కుటుంబ సభ్యులు కుముద్‌కి మతిస్థిమితం లేనందువల్ల అలా జరిగిందని, ఇంతకు ముందు ఎన్నోసార్లు అతను మానసిక రోగుల ఆస్పత్రిలో ఉండి వచ్చాడని చెప్పారు'

మా ఇంటి గుట్టు రట్టయింది. మా ఇరుగుపొరుగువాళ్ళూ, పరిచయస్థులూ ఈ వార్తని చదవకుండా ఉంటే బావుణ్ణని దేవుణ్ణి ప్రార్థించాను. సాయంత్రం ఆస్పత్రికెళ్తే అక్కడ పిన్ని కనిపించింది. "ఇంట్లో ఇంత పెద్ద గొడవయితే మాతో మాట మాత్రమైనా చెప్పలేదేం? అంత పరాయివాళ్ళమైపోయామా? చిన్నూ ఇంట్లో చెప్పకుండా మా ఇంటికి వచ్చినప్పుడే నాకు అనుమానం వచ్చింది" అంటోంది అమ్మతో.

సాయంకాలానికి నాన్నకి పూర్తిగా స్పృహ వచ్చింది. గొంతులో ఇంకా గొట్టం ఉండటం వల్ల దగ్గు వస్తోంది. మాట్లాడలేకపోతున్నాడు. దగ్గినప్పుడల్లా పొట్టకి ఆపరేషన్ చేసి, వేసిన కుట్లు చురుక్కు చురుక్కుమంటున్నాయి. నన్ను చూడగానే "నీ కోసమే బతికున్నానే! నీకు పెళ్ళి చెయ్యాల్సిన పని ఉండిపోయిందిగా?" అని మాత్రం అన్నాడు.

కాసేపాగి అన్నయ్యతో "చిన్నూ జాగ్రత్తరా. నేనిక్కడున్నంత వరకూ వాణ్ణి నువ్వే చూసుకోవాలి" అన్నాడు.

అన్నయ్య మర్నాడు చిన్నూని బెయిలు మీద విడిపించుకొచ్చాడు. మేజిస్ట్రేటు ఆదేశం ప్రకారం వాడిని ఉంచిన నేర ప్రవృత్తి గల మానసిక రోగుల ఆస్పత్రి చిరునామా, వివరాలూ సేకరించాడు.

చిన్నూ ఒంటి మీద నీలంగా కదుములు కనిపించాయి. ఎడమకన్ను ఎవరో గట్టిగా

పిడికిలితో గుద్దినట్టు వాచిపోయింది. చేతులు, భుజాలు, వీపు మీదా వాతలూ, గోళ్ళతో గీరిన గుర్తులూ కనిపించాయి. తలొంచుకుని వాడు అన్నయ్య వెనకాలే ఇంట్లోకొచ్చాడు.

నన్ను చూడగానే "చూడవే ఎలా కొట్టారో!" అంటూ బట్టలు విప్పి, దెబ్బల్ని చూపించాడు.

"ఇంతలా ఎందుకు కొట్టార్రా? " అన్నాను.

నాకు కోపం, ఏడుపూ తన్నుకొచ్చాయి.

"తెలీదు. చాలా రకాలుగా హింసించారు. అందరూ కలిసి చావగొట్టారు"

కొంతసేపు ఆగి "నాన్న ఏడీ? " అన్నాడు.

"ఆస్పత్రిలో ఉన్నాడు" అన్నాను.

"ఎందుకు? ఏమైంది? "

"ఏం లేదు. ఒంట్లో బాలేదు" అని చెప్పాను.

మౌనంగా కాసేపు ఆలోచించి "నాన్న కూడా నన్ను కొడతాడు" అన్నాడు తను.

"అవేం మాటల్రా? నాన్న నిన్ను కొట్టడు. నాన్నకి నువ్వంటే ప్రేమ"

"నువ్వు లేనప్పుడు కొట్టాడు. చావబాదాడు"

నేను జవాబు చెప్పకుండా వాడి మొహంలోని భావాలని చదివే ప్రయత్నం చేశాను.

వాడి మొహంలో భయం, అనుమానం తప్ప ఇంకే భావమూ కనిపించలేదు. ఎవరో బాగా భయపెట్టి, హింసించినట్టు బెదిరిపోయి ఉన్నాడు.

మర్నాడు నేను కాలేజీకి వెళ్లలేదు. ఆ తరువాతి రోజు వెళ్ళాను. నా స్నేహితురాళ్లందరికీ చిన్నూ చేసిన పని తెలిసిపోయింది. నా బెస్ట్‌ఫ్రెండ్ స్మిత మాత్రం ఏమీ అడగలేదు. మౌనంగా ఉంటూనే సానుభూతిని తెలియజేసింది. ఎవరూ ఏమీ అడగకపోయినా నాకు వాళ్లతో మాట్లాడాలంటే సిగ్గేసింది. ఇలాంటివి ఇంతకు ముందు చదవడమే తప్ప నాకు అనుభవంలోకి రాలేదు. 'అందరూ మా గురించి ఏమనుకుంటారో' అన్న భయం నన్ను తలెత్తుకోనివ్వలేదు. అందరితో అంటీముట్టనట్టు ఉండిపోయాను.

మధ్యాహ్నం ఇంటికి వచ్చేసరికి గేటు దగ్గర ఒక వ్యాన్ కనిపించింది. ఎవరి దబ్బా అని ఆలోచించాను. కానీ తెలీలేదు. ఉన్నట్టుండి యూనిఫాం వేసుకున్న ఇద్దరు మనుషులు చిన్నూని బలవంతంగా బైటికి ఈడ్చుకురావడం కనిపించింది. వాడు వాళ్ళ పట్టునించి విడిపించుకునేందుకు గింజుకుంటున్నాడు. "నన్ను వదలండి.. ఎవరైనా నన్ను విడిపించండి" అంటూ గొంతు చించుకుని అరుస్తున్నాడు.

అన్నయ్య ఆ లాక్కెళ్తున్నవాళ్లని ఏమీ అనకుండా చిన్నూతో "వాళ్ళు నిన్ను కొట్టరులేరా. ఆస్పత్రికి తీసుకెళ్తారు. ఏం భయంలేదు" అంటున్నాడు.

చిన్నూ ఇంకా గట్టిగా కేకలు పెట్టసాగాడు, ఎవరో చంపేస్తున్నట్టు. "నేను రాను. ఇది నా ఇల్లు. నేనిక్కడే ఉంటాను. వదలండి. నన్ను వెళ్లనివ్వండి" అంటున్నాడు.

పక్కింటివాళ్ళు బైటికి వచ్చి తమాషా చూడసాగారు.

చిన్నూ అన్నయ్యకేసి చూసి "నన్ను పంపించవద్దన్నయ్యా" అంటూ గోల చేశాడు.

నేను రాతిబొమ్మలా చూస్తూ నిలబడ్డాను. చిన్నూ నన్ను చూశాడు.

"అక్కా! నువ్వైనా చెప్పవే వీళ్ళకి. నన్ను వదిలెయ్యమని చెప్పవా? " అంటూ ఏడవసాగాడు.

ఆ ఇద్దరు మనుషులూ చిన్నూని వ్యాన్ వెనకవైపునించి లోపలికి ఎక్కించారు.

ఒకడు చిన్నూ చేతుల్ని బలంగా వెనక్కి విరిచి పట్టుకున్నాడు. రెండోవాడు వ్యాన్ తలుపు మూసేశాడు. అడవి జంతువుని బోనులో బంధించి తీసుకెళ్తున్నట్టు! చిన్నూ ఇంకా కేకలు పెడుతూనే ఉన్నాడు. దుమ్ము రేపుకుంటూ వ్యాను వెళ్ళిపోయింది. కానీ చిన్నూ కేకలు నా చెవుల్లో ఇంకా గింగురుమంటూనే ఉన్నాయి!

★ ★ ★

మా పిల్లాడు అంశూకి ప్రమాదం జరిగినప్పుడు కూడా నేను అసహాయురాలినే అనిపించింది. కానీ ఏదోవిధంగా నిలదొక్కుకుని 'ఈ విషయంలో నేను నిస్సహాయురాలిని కాకూడదు' అని నిశ్చయించుకున్నాను. ఇంకొకరి నిర్ణయాలని అనుసరించి నడుచుకోదల్చుకోలేదు. తల్లినవడం వల్ల కావచ్చు, నాలో ఒక రకమైన ఆత్మవిశ్వాసం చోటుచేసుకుంది. హక్కులనేవి ఎవరూ మనకి పళ్లెంలో పెట్టి అందించరనీ, మనకి మనంగా చైతన్యంతో ప్రయత్నించి సంపాదించుకోవాలనీ అర్థమైంది. హక్కులతో బాటు త్యాగాలు కూడా కలిసే ఉంటాయని తెలిసింది. పగలు మా ఆయన అశోక్ బిజినెస్ పనుల మీదా, రాత్రిళ్ళు పేకాడడానికి క్లబ్బుకి వెళ్లిపోతే నేను గంటలకొద్దీ అంశూతో ఏదేదో మాట్లాడుతూ, ఎప్పుడో ఒకప్పుడు వాడు నా మాటలు విని ప్రతిస్పందించకపోతాడా, కళ్లు తెరిచి, నన్ను చూసి మునుపటిలా నవ్వకపోతాడా? అని ఎదురుచూస్తూ గడిపేదాన్ని. వాడి నోటంట 'అమ్మా!' అనే పిలుపు కోసం చెవులు రిక్కించి వినేదాన్ని. అప్పుడప్పుడూ నేను చేసేది వ్యర్థ ప్రయత్నం అని కూడా అనిపించేది. వీసమెత్తు ఆశ ఉన్నా దాన్ని పూర్తిగా ఉపయోగించుకోవాలనే నిర్ణయించుకున్నాను.

చివరికి అంశూ ఒక రోజు కళ్ళు తెరిచాడు... నిద్ర లేచినట్టు! పుట్టగానే కళ్ళు తెరిచే పసికందులా శూన్యంగా, నేనెవరో తెలీనట్టు నా వైపు చూశాడు. మళ్ళీ కొత్తగా వాడికి నేను అమ్మనని చెప్పాల్సిన పరిస్థితి ఏర్పడింది. వాడిమీద నాకున్న ప్రేమని... నేను వాడి అమ్మనన్న విషయాన్ని... రకరకాలుగా తెలియజెయ్యడం మొదలెట్టాను. వాణ్ణి ఒళ్ళోకి తీసుకోడం, ముద్దు పెట్టుకోడం, ఆప్యాయంగా నిమరడం లాంటివి చెయ్యసాగాను. అయినా వాడు నాకేసి అభావంగా చూసేవాడు. వాడు నా మాటలు వింటున్నాడు కానీ జవాబు చెప్పలేకపోతున్నాడనిపించింది.

మూడో పుట్టినరోజు కూడా జరుపుకున్నాక మూడు నెలల పిల్లాడిలా వాడి నోటంట... మా... పా... అం... లాంటి ధ్వనులు రావడం మొదలైంది. దానికే మహదానందపడిపోయాను! నేను చేసిన తపస్సు... ఇన్నాళ్ళు ఓర్పుతో చేసిన ప్రయత్నం చివరికి ఫలించింది! ఆ తరువాత మా ఇద్దరి మధ్యా మాటల ప్రపంచం రూపుదిద్దుకోసాగింది. ఆ మాటలు మాకిద్దరికీ మాత్రమే అర్థమయ్యేవి. మాకు మాత్రమే సొంతమైన భాష అది. అశోక్‌కి ఆ భాషని అర్థం చేసుకునేందుకు కూడా తీరికలేదు.

అంశూకి పుస్తకాల్లో నేను రకరకాల బొమ్మలు చూపించేదాన్ని. జూకి తీసుకెళ్ళి జంతువులని చూపించేదాన్ని. వాటి పేర్లు మళ్ళీ మళ్ళీ ఉచ్చరించి వాడికి ఆ పేర్లు అనడం నేర్పేదాన్ని. గంటలకొద్దీ ఇద్దరం తోటలో పువ్వులనీ, కూరగాయలనీ చూస్తూ తిరిగేవాళ్ళం. వాటిని ముట్టుకోమని వాడికి చెప్పి, వాటి పేర్లు చెప్పేదాన్ని. అన్ని మాటలూ తప్పుల్లేకుండా అనడం వాడివల్ల అయ్యేది కాదు. కానీ కష్టపడి ప్రయత్నించేవాడు. అన్నయ్య అమెరికానించి వాడికోసం రకరకాల బ్లాక్స్ తీసుకొచ్చాడు. వాటి ఆకారాలని మనసులో

ముద్రించుకొంటూ వాటితో కొత్త ఆకారా లని తయారు చేసేవాడు. వాడు సొంతంగా ఏ చిన్నపని చేసినా నాకది గొప్పగా అనిపించేది.

ఆరేళ్ళు వచ్చాక అంశూని స్కూల్లో వేశాను. మిగతా పిల్లల్లా కాకుండా వాడు నట్టుతూ మాట్లాడేవాడు. కానీ చేతికి వస్తు వులిచ్చి, వాటితో ఏమైనా చెయ్యమంటే మాత్రం చాలా త్వరగా చేసేసేవాడు. ఇంగ్లీషూ, హిందీ అక్షరాలని కూడా గుర్తు పట్టడం త్వరగానే నేర్చుకున్నాడు. వాడికి వీటిని నేర్పించిన ఆ చిన్న ప్రైవేటు స్కూలు ప్రిన్సిపాల్‌కి మనసారా ధన్యవా దాలు తెలిపాను. వయసులో పెద్దవాడైన ప్పటికీ ఆవిడ వాణ్ణి నర్సరీ క్లాసులోకి తీసు కుంది. స్కూలు పేరు చెబితేనే అంశూ తెగ మురిసిపోయేవాడు.

ఇలాగే కొన్ని నెలలు గడిచాయి. ఒక రోజు ప్రిన్సిపాల్ నాకు కబురు పెట్టింది. మిగతా పిల్లలతో సమానంగా వాడు చదు వులో ముందుకి పోలేకపోతున్నాడనీ, ఆటలూ అవీ చాలా బాగా ఆడతాడనీ, లెక్కల్లో అయితే వాడికి బొత్తిగా ఏమీ రాదని అంది. నేను భయపడుతూ, "మేడమ్! నేను ఇంట్లో చెప్పిస్తాను. అప్పుడు అందుకోగలుగుతాడు" అన్నాను.

వాడికి ఇంట్లో ఎక్కాలూ, చిన్నచిన్న లెక్కలూ చెప్పాను. పువ్వులూ నాణేలతో కూడికలూ, తీసివేతలూ నేర్పించాను. కానీ వాడికి ఎన్నిసార్లు చెప్పినా గుర్తుండేవి కా వు. పువ్వుల పేర్లు గుర్తుండేవి కానీ గుత్తిలో ఎన్ని పువ్వులున్నాయో అడిగితే చెప్పలేకపోయేవాడు. ప్రతిసారీ కొత్తగా లెక్క పెట్టమని చెప్పాల్సి వచ్చేది. ఎంత బుర్ర బద్దలు కొట్టుకుని, ఉపాయాలు కని పెట్టి నేర్పించినా లాభం లేకపోయింది. చివరికి ఒక రోజు ప్రిన్సిపల్ నా మొహం మీదే "సారీ మిసెస్ పూరీ! మీ అబ్బాయిని ఇక మా స్కూల్లో ఉండనివ్వడం కుదరదు. ఇంకెక్కడైనా చేర్పించండి" అని కుండ బద్దలు కొట్టినట్టు చెప్పేసింది.

మిగతా స్కూళ్లలో కూడా ఇలాగే జరి గింది. ఒకసారి వికలాంగుల స్కూలుకి కూడా తీసుకెళ్లాను. అక్కడి పరిస్థితి చాలా ఘోరంగా ఉంది. పిల్లలు ఏమీ నేర్చుకోడం

లేదు. ఏదో కాలక్షేపానికి తల్లిదండ్రులు అక్కడ చేర్పించారనిపించింది. ఆడుకోగల పిల్లలు వాళ్లలోవాళ్ళే ఏవో ఆటలు ఆడు కుంటున్నారు. మిగతావాళ్ళు కదలకుండా ఊరికే ఒకేచోట నీరసంగా కూర్చుని ఉన్నారు. అంశూని ఇక్కడ చేర్పిస్తే ఇప్పటి వరకూ నేర్చుకున్నది కూడా మరచిపోతా డని అనిపించింది. ఇక లాభం లేదని వాడి చదువుసంధ్యల బాధ్యత నేనే చూసు కోవాలనుకున్నాను.

అంశూ నా నేస్తం. నా తోడు... అయి పోయాడు. రోజంతా నాతోనే గడిపేవాడు. నేను వంట చేస్తుంటే సాయం చేసేవాడు. తోటపని చేసేవాడు. భోజనానికి కూర్చుంటే అన్నీ తెచ్చి బల్లమీద పెట్టే వాడు. సలాడ్‌కు కూరలు తరిగేవాడు. గిన్నెలు కడిగేవాడు. అన్ని పనులూ అయి పోయాక ఇద్దరం కూర్చుని పుస్తకాల్లో బొమ్మలు చూసేవాళ్లం. బ్యాడ్‌మింటన్, ఫుట్‌బాల్ ఆడేవాళ్ళం. పెద్ద అచ్చులో ఉన్న పుస్తకాలు చదివేవాళ్ళం. అంశూ మామూలు పిల్లల్లాగా డాక్టరో ఇంజనీరో అవలేడన్న బాధ అప్పుడప్పుడూ మనసుని తొలిచేది. అయినా వాడికి మంచి జీవితం, తన కాళ్లమీద తను నిలబడగలిగే సామర్థ్యం వస్తే అదే పదివేలు అనుకునే దాన్ని. అందుకోసం నా శాయశక్తులా ప్రయత్నించడం మొదలెట్టాను.

★ ★ ★

మా తమ్ముడు చిన్నూ గురించి నేనె ప్పుడూ ఇంతలా ఆలోచించలేదు. గట్టి ప్రయత్నం చెయ్యలేదు. వాడంతట వాడే బాగైపోతాడని ఎదురు చూసేదాన్ని. వాడిలో కూడా ఒక రకమైన మానసిక సంఘర్షణ నాకు కనిపించేది. ఇంట్లో ఉన్నంతసేపూ వాడికి తనకి బాగా తెలిసిన వాతావరణం కాబట్టి బావుండేది. బైటికి వెళ్లాలంటే, ముఖ్యంగా ఆస్పత్రికి తీసుకెళ్తే బిర్రబిగుసుకుపోయేవాడు. ఆస్పత్రి పేరు చెబితేనే భయంతో వణికిపోయేవాడు. కానీ మాకందరికీ చిన్నూ ఇంట్లో ఉంటే ఒక రకమైన దిగులూ ఆందోళనా అనిపిం చేది. శాపగ్రస్తమైన ఒక నీడ ఇల్లంతా పరుచుకున్నట్లు ఉండేది. వాడు ఇంట్లో లేకపోతే మా పనులు ఎప్పట్లాగే జరిగిపో యేవి. వాడి ప్రసక్తి మా మాటల్లో చాలా తక్కువగా ఉండేది. కానీ ఎదురుగా కనిపి స్తున్న వాడి గది, బట్టలు, వాడికిష్టమైన వంటకాలూ, అవన్నీ పట్టించుకోకుండా ఉండడం కూడా కష్టమయేది. అనుక్షణం వాడికి సంబంధించిన ఏదో ఒక విషయం గుర్తొస్తూ ఉండేది. వాడు లేని ఇల్లు బోసి పోయినట్టుండేది. ఉన్నా, లేకపోయినా అదే దిగులు! అందరికన్నా చిన్నవాడూ, గారాబంగా పెరిగినవాడూ చిన్నూ.

చిన్నూని చూసేందుకు అన్నయ్య మాన సిక రోగులుండే ఆస్పత్రికి వెళ్తూంటే నేను కూడా వస్తానని పట్టుపట్టాను. అన్నయ్య ఒప్పుకోలేదు.

"అలాంటి చోట్లకి ఆడపిల్లలు రాకూ డదు" అన్నాడు.

"నేనొచ్చేది తమ్ముణ్ణి చూడ్డానికేగా, తప్పే ముంది? "

"లేదు, అప్పుడే వద్దు. ముందు నేను చూసొస్తాను. అక్కడ ఎలా ఉంటుందో ఏమిటో!"

అన్నయ్య చిన్నూని చూసి ఇంటికొ చ్చాడు. మొహం బాగా వాడిపోయివుంది. ఏదో తప్పు చేసినట్టు మొహం కళ తప్పింది. చాలా దిగులుగా "ఏమిటోనే, అక్కడేం బాలేదు" అన్నాడు నాతో.

"ఏమైంది? "

"అక్కడ అందరూ పిచ్చివాళ్ళే ఉన్నారు"

"చిన్నూ ఎలా ఉన్నాడు? "

"చాలా బక్కచిక్కిపోయాడు. పూర్తిగా నిరాశతో కుంగిపోయినట్టు కనిపించాడు"

"వాణ్ణి ఇంటికి తీసుకురాలేమా? "

"డాక్టర్ని ఆ మాట అడిగాను. పూర్తిగా బాగయితేగానీ ఇంటికి పంపించనన్నాడు"

"బాగయేందుకు ఎన్నాళ్ళు పడుతుం దిట? "

"అప్పుడే ఏమీ చెప్పలేనన్నాడు. మని షిని బట్టి, రోగ తీవ్రతని బట్టి నయం అవ డానికి పట్టే సమయం మారుతుంద న్నాడు. కనీసం ఆరు నెలలు పడుతుంద న్నాడు"

"వాణ్ణి ఒకసారి చూసొస్తానన్నయ్యా!"

"నువ్వు చూడకపోతేనే మంచిది. అక్కడి వాతావరణం చూసి తట్టుకోలేవు"

నేను దేన్నైతే చూడకూడదని అన్నయ్య అనుకుంటున్నాడో, అది వద్దనుకున్నా రక రకాలుగా నా కళ్లముందు కదలాడుతూనే ఉందని తనకి తెలీదు. ఎత్తైన గోడలూ.. జైలులా కటకటాల గదులూ.. చిన్నూ ఆ గదుల్లోంచి బైటపడేందుకు, గోడల్ని చేతు లతో బలంగా పడదోసేందుకు ప్రయ త్నిస్తూ.. తల కటకటాలకేసి బాదు కుంటూ.. గాయపడుతుండడం... అక్కడ సిబ్బంది వాణ్ణి పట్టుకుని, బంధించి లోప లికి తీసుకెళ్తూండటం.. అక్కడ దుర్గంధం, చెమ్మతో నిండిన గదుల్లో చిన్నూ తింటు న్నాడో, పస్తులుంటున్నాడో కూడా పట్టిం చుకోని ఆ డాక్టర్లూ, నర్సులూ.. పస్తు లున్నా కరెంటు షాకులు మాత్రం ఇస్తూం డటం..ఇవన్నీ ఊహించుకుని నాకు నీరసం ముంచుకొచ్చేది.

వాడి మనసులో మా జ్ఞాపకాలు మసక మసకగా తలెత్తుతూ ఉంటాయా? అమ్మ ఒడిలో సేద తీరడం.. కోపంతో ఎర్రబడిన నాన్న మొహం.. నా చూపుల్లో ప్రశ్నలూ.. మామిడిచెట్టు కింద దట్టమైన నీడా... తన గదిలో వస్తువులూ!! ఇల్లంటే అవన్నీ గుర్తొ స్తాయా? లేక అది ఒక పదం మాత్ర మేనా? ఇన్ని రోజుల తరవాత వాడి మానసిక స్థితి ఎలా మారిందో ఎవరికి తెలుసు? నేను ఆలోచిస్తున్నట్టు వాడు కూడా నా గురించి ఎప్పుడైనా ఆలోచి స్తాడా? వాళ్ళు లాక్కుపోతుంటే నాతోనే కదా మొరపెట్టుకున్నాడు!




ఆస్పత్రి నించి ఇంటికి వచ్చాక కూడా నాన్న మునుపటిలా లేచి తిరగడానికి చాలా రోజులు పట్టింది. ఎప్పుడూ చిన్నూని చూడాలని ఉందని అనేవాడా యన. అన్నయ్యా, వదినా వెళ్ళిపోయారు. ఆయన్ని చిన్నూ దగ్గరికి ఎవరు తీసుకె ళ్తారు? ఒకరోజు నేను కాలేజీ నించి వచ్చాక, నాన్న తనే స్కూటర్ నడుపు కుంటూ ఆస్పత్రికి వెళ్ళారని అమ్మ చెప్పింది. చాలా దిగులు పడిపోయి ఆయన ఇంటికొచ్చాడు. "అక్కడ వాడ స్సలు ఏమీ తినడంలేదు. చాలా రోజులుగా జ్వరం వస్తోంది. దగ్గుతు న్నాడు. వాడి పరిస్థితి ఏమీ బాలేదు" అన్నాడాయన అమ్మతో.

కాసేపు ఆగి మళ్ళీ, "పొద్దున్న ఏదైనా చేసి ఇయ్యి. ఇంటి భోజనం తింటే ఆరోగ్యం సర్దుకోవచ్చు. నేను తీసుకెళ్ళి తిని పిస్తాను" అన్నాడు నాన్న.

'నాన్న మళ్ళీ అంత దూరం స్కూటర్ నడుపుకుంటూ వెళ్ళగలడా? ' అని మాకు అనుమానం వచ్చింది. కానీ మరో దారి

లేదు. చిన్నూకోసం ఏదో ఒకటి చెయ్యాలి కదా! అమ్మ పొద్దున్న అయిదు గంటలకి లేచి ఏవేవో తినుబండారాలు తయారు చెయ్యసాగింది. చిన్నూకి ఇష్టమైన బాదాం ఖీర్, పూరీలూ, బంగాళాదుంపల కూరా, వంకాయ పచ్చడీ... స్వయంగా తన చేతులతో చేసి ఇవ్వడంలో ఆవిడకి అదో తృప్తి!

నాన్న విసుక్కున్నాడు. "వాడసలే జ్వరంతో ఉన్నాడు. ఇవన్నీ ఏం తింటాడు? "

అమ్మ వినిపించుకోకుండా ఇంకా రక రకాల కూరగాయలు వేసి, సూప్‌కూడా చేసింది.

"మీరు తీసుకెళ్ళండి. ఏం కావాలంటే అది తింటాడు. వాడు తినకపోతే మనం తింటాం. తీసుకెళ్ళేందుకు మీకేమిటి ఇబ్బంది? "

అయిదు గిన్నెలున్న టిఫిన్ క్యారియర్ ఎత్తి "అబ్బా! ఇంత బరువుందే! నలభై మైళ్ళు.." అన్నాడు నాన్న.

మధ్యలో అడ్డొచ్చి "మీరేమైనా మోసుకెళ్లాలా? స్కూటరే కదా మోసేది? " అంది అమ్మ.

చిన్నూ కోసం ఎంతో తాపత్రయ పడే నాన్న, అమ్మ ఏమాత్రం ఎక్కువ చేసినా ఎందుకు విసుక్కుంటాడో నాకు అర్థం కాదు.

చిన్నూ అన్నీ రుచి చూశాడు కానీ ఏమీ తినలేదు. సూప్ మాత్రమే తాగాడు. క్యారియర్‌లో ఉన్న పదార్థాలన్నీ అలాగే ఉండడం చూసి అమ్మ మనసు నొచ్చుకుంది. పైకి మాత్రం "పోన్లెండి, ఎంతోకొంత పొట్టలోకెళ్ళింది కదా!" అంది.

'ఇంటి భోజనం రుచి చూశాక చిన్నూకి ఏమనిపించిందో!' అనుకున్నాను.

దాదాపు ప్రతి రెండు మూడు రోజులకొకసారి నాన్న చిన్నూకి ఇంటినించి ఏదో ఒకటి తినేందుకు తీసుకెళ్ళేవాడు. ఆదివారం అయితే ప్రత్యేకంగా దీనికే కేటాయించేవాడు. అయినా చిన్నూ జ్వరం, దగ్గూ తగ్గనేలేదు. అనారోగ్యం మరింత పెరిగేసరికి డాక్టరే స్వయంగా నాన్నతో, "మా దగ్గరుంటే మీ అబ్బాయికి సరైన చికిత్స చెయ్యడం కుదరదు. మీరితన్ని ఇంటికి తీసుకెళ్ళండి. అక్కడే ఎవరైనా డాక్టర్‌కి చూపించండి. చాలా నీరసించిపోయాడు. తిండి కూడా సరిగ్గా తినడంలేదు. వాతావరణం మార్పు వల్ల ఆరోగ్యం కుదుటపడచ్చు" అన్నాడు.

బీఏ పరీక్ష ఆఖరి పేపర్ రాసి ఇంటికొచ్చాను. అమ్మ చిన్నూ గదిలో ఉంది. పనమ్మాయి చేత గది శుభ్రం చేయిస్తోంది. "మంచం కింద బాగా ఊడ్చి తుడవాలి. బూజులు దులిపి అన్నీ శుభ్రంగా, దుమ్ము లేకుండా తుడిచెయ్యి. వాడికి అసలే దగ్గు తగ్గడంలేదు" అంటోంది పనమ్మాయితో.

"అమ్మా! చిన్నూ ఇంటికొస్తున్నాడా? " అన్నాను.

"అవునే. నువ్వు బజారుకెళ్ళి కాసిని పళ్ళు తీసుకురా. వంటతనికి కూరలన్నీ వేసి సూప్ తయారు చెయ్యమని చెప్పు. వాడు ఏమిష్టపడతాడో, ఏమిటో!"

దాదాపు తొమ్మిది నెలల తరవాత కొడుకు ఇంటికొస్తున్నాడు. ఇంట్లో కొత్తగా పిల్లో పిల్లవాడో పుట్టబోతున్నంత హడావిడిగా ఉంది. కానీ ఆ హడావిడిలో ఉల్లాసం లేదు... ఉత్సాహంతో కూడిన ఎదురుచూపు లేదు.

నాన్నతోబాటు చిన్నూని తీసుకొచ్చేందుకు బాబాయి కూడా వెళ్లాడు. వాళ్ళిద్దరూ వాణ్ణి చెరోపక్కా పట్టుకుని నెమ్మదిగా లోపలికి నడిపించుకుని వచ్చారు. సొంతంగా నడిచే శక్తి బొత్తిగా లేదు వాడికి. భుజాలు ముందుకి కుంగిపోయాయి. బుగ్గలు లోతుకు పోయి గుర్తుప

ట్టలేనంతగా చిక్కిపోయాడు. ఎముకలు బైటికొచ్చి, కళ్ళు గుంటలు పడి, మొహంలో కళాకాంతీ లేకుండా తయారయాడు. అసలు వాడు ఎవర్నీ గుర్తుపట్టనట్టు అభావంగా చూస్తూ ఉండిపోయాడు. మొహంలో విపరీతమైన అలసట తప్ప ఇంకే భావమూ లేదు. అమ్మ వెంటనే వాణ్ణి మంచం మీద పడుకోబెట్టేందుకు ప్రయత్నించింది. పడుకోగానే వాడు పెద్ద దగ్గుతెరతో ఉక్కిరిబిక్కిరి అయాడు. బోలెడంత కఫం బైటికొచ్చింది. నేను పరిగెత్తు కెళ్ళి బాత్‌రూమ్ లోంచి బేసిన్ తీసుకొచ్చాను. పెద్ద వాంతి అయినట్టుగా ఉంది ఆ కఫం. వాడు ఆ బేసిన్‌లో అలా ఉమ్మేస్తూనే ఉన్నాడు.

బాబాయి మొహంలో ఆందోళన కనిపించింది.

"వీణ్ణి వెంటనే డాక్టర్‌కి చూపించాలి. టెస్ట్‌లూ అవీ చేయించాలి. ఇవి క్షయ రోగం లక్షణాలు" అన్నాడు బాబాయి.

ఆ మాట అందరికీ పిడుగుపాటులా అనిపించింది. అసలే వాడికి ఉన్న సమస్యతో అందరం సతమతమవుతూంటే, ఇలాంటిది తట్టుకోవడం అసాధ్యమని అనిపించింది.

టెస్ట్‌ల ఫలితాలు వచ్చేవరకూ ఒకపక్క భయంతో మరోపక్క ఆశతో తల్లడిల్లిపోయాం. కానీ మా భయాలు నిజమయాయి. వాడికి క్షయ ఉందని వైద్య పరీక్షలు నిర్ధారించాయి!

నాన్న అది విని కుప్పకూలిపోయాడు. ఆ దెబ్బకి ఒక్కనెలలో ఆయనకి గుండె పోటు వచ్చింది. మళ్ళీ ఆస్పత్రి చుట్టూ తిరగడం ప్రారంభించాం. చిన్నూ ఇంకా కోలుకోలేదు. మేం వాణ్ణి ఒంటరిగా ఇంట్లో వదిలి ఆస్పత్రికి వెళ్తే నాన్నకి గాభరా ఎక్కువయేది. ఆయన మొహాన చిరునవ్వే నేది లేకుండా పోయింది. ఒకరోజు నాతో "నే జీవితంలో ఘోరంగా ఓడిపోయాను!" అన్నాడాయన.

"అలాంటి మాటలు ఎందుకంటావు నాన్నా!" అన్నాను.

"నే చేసిన తప్పులవల్ల, గారాబంవల్లే చిన్నూ అలా తయారయాడు. లేకపోతే ఏమైనా సాధించి ఉండేవాడు"

ఆయన మనస్సు లోతుల్లోంచి హృదయాన్ని చీల్చుకుంటూ, గాయపరుస్తూ వచ్చిన ఆ మాటలకి జవాబేం చెప్పాలో నాకు తెలీలేదు.

అన్ని కష్టాలని అనుభవిస్తూ అమ్మ బాగా రాటుదేలి అన్నీ ఎదుర్కునే స్థితికి చేరుకుంది. ఇంతకుమునుపు ఎన్నడూ ఆవిడ అంత నిబ్బరంగా ఉండడం, నిర్ణయాలు తీసుకోడం నేను చూడలేదు. ఇంట్లో చిన్నూనీ, ఆస్పత్రిలో నాన్ననీ కనిపెట్టి ఉండేందుకు ఆవిడ ఎన్నిసార్లు బైటికి వెళ్ళి ఇంటికి రావలసివచ్చినా ఎన్నడూ విసుక్కోలేదు, అలిసిపోతున్నానని అనలేదు. ఊరికే ఏడుస్తూ కూర్చోలేదు. పగలనక రాత్రనక సేవలు చేస్తూనే ఉంది. ఎప్పుడు నేను ఆస్పత్రిలో నాన్న దగ్గర ఉండాలో, ఎప్పుడు తనుగాని, నౌకరు గాని ఉండాలో, అన్నయ్యని పిలవాలంటే ఎప్పుడు, ఎన్నాళ్ళ కోసం పిలవాలో.. అన్నీ ఆవిడే చూసుకోడం మొదలెట్టింది.

అన్నయ్య రాగానే "అన్ని పనులూ నీ

మీదే వేశాం. ఇంక శశి కోసం మంచి సంబంధం చూసే బాధ్యత కూడా నువ్వే తీసుకో. నాన్న ఉండగానే దానికి ఆ మూడుముళ్ళూ పడేలా చూడు. ఎలాగూ మనకి చెడ్డపేరు వచ్చేసింది. ఆ శుభ కార్య మేదో త్వరగా జరిగిపోతే మంచిది" అంది అమ్మ.

అమ్మ అలా మాట్లాడడం నాకేమాత్రం నచ్చలేదు. 'అంత కఠినంగా ఎలా మాట్లా డగలుగుతోంది' అని అనిపించింది. ఇంట్లో ఇంత పెద్దపెద్ద సమస్యలతో అందరమూ కొట్టుకుంటూంటే ఈవిడ నా పెళ్ళి గురించి మాట్లాడుతుందేమిటి? అని ఆశ్చర్యపో యాను.

"నేను పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతే చిన్నూని ఎవరు చూసుకుంటారు? " అన్నాను ఆందోళనతో.

"వాణ్ణి నువ్వు చూసుకోనక్కర్లేదు. మేమంతా లేమా? ఆడపిల్లలు ఎప్పుడో ఒకప్పుడు పరాయింటికి వెళ్ళవలసిందే కదా? చిన్నూ కోసమని నిన్ను ఎన్నాళ్ళు ఇంట్లో ఉంచుకుంటాం? "

అమ్మకి ఇలాంటి విషయాలలో చాలా కచ్చితమైన అభిప్రాయం ఉంది. దాన్ని గురించి వాదించేందుకు వీల్లేదు. తనే కొన్ని నియమాలు పెట్టుకుని, చాలా నిర్ద యగా వాటిని పాటిస్తుంది. అవతలివాళ్ళు కూడా పాటించాలనుకుంటుంది. ముఖ్యంగా అన్నయ్య అమ్మ పెట్టే రూల్సు తూచా తప్పకుండా పాటిస్తాడు.

ఒకరోజు అన్నయ్య అమ్మతో ఇలా అనడం విన్నాను "చాలా చోట్ల శశికోసం అబ్బాయిల గురించి వాకబు చేశాను. మంచి సంబంధాలు రెండు మూడు ఉన్నాయి. కానీ సమస్య పెళ్ళి చూపులు ఎక్కడ ఏర్పాటు చెయ్యాలనేదే. మనింట్లో లాభం లేదు కదా!"

"ఏం? " అంటూ ఆవిడే చిన్నూ గదివైపు చూసి మాట్లాడకుండా నిట్టూర్చి "మరైతే ఎలా? " అంది.

"నన్నడిగితే ప్రస్తుతం కొంచెం ఆగడమే మంచిది. మగపెళ్ళివాళ్ళు మన ఇల్లూ వాకిలీ చూడందే సంబంధం ఖాయం చేసు కోరు. చిన్నూని మళ్ళీ ఆస్పత్రిలో చేర్చాక చూడడం ప్రారంభిద్దాం" అన్నాడు అన్నయ్య.

"మళ్ళీ అంత త్వరగా వాణ్ణి ఆస్పత్రికి.."

అమ్మ మాటలకి అడ్డొస్తూ "అమ్మా! వాణ్ణి ఎక్కువకాలం ఇంట్లో ఉంచుకోడం మంచిది కాదు. క్షయ అంటువ్యాధి. వీలై నంత త్వరగా ఆస్పత్రికి పంపెయ్యడమే మంచిది" అన్నాడు అన్నయ్య.

చాలారోజుల తరవాత అమ్మ మొహంలో చిరాకు కనిపించింది. "మనం ఎంతో జాగ్రత్తగా చూసుకుంటేనేగాని కోలు కోలేడు వాడు. ఆస్పత్రిలో వీణ్ణి ఎవరు పట్టించుకుంటారు చెప్పు!"

నిజంగానే చిన్నూ చూసేందుకు ఇప్పుడు బాగున్నాడు. అమ్మ చేతివంట తింటూ బాగా కోలుకున్నాడు. మొహం తేటగా ఉంది. ఒంట్లో కాస్త బలం, కండా కూడా వచ్చాయి. అమ్మ వాడికి సులభంగా అరిగే పౌష్టికాహారం ఇస్తోంది.

అమ్మకి కూడా వాడికొచ్చినది అంటు వ్యాధి అని తెలుసు. అందుకే నన్ను గాని అన్నయ్యనిగాని వాడి దగ్గరకి వెళ్ళని వ్వదు. కానీ తన గురించి ఏమాత్రం పట్టించుకోకుండా వాడి పనులన్నీ తనే చేస్తుంది. ఇంకెవరూ వాడి దగ్గరకి వెళ్ళడం లేదు కాబట్టి వాడు ఇంట్లో ఉంటే మాత్రం నష్టమేముందని ఆవిడ ఆలోచన.

మేం కూడా ఆ రోజుల్లో బంధువులూ, స్నేహితులూ, అందరికీ దూరంగానే ఉంటూ వచ్చాం. మా ఇంటికి ఎవరూ వచ్చేవారు కాదు. మేం కూడా ఎవరింటికీ వెళ్ళేవాళ్ళం కాదు. మిగతావాళ్ళు తమ

పిల్లలు ఎంత పైకొచ్చారో చెప్పినప్పుడల్లా అమ్మకీ నాన్నకీ బాధ మరీ ఎక్కువయేది. చిన్నూ అందరికీ ఒక మచ్చలా అనిపించ సాగాడు. వాడు పడుతున్న బాధ కన్నా ఇంట్లోవాళ్ల కష్టం ఎక్కువ అనిపించే స్థితికి చేరుకున్నాం. వాడు కోలుకుంటున్నాడా లేదా? అని కూడా పట్టించుకోవడం తగ్గి పోయింది. నేను కూడా అలాగే ప్రవర్తిం చినప్పటికీ, దాన్ని నా మనసు ఒప్పుకోలేక పోయింది. నా పెళ్ళి గురించి అమ్మా, అన్నయ్యా కంగారు పడుతున్నప్పుడు, పరి స్థితి ఎంత భయంకరంగా ఉందో నాకు స్పష్టంగా తెలిసింది.

అన్నయ్య కష్టపడి ఒక ఆస్పత్రిని కను క్కున్నాడు. మా ఇంటికి పాతిక ముప్పై మైళ్ల దూరంలో చిన్నూ వ్యాధికి చికిత్స చేసే ఆస్పత్రి ఒకటి దొరికింది. అది మరీ దూరంగా లేదు కాబట్టి అమ్మా, నాన్నా వీలైనప్పుడల్లా చిన్నూని చూసి వస్తూ వుండచ్చు అని అనుకున్నారు.

చిన్నూని ఆస్పత్రిలో చేర్చడమంటే ఇంట్లో ఉన్న చెత్తా చెదారం బైట పారె య్యడం లాంటిదే అనిపించింది. చెత్త బైట పారేశాక ఒక రకమైన హాయి, సంతోషం కలుగుతుంది. బరువు దిగిపోయినట్టు ఉంటుంది. అది దారినపోయేవాళ్ళ కళ్ళకి అసహ్యంగా కనిపించే లోపల మున్సిపా లిటీవాళ్ళు తీసుకెళ్లిపోతే బావుండునని కూడా అనుకుంటాం!

చిన్నూ వెళ్ళగానే వాడి గదిలో గంధకం వెలిగించి గాలిని శుభ్రం చేశాం. అక్కయ్య కూడా 'ఇప్పుడిక నేను పిల్లల్ని తీసుకుని మిమ్మల్ని చూసేందుకు రావచ్చు' అని ఉత్తరం రాసింది.

"ఇప్పుడు ఇబ్బంది కలిగించే చిన్నూ ఇంట్లో లేడు కనక శశికి పెళ్ళిచూపులు ఇక్కడే ఏర్పాటు చెయ్యచ్చు" అన్నాడు అన్నయ్య.

కొన్నాళ్లయిన తరవాత "నా స్నేహితుడొ కడు ఒక సంబంధం చెప్పాడు. అబ్బాయి ఇంజనీరు. తండ్రికి సొంత వ్యాపారం ఉంది. బాగా ఉన్నవాళ్ళు. ఇతనికి ఇద్దరు అక్కలు. ఇద్దరికీ పెళ్ళిళ్ళయిపోయాయి. ఒక్కడే కొడుకు" అన్నాడు అన్నయ్య.

అమ్మా, నాన్నా ఒక పక్క చాలా విచా రంగా ఉన్నట్టు కనిపిస్తారు నాకు. కానీ అవసరమైనప్పుడు అన్నీ మర్చిపోయి ఇలాంటి విషయాలలో చురుగ్గా పనిచె య్యడం చూసి నేను నిర్ఘాంతపోయేదాన్ని.



ఇద్దరూ ఈ శుభకార్యమేదో త్వరగా జరిగి పోవాలనే అన్నారు. నాన్న రిటైర్‌మెంట్ కూడా దగ్గరపడింది. గవర్నమెంటు బంగ ళాలో ఉండగానే నా పెళ్ళయిపోవాలని ఆయన కోరిక. సొంత ఇల్లు కట్టుకునేం దుకు చాలాకాలం పడుతుంది. రిటైరయితే ఈ బంగళా ఖాళీ చెయ్యాలి.

నాకు ఎంఏ చదవాలని ఉంది. నాన్నకి కూడా నన్ను చదివించాలనే ఉంది. కానీ మంచి అబ్బాయి దొరికితే పెళ్ళి చేసెయ్యా లని అమ్మ తొందర పడుతోంది. చిన్నూ విషయం బైటికి పొక్కేలోపల నా పెళ్ళి జరిగిపోవాలని అనుకుంటోందావిడ.

ఈ మంతనాలన్నీ జరిగేది డ్రాయింగ్ రూమ్‌లోనే. ఇంట్లోని చెత్తా, సమస్యలన్ని టినీ అందంగా అమర్చిన సోఫాల కిందికి తోసేస్తాం. తలుపుల్లోంచీ, కిటికీల్లోంచీ ఎవరూ తొంగి చూడకుండా, మిగతా గదులు కనిపించకుండా వాటికి మంద మైన కర్టెన్లు ఉంటాయి. నన్ను చూసేం దుకు వచ్చిన అబ్బాయి సోఫాలో తన తల్లి దండ్రులిద్దరి మధ్య కూర్చున్నాడు. నేనూ అన్నయ్యా వాళ్ళకి ఎదురుగా కూర్చున్నాం. నాన్న పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు. అమ్మ వంటింట్లో టీ, టిఫిన్ సంగతి చూస్తోంది.

నాకు వాళ్ళవైపు సూటిగా చూడడం ఇబ్బంది అనిపించింది. కానీ ఆ కుర్రాడి అమ్మానాన్నా కన్నార్పకుండా నన్నే చూస్తు న్నారు. ఆ ఇబ్బంది నించి తప్పించుకునేం




దుకు ఏదో ఒకటి మాట్లాడాలనుకున్నాను. ఇంతలో ఆవిడ "మీరెంతమంది మొత్తం? " అని అడిగింది.

నేను జవాబు చెప్పే లోపల "అయిదుగురం. శశి అందరిలోకీ ఆఖరిది. దీనికన్న పెద్దవాళ్ళిద్దరికీ పెళ్ళిళ్లయిపోయాయి. నాకు ఒక తమ్ముడున్నాడు. వాడికీ పెళ్ళయింది" అన్నాడు అన్నయ్య.

నేను అయోమయంగా అన్నయ్య వైపు చూశాను. నాన్న ఏమీ విననట్టే కిమ్మనకుండా ఉండిపోయాడు.

అంటే చిన్నూ మా అందరి దృష్టిలో ఇక బతికీ లేనట్టేనా? ఆస్పత్రికి పంపేసి ఇక వాడితో రుణం చెల్లిపోయిందనుకుంటున్నామా? జబ్బు పడడం అంత సిగ్గుపడాల్సిన విషయమా? వాడి ఆస్పత్రి గదిని శ్మశానం చేసేశారే వీళ్ళు! ఎంత సులభంగా.. ఆరుగురు.. కాదు అయిదుగురు అని చెప్పేశాడు అన్నయ్య!

అన్నయ్య ఇదంతా నా మంచికోసమే చేస్తున్నాడని నాకు తెలుసు. కుటుంబంలో ఏవైనా లోటుపాట్లున్నాయని తెలిస్తే ఈ సంబంధం తప్పిపోవచ్చు. 'తమ్ముడికి పిచ్చి అట, అమ్మాయిలో కూడా ఆ లక్షణాలు తరువాత బైట పడితే? ' అనుకోవచ్చు ఎవరైనా. ఇవన్నీ తెలిసే అన్నయ్య చాలా నిర్దయగా మాట్లాడాడని అనిపించింది. ఇక నా పిరికితనం కూడా తక్కువేమీ కాదు. ధైర్యంగా నిజం చెప్పలేకపోవడం నా స్వార్థం కాదా?

ఎంత క్రూరంగా ప్రవర్తిస్తాం మనం.. సమాజం ఎంత నిర్దయగా ఉంటుంది! అన్నీ సవ్యంగా జరగడం కోసం రక్తసంబంధాలని కూడా కాదనుకునే స్థితి! చిన్నూ పరిస్థితి తెలిస్తే సోఫాలో మాముందు కూర్చున్నవాళ్ళు వరసగా బాణాలని సంధిస్తారని తెలుసు. వాటిని తట్టుకోలేమనీ తెలుసు. అయినా ఒకసారి పెచ్చుకట్టిన గాయాన్ని మళ్ళీ రేపితే అది మరింత బాధ పెడుతుంది. మళ్ళీ మానడం కూడా సాధ్యం కాకపోవచ్చు. ఒక అబద్ధాన్ని కప్పిపుచ్చేందుకు ఇంకా ఎన్ని అబద్ధాలు ఆడాల్సివస్తుందో!

ఏది ఏమైనా ఆ సంబంధం కుదరలేదు. కానీ చిన్నూ అనేవాడు లేనట్టు ఆ రోజు ప్రవర్తించాను. అది ఇప్పటికీ బాధ పెడుతూనే ఉంది. అందుకేనేమో అంశూ విషయంలో చాలా అప్రమత్తంగా ఉంటున్నాను. ఎలా ఉన్నా వాడిని నేను నా ప్రాణంలాగ చూసుకోడమే కాదు, మిగతా వాళ్ళు కూడా వాణ్ణి పట్టించుకోవాలని పోట్లాడుతున్నాను. ఒకవేళ సమాజం వాణ్ణి పట్టించుకోకపోతే నేను కూడా దానికి దూరంగా ఉండటానికే నిశ్చయించుకున్నాను. అందుకే నా ప్రపంచం, అశోక్ ప్రపంచం వేరయిపోయాయి. అశోక్ ఆరోగ్యవంతులైన, డబ్బున్నవాళ్ళతో తిరుగుతాడు. ప్రతి రాత్రీ ఫైవ్‌స్టార్ హోటళ్ళలో సరదాగా గడుపుతాడు. నల్లడబ్బు సంపాదిస్తాడు. ఇష్టం వచ్చినట్టు ఖర్చుపెడతాడు. జీవితంలోని వాస్తవాలకి చాలా దూరంగా, కళ్ళు మిరుమిట్లు గొలిపే పంచరంగుల ప్రపంచంలో, తాగుడు మత్తులో నిండా మునిగిపోయి ఉంటాడు.

నా చుట్టూ అంశూలాంటి పిల్లల తల్లులుంటారు. అంశూ ఆ పిల్లలతోనే ఆడుకుంటాడు. నవ్వినా, ఏడ్చినా, కేరింతలు కొట్టినా వాళ్ళతోనే. ఆ పిల్లల్ని కూడ సమాజం తిరస్కరించింది. కానీ మేమందరం కలిసి మాకంటూ ఒక సమాజాన్ని నిర్మించుకున్నాం. అందులో ఎవరూ ఎవరిని చూసీ న్యూనతా భావంతో బాధపడక్కర్లేదు. అసహాయులమని అనుకోనక్కర్లేదు. ఈ ప్రపంచమంతా తమకోసమే ఉందన్నట్టు అంత హాయిగా ఆడుకుంటారా పిల్లలు. పాపం ఆ అమాయకులకి తాము పోగొట్టుకున్నదేమిటో తెలీదు. అయినా అదేమీ పట్టనట్టు ఎంతో ఆనందంగా ఆడుకుంటారు.

చిన్నూకి కూడా ఇలాంటి అనుభూతి కలిగించగలిగి ఉంటే ఎంత బావుండేది! వాడి ప్రపంచాన్ని మేం అర్థం చేసుకోలేదు, బాగు చేసేందుకూ ప్రయత్నించలేదు. మనసుల్లో ఎంత సానుభూతి ఉన్నప్పటికీ అన్నీ తప్పులే చేశాం. అసలు ఏ తప్పులు

చేశామో కూడా అప్పుడు తెలీలేదు. 'వాడు మా ప్రపంచంలో ఇమడడు' అని తెలిశాక ఇక వాణ్ణి పట్టించుకోడం మానేశాం. సముద్రంలో తన సంపదంతా మునిగిపోతూంటే చూస్తూ కూర్చున్న మనిషిలా, అంతా ఖర్మ అనుకుని నీరసంగా ఒడ్డున కూలబడే మనిషిలా, అన్నీ అంతే అనుకుని ఊరకుండిపోయాం.

కానీ అలా చెయ్యడంవల్ల విముక్తి లభించకపోగా అదొక పెద్ద గుదిబండగా మారి మనసుని నలిపేసింది. అపరిచితమైన ఒక ప్రపంచం తాలూకు అర్థంకాని బరువు అది. నిస్సహాయతవల్ల కలిగిన అసమర్థత అది.

ఆదివారం వస్తే చాలు, అమ్మానాన్న స్కూటరెక్కి చిన్నూని చూసేందుకు ఆస్పత్రికి వెళ్ళేవాళ్ళు. అమ్మ వాడికోసం ఎప్పట్లాగే ఏవేవో తినడానికి చేసి పట్టుకెళ్ళి స్వయంగా తినిపించేది. ఇంటికొచ్చాక పైవారం వాడికోసం ఏం చేసి తీసుకెళ్ళాలనే ఆలోచనతోనే వారమంతా గడిపేది.

అమ్మకి ఒకపక్క నాన్నని చూసుకునే బాధ్యత కూడా ఉంది. గుండెపోటుకి గురయ్యాక ఆయనకి కూడా ఆహారం విషయంలో జాగ్రత్తలు పాటించమని డాక్టర్ చెప్పాడు. నాన్న అంత దూరం స్కూటర్ నడుపుకుని వెళ్ళడం చూసి నాకు గాభరా వేసేది. ఆ వయసులో అంత ఆందోళనా, తిరగడం మంచిది కాదేమో అనుకునే దాన్ని. చిన్నూ గురించి ఆందోళన, రిటైరయ్యే లోపల ఇల్లు కట్టుకోవాలన్న ఆరాటం, అమ్మకి నా పెళ్ళి గురించి తొందర.. ఇన్ని సమస్యలని ఎలా తట్టుకోగలరు!

మళ్ళీ ఒకసారి అదే ప్రహసనం.. మరో అబ్బాయి నన్ను చూసేందుకు తల్లిదండ్రులతో వచ్చాడు. వాళ్ళకి కూడా నా తరవాత చిన్నూ ఉన్నట్టు చెప్పలేదు. చీముతో నిండిన కురుపుని బట్టతో మూసినట్టు ఆ నిజాన్ని కప్పిపుచ్చాం. ఈసారి సంబంధం కుదిరిపోయింది. నా పెళ్ళికి ఏర్పాటు చెయ్యడమనే ఒక కొత్త పని.. అమ్మా, నాన్నకి ఉన్న బరువు బాధ్యతలకి తోడయింది!




**నా**న్నకి సొంతిల్లు కట్టుకోవాలన్న తొందర ఎక్కువైంది. రిటైరయ్యాక ఆరునెలలు ఇక్కడే ప్రభుత్వం ఇచ్చిన క్వార్టర్‌లో ఉండచ్చు. ఆ తరవాత ఖాళీ చెయ్యాల్సిందే.

"సొంతిల్లు కట్టించుకుందామని ఎప్పట్నించో పోరుతూనే ఉన్నా, వినిపించుకుంటేగా? ఇప్పుడెలా? ఢిల్లీలో ఇళ్ళ అద్దెలు ఎలా ఉన్నాయో తెలుసుగా?" అంటూ అమ్మ నాన్నని సాధించడం మొదలెట్టింది.

'ప్రయత్నిస్తూనే ఉన్నా. నీకు ఏదీ ఒక పట్టాన నచ్చదాయె!' అని నాన్న ఎప్పుడూ అదే జవాబు చెపుతాడు.

చాలారోజుల క్రితమే ఆయన ఒక ప్లాట్ కోసం అప్లై చేస్తే అది ఇన్నాళ్ళకి దొరికింది. కానీ ఆ స్థలం ఇంకా ఎవరూ బాగు చెయ్యలేదు. ముళ్ళపొదలూ, అడ్డదిడ్డంగా పెరిగిపోయిన పిచ్చిమొక్కలతో నిండిపోయి ఉంది. నీళ్ళు కూడా లేవు. అందుకే స్థలాలు ఇంకా ఇవ్వడం లేదు. పాతబస్తీ

రద్దీగా ఉంటుందనీ, ఇరుగు పొరుగు బావుండదనీ నాన్నకి ఇష్టం లేదు. మొదట్నించీ ఆయనకి విశాలమైన చోట ఉండడమే ఇష్టం.

ఒకసారి ప్లాట్ దొరగ్గానే రాక్షసుడిలా పని చెయ్యడం మొదలెట్టాడు నాన్న. రోజూ తెల్లవారగట్లే వెళ్ళి రాత్రి పొద్దుపోయాక వచ్చేవాడు. సిమెంటూ, ఇటుకలూ, కూలీలూ, ఆర్కిటెక్ట్, తలుపులూ, కిటికీలూ, దూలాలూ, నీళ్ళూ.. అంటూ అన్నీ స్వయంగా చూసుకునేవాడు. ఆయన అంత హడావిడి ఎందుకు పడుతున్నాడో నాకు అర్థమయ్యేది కాదు.

"ఎందుకు నాన్నా అంత అవస్థ పడతావు? ఇల్లు నెమ్మదిగా పూర్తవుతుంది, తొందరేమిటి? కొన్నాళ్ళు అద్దె ఇంట్లో ఉంటే సరిపోతుంది కదా? " అనేదాన్ని.

"లేదు లేదు. మళ్ళీ మళ్ళీ ఇల్లు మారతామా ఎక్కడన్నా? సొంత ఇల్లు తయారైపోతోంది. పైగా చిన్నూని ఆస్పత్రి నించి అద్దెయింటికి ఎలా తెస్తాం? నీ పెళ్ళి కూడా కొత్తింట్లోనే చెయ్యాలనుకుంటున్నాను. ఎంతైనా సొంతిల్లు సొంతిల్లే!" అనేవాడు నాన్న. నాకెందుకో నాన్నని లోపల్లోపల ఏదో బాధ తినేస్తోందని అనిపించేది. ఎప్పుడూ దిగులుగా ఉండేవాడు. హడావిడీ, తొందరా ఎక్కువయ్యాయి. రేపనేది లేనట్లు అన్నీ వెంటనే పూర్తయిపోవాలని ఆందోళనలో ఉండేవాడు.

ఒకరోజు నేను కూడా ఆయన వెంట ఇల్లు కడుతున్న చోటికి వెళ్ళాను. ఎండలో కూర్చుని కూర్చుని నాకు తలనొప్పి వచ్చింది. పొద్దున్న పదిగంటలకి రావలసిన కూలీలు మధ్యాహ్నం ఒంటిగంటన్నరకి వచ్చారు. సిమెంట్ అయిపోయిందని పని మధ్యలో ఆపేయవలసి వచ్చింది. నాన్న అక్కడ ఉన్నా లేకపోయినా పని వేగంలో మార్పేమీ రాదని నాకనిపించింది. ఆయనతో ఆ మాటే అన్నాను కూడా.

"నువ్వే చూశావుగా, నేను సిమెంట్‌కి ఏర్పాటు చెయ్యకపోతే రేపటివరకూ పని ఆగిపోయేదే, అవునా? "

ఇంటిప్లాన్‌లో నాన్న చిన్నూకోసం విడిగా ఒక గదీ, స్నానాల గదీ కట్టించేందుకు ఏర్పాటు చేయించాడు. 'నేను ఉన్నా లేకపోయినా వాడికి విడిగా తనకంటూ ఒక చోటంటూ ఉంటుంది' అనేవాడు. అన్నయ్యకి కూడా ఆయన అదే చెప్పాడు "చిన్నూ బాధ్యత నాదే. వాడి బరువు నీమీదా, నీ తమ్ముడి మీదా వెయ్యను. కానీ ఈ ఇంట్లో చిన్నూకి కూడా హక్కుంది. ఇంటి వెనకభాగం వాడికి ఇచ్చెయ్యండి. వాడు అక్కడే ఉంటాడు"

అంటే ఆయనకి చిన్నూ బాగయిపోతాడన్న ఆశ ఉందనే కదా? ఆ ఆశ మా అందరికీ ఉంది. కోలుకోగానే ఇంటికి రాక ఏం చేస్తాడు?

ఇల్లు ఒక పక్క తయారవుతూంటే నాన్న మరో పక్క క్షీణించిపోసాగాడు. కానీ ఆయన మొహం మాత్రం సంతోషంతో వెలిగిపోతోంది. ఉత్సాహంతో ఎప్పుడూ ఇంటి గురించే మాట్లాడేవాడు. ఒకసారి ఇంటికప్పు వేసేశారని చెప్తే, మరోసారి చిన్నూ పోర్షన్ కూడా అయిపోవచ్చిందనీ ఆయాసపడుతూ చెప్పేవాడు. ఇంట్లో ఇంకొంత పైపని మిగిలి ఉందనగా మాకు ప్రభుత్వ బంగళా ఖాళీ చెయ్యమని ఆర్డర్లు వచ్చాయి. తిన్నగా సొంత ఇంటికి వెళ్దామని, చిన్నచిన్న పనులు అక్కడ ఉంటూ కూడా చేయించుకోవచ్చని నాన్న అన్నాడు. కొత్తింట్లోకి వెళ్ళేప్పుడు ఎక్కువ పాత సామాను తీసుకెళ్ళకూడదని, కొత్తవి కొందామని అన్నాడు. కాని అమ్మ చిన్నూ సామాను దాదాపు మొత్తం ప్యాక్ చేయించింది.

కొత్తింటికి మారాం. అమ్మకి ఇంటి ప్లాను అంతగా నచ్చలేదు. రోజూ ఏదో ఒక విషయానికి విసుక్కునేది. 'ఈ కొళాయి ఇక్కడెందుకు పెట్టారు? గది గుమ్మం ఇటు కాదు, అటు ఉండాల్సింది..' అని ఇలాగే ఏదో ఒకటి!

పనులు ఇంకా అవుతూండడం వల్ల రోజంతా చప్పుళ్ళు, మధ్యాన్నం కూడా విశ్రాంతి దొరికేది కాదు. కొన్నాళ్ళకి అది భరించడం కష్టమైపోయింది. 'ఇల్లు ఎప్పటికీ పూర్తవదా?' అన్న విసుగు వచ్చింది. నాన్నకి రాత్రిళ్ళు కూడా సరిగా నిద్ర పట్టేది కాదు. అర్ధరాత్రి నీళ్ళు తాగడానికి లేచేవాడు. ఆ అలికిడికి నాకు మెలకువ వచ్చేది.

"నాకు నిద్ర రావడం లేదు. నువ్వు పడుకో అమ్మా!" అనేవాడు.

పొద్దున్న ఆయన మొహం అలసినట్టు వాడిపోయి ఉండేది.

"ఇల్లు తయారైపోయిందిగా, ఇంక దేన్ని గురించి నీకు బాధ?" అనేదాన్ని.

"తెలీదే. గుండె దడదడలాడుతున్నట్టు ఉంటోంది. ఇంకా ఎన్నాళ్ళు బతుకుతానో.. పనులన్నీ అలాగే ఉన్నాయి. డబ్బంతా ఇంటిమీద పెట్టేశాను. ముందు ముందు ఇంటి అవసరాలు ఎలా తీరతాయో? ఇల్లు కట్టిన ఆనందం కూడా కరువైంది. అమ్మకి ఇల్లు నచ్చలేదు. చిన్నూ ఎప్పటికి కోలుకుంటాడో ఏమిటో... నా తరవాత వాడి పరిస్థితి ఎలా ఉంటుందో?"

"ఏమవుతుంది నాన్నా? మందులిస్తున్నారుగా.. ఇక డబ్బు సంగతంటావా? నేను ఉద్యోగం చేసి సంపాదిస్తాను"

"వద్దమ్మా! నువ్వు ఉద్యోగం చెయ్యడమేమిటి? వచ్చే నెలే నీ పెళ్ళి జరగబోతోంది. ఏదో ఒకటి చూస్తాలే. అంతగా అయితే నేనే ఏదో ఒక ఉద్యోగం వెతుక్కుంటా"

★ ★ ★

నాన్న ఇల్లు కట్టేప్పుడే ఇంటి ముందు ఆవరణలో మామిడి, నేరేడు, పూల మొక్కలూ పాతించాడు. అప్పట్లోనే అంటే నాన్నకి క్వార్టర్ వచ్చిన వెంటనే, ఆ గవర్న మెంట్ బంగళాలో నాన్న మొక్కలు నాటించడం చూసి "మనం ఇక్కడ ఉండబోవడం లేదుగా, ఇక్కడెందుకు?" అని అమాయకంగా అడిగాను నాన్నను.

ఆయన చిన్నగా నవ్వి "ఇక్కడ ఎవరో నాటిన మొక్కలు పెద్దవై మనకి ఇప్పుడు పళ్ళు ఇస్తున్నాయి కదా? అలాగే మనం నాటినవి ఇంకెవరికో పనికొస్తాయి" అన్నారు. డాబా మీద నిలబడి ఆ మొక్కల్ని చూస్తూ 'ఇవి పెద్దవయేసరికి నేను ఈ ఇంట్లో ఉంటానో లేదో' అనుకున్నాను. అందుకేనేమో జీవితం అంటే ఎప్పుడూ ముందుకి పోవడమే అంటారు! ముందు ఒక ఇల్లు, తరవాత మరో ఇల్లు, అలా సాగుతూనే ఉంటుంది జీవితం. ఇంతలో నాన్న గొంతు విని ఉలిక్కిపడ్డాను. "నేను ఊరికే ఉన్నాను. నిన్ను కాలేజీలో దింపనా?"

మా కొత్తింటికి దగ్గర్లో బస్సులూ, ఆటోలూ తక్కువ. ఇంకా బాగా ఇళ్ళూ, బజారూ రాలేదు. అందుకే నాన్న తరచు నన్ను బస్‌స్టాప్ దాకా దింపేవాడు.

"కాలేజీ దాకా ఎందుకు నాన్నా? బస్‌స్టాప్ దాకా దింపు, చాలు" అన్నాను.

కానీ ఎందుకో ఆయన వినిపించుకోకుండా కాలేజీ దాకా దింపాడు.

కాలేజి గేటు దగ్గర దిగి ఆయనకేసి చూసి హడలిపోయాను. ఇందాక లేదు, హఠాత్తుగా నాన్న మొహం పూర్తిగా పాలిపోయివుంది. కళ్ళకింద నీడలు చిక్కబడ్డాయి.

"ఏమైంది నాన్నా? ఉన్నట్టుండి ఇంత డీలా పడిపోయావేమిటి?" అన్నాను కంగారుపడుతూ.

"ఏం లేదమ్మా.. రాత్రి సరిగా నిద్రలేదు కదా, అందుకే" అన్నాడు.

ఆయన గొంతు బావిలోంచి వచ్చిన ట్టుంది.

"ముందే తెలిస్తే నిన్ను ఇంతదూరం రానిచ్చేదాన్ని కాదు కదా? సరే, ఇంటికెళ్ళి విశ్రాంతి తీసుకో నాన్నా"

"ఇక పనేం లేదు. ఎలక్ట్రికల్ ఫిటింగ్స్ నిన్నే తెచ్చేశాను"

"చిన్నూని చూసేందుకు కూడా ఇవాళ వెళ్ళాలిగా? "

"అవును. ఒకవేళ వెళ్ళినా మధ్యాన్నం వెళ్తాలే. నువ్వేం బెంగ పెట్టుకోకు"

నాన్న అలా అనేసరికి నేను లోపలికి వెళ్ళి స్నేహితురాళ్ళతో ఎప్పుడో వేసుకున్న పిక్నిక్ ప్రోగ్రాంకి వెళ్ళే హడావిడిలో పడి పోయాను. కుతుబ్‌మీనార్‌కి మమ్మల్ని తీసుకెళ్ళే బస్సు ముందే సిద్ధంగా ఉంది. అప్పటికే చాలామంది అమ్మాయిలు బస్సెక్కి కూర్చున్నారు.

రంగురంగుల బట్టలు వేసుకున్న ఆ అమ్మాయిల్ని చూస్తే బస్సు కాదు, అది పూలతేరులా అనిపించింది. గలగలా మాట్లాడేసుకుంటున్నారు అందరూ. పిక్నిక్ అంటే ఉత్సాహమే మరి! నేను నా స్నేహి తురాళ్ళ పక్కన చోటు చూసుకుని కూర్చు న్నాను. కుతుబ్‌మీనార్ చేరుకునేదాకా పాటలతో, నవ్వులతో, కబుర్లతో బస్సు మారుమోగిపోయింది. అదే ఉత్సాహంతో కుతుబ్‌మీనార్ దగ్గర దిగాం. నేను సమ స్యలన్నిటినీ కాసేపు మర్చిపోయాను. కానీ ఆ పిక్నిక్ ముగిసిపోయే లోపల నా మన సులో విచిత్రమైన భావాలు రేగాయి. జీవితం, మృత్యువు.. ఆ రెంటి గురించీ రకరకాల ఆలోచనలు నన్ను చుట్టుము ట్టాయి. వసంత రుతువులో మాత్రమే పూసి రాలిపోయే పువ్వులు.. చరిత్రలో జీవించి మట్టిలో కలిసిపోయే శిథిలాలు... కింద పాదాలని స్పృశించే మెత్తని పచ్చిక.. పైన అందనంత దూరంలో నీలాకాశం! పచ్చదనం జీవితానికి, ఆనందానికి ప్రతీ కైతే, నీలవర్ణం మరణానికి, విషాదానికీ ప్రతీక. సృష్టికర్త రెంటినీ విడదీయలేని విధంగా కలిపేశాడు! స్నేహితురాళ్ళు నాక్కాబోయే భర్త గురించి మాట్లాడి నన్ను ఆటపట్టించసాగారు. నేను పెద్దవా ళ్ళెవరూ లేకుండా అతన్ని కలుసుకోడం గురించి మాట్లాడితే వాళ్ళకి చక్కిలిగింతలు పెట్టినట్టు ఉండేది. నాకు కూడా అతని గురించి మాట్లాడాలని ఉండేది. అందుకే ఉన్నవీ లేనివీ కల్పించి మరీ చెప్పేదాన్ని. ఇంకా పెళ్ళికాని, పెళ్ళి కుదరని నా స్నేహి తురాళ్లకి నేను కల్పించి చెప్పే అనుభ వాల్లో ఎంతో ఆనందం దొరికేది.

అయినా నా పరిస్థితి వింతగా తోచింది. ఒకపక్క మనసులో తియ్యని ఊహలు లేచేవి. మరుక్షణం ఎందుకో చెప్పలేనంత దిగులు కమ్మేసేది. చిన్నూ, అమ్మా, నాన్నా గుర్తొచ్చి వెంటనే ఇంటికి వెళ్ళాలనీ, వాళ్ళకి నా అవసరం ఉందనీ అనిపించేది.

అయినా అక్కడి శిథిలాల్లో తిరుగుతూ, ఆడుతూ, పాడుతూ పిక్నిక్ అయిందని పించాం. ఉన్నట్టుండి నేను ఒక చీకటి గుహలోకి పడిపోతున్నట్టు అనిపించింది. సామాన్యంగా అంత సంతోషంగా స్నేహి తురాళ్లతో గడిపి అది ముగిసిపోయే సమ యానికి అలా అనిపిస్తుంది. కానీ ఈసారి ఏదో తేడా ఉందనిపించింది. నాకు ఎందు కలా అవుతోందో అర్థం కాలేదు. లోపల్లో పల కుంగిపోతున్నట్టు, ఎక్కడో పెద్ద ప్రమాదం జరిగినట్టు!

కాలేజి బస్సు ఒకచోట దింపింది. ఇల్లు చేరుకునేందుకు కాస్త దూరం నడవాలి. మలుపు తిరిగేసరికి ఇంటి బైట మా పిన్ని కొడుకు కనిపించాడు. 'వీడెందుకొచ్చాడు? ' అని ఆశ్చర్యపోతూ దూరంనించే "ఎప్పుడొ చ్చావు రా? ఇవాళ వస్తావని నాకు తెలీ లేదే? " అని అరిచాను.

వాడు జవాబు చెప్పలేదు.

దగ్గరికెళ్ళాక మళ్ళీ అడిగాను. "లోపలికి పద, చెపుతాను" అంటూ నా భుజం చుట్టూ చెయ్యివేసి లోపలకి నడిచాడు.

డ్రాయింగ్ రూమ్ తలుపులు బార్లా తెరచి ఉన్నాయి. గుమ్మం దగ్గరకి చేరు కుంటూండగా వాడు నా చెవిలో రహస్యం చెపుతున్నట్టు "పెద్దనాన్న పోయారు" అన్నాడు.

వరండాకున్న ఒకేఒక మెట్టు ఎక్కగానే తెల్లదుప్పటి కప్పిన నాన్న శవం కనిపిం చింది. ఇంటికొచ్చాక ఆయనకి ఎన్నో విష యాలు చెప్పాలనుకున్నాను. దోవ పొడు గునా ఆయన గురించే ఆలోచిస్తూ వచ్చాను. ఇప్పుడిక ఆయన నా మాటలు వినలేడు. ఇలాంటిది అసలు జరిగిందని నమ్మలేక పోతున్నాను. లోపలంతా ఎవరో చీల్చేస్తున్నట్టు బాధ. పెద్దగా అరిచాను, ఏడ్చాను. అవన్నీ వాస్తవాన్ని ఇంకా పదు నుగా, లోతుగా నా మనసులో దిగేస్తు న్నాయి. చుట్టూ ఉన్నవాళ్ల మాటలూ నా చెవులకి వినబడుతున్నాయి. ఉన్నట్టుండి నాన్నకి గుండెపోటు మళ్ళీ వచ్చిందట. ఇంట్లో ఎవరూ లేరు. అమ్మ ఒక కూలీచేత టాక్సీ పిలిపించింది. తలుపుతాళం వేసేలో పల స్పృహ కోల్పోయారు. కూలీలే సాయం పట్టి టాక్సీలో పడుకోబెట్టారు.. కానీ ఆస్పత్రికి చేరుకునే లోపలే గుండె ఆగిపోయింది.

పిన్నీ, మామయ్యా, మేనత్తా.. ఇంకా చాలామంది తెలిసిన మొహాలు కనిపిం చాయి. కానీ ఒక్కమొహం కూడా నాకు ఓదార్పు ఇవ్వలేకపోయింది. దుఃఖంలో ఉన్నప్పుడు చుట్టూ ఎంతమంది ఉన్నా ఎంత ఒంటరితనం అనిపిస్తుందో! నేను పోగొట్టుకున్నది వీళ్ళెవరూ పోగొట్టుకోలేద నిపించింది.

ఇద్దరు అన్నయ్యలూ విమానంలో వచ్చినా పొద్దున్న లోపల రాలేరు. నాన్న శవాన్ని ఐసుదిమ్మెల మీద పెట్టారు.

"చిన్నూని ఎవరైనా ఆస్పత్రినించి తీసు కొస్తారా? " అని అడిగింది పిన్ని.

"ఏం జరిగిందో వాడికేం తెలీదు కదా? " అన్నారెవరో.

"ఎంతైనా కొడుకు కదా? ఆఖరిసారి, ఆఖరిసారి తండ్రి మొహం చూడద్దా? " అంది పిన్ని.

"పొద్దున్నే వెళ్లి తీసుకొస్తాలే" అన్నాడు మామయ్య.

అమ్మ ఒక మూల జీవం లేనట్టు పడు కుంది. ఆవిడకి చుట్టూ జరుగుతున్నదేమీ పట్టలేదు. ఆవిడ శోకాలు పెట్టలేదు. ఆవిడ దుఃఖం నాకన్నా కూడా పెద్దది. నాకు ఒక భవిష్యత్తంటూ ఉంది. అమ్మకి ఏముంది? ఆవిడ కూడా నాలాగే తన దుఃఖాన్ని పంచుకోలేకపోతోందా? ఏకా కిలా, డీలా పడిపోయి మౌనంగా పడు కుంది. ప్రతివాళ్ళకీ కష్టాన్ని భరించేందుకు తమకంటూ ఒక పద్ధతి ఉంటుంది... ఇంకొకళ్ళతో చెప్పుకోడం వల్ల పెద్ద తేడా ఏమీ ఉండదు. అయినా ఆదుకోడానికి ఎవరైనా ఉండాలి. అది ముఖ్యం.

రాత్రంతా నేనక్కడే కూర్చుండిపో యాను. పిన్నీ, మామయ్యా చాలాసార్లు వచ్చి పడుకోమని అన్నారు. కానీ నాకు అక్కణ్ణించి లేవాలనిపించలేదు. నాన్నని వీలైనంత సేపు అలా చూస్తూనే ఉండాల నిపించింది. ఆ రాత్రి చూసినంత శ్రద్ధగా నాన్న మొహం నేనింతవరకూ బహుశా చూడనేలేదనుకుంటా! మరీ దగ్గరవాళ్ళని వాళ్ళు ఉన్నంతకాలం పట్టించుకోం. వాళ్లని కోల్పోయాక ఏదో తెలీని పశ్చాత్తాపంతో వీలైనన్ని విషయాలని గుర్తుంచుకోవాలనీ, వదలకుండా పట్టుకునుండాలనీ అనిపి స్తుంది. సామాన్యంగా కూతుళ్ళు తండ్రి మొహంలోకి తదేకంగా చూడరు. నా విష

యంలో అలాంటి సందర్భాలు కూడా తక్కువే వచ్చాయి. కానీ ఇవాళ ఆయన ఏమీ తెలీని స్థితిలో అలా పడుకుని ఉంటే నా కళ్ళు ఆయన మొహం మీంచి కదలడం లేదు. శాంతంగా, నిద్రపోతున్నట్టున్న ఆ మొహాన్ని చూస్తూనే ఉండాలనిపించింది.

తెలవారబోతుండగా ఎవరో నన్ను పట్టుకుని తీసుకెళ్ళి మంచంమీద పడుకోబెట్టారు. అప్పటికి నా శరీరంలోని శక్తి నంతా ఎవరో పీల్చేసినట్టు అనిపించింది. అలసటతో నిద్రలోకి జారిపోయాను. మేలుకున్నాక ఇంట్లో కొద్దిగా హడావుడి వినపడింది. అక్కయ్యలు, పిల్లలూ వచ్చారు. అన్నయ్యలు కూడా వచ్చారు. ఏడుపులూ, మాటలూ వినిపిస్తున్నాయి. కానీ నేను అలా పడుకునే ఉండిపోయాను. కొంతసేపయాక డ్రాయింగ్ రూమ్‌లోకెళ్ళి చూస్తే మగవాళ్ళు నాన్న శవానికి స్నానం చేయించడానికి ఏర్పాటు చేస్తూ కనిపించారు. అక్కయ్య, అన్నయ్యలనీ నేను ఒకసారి కావిలించుకుని లాన్‌లోకి వెళ్ళిపోయాను. నాన్నకి స్నానం చేయించే సమయంలో లోపల ఆడవాళ్ళెవరూ ఉండకూడదు. అందరూ లాన్‌లోనే కూర్చున్నారు. బంధువులు కూడా వచ్చేశారు. నేను కొందర్ని ఎప్పుడూ చూడలేదు, కొందర్ని చాలా ఏళ్ళక్రితం చూశాను. నాన్నని కడసారి చూసేందుకు ఎందరొచ్చారో! బహుశా మళ్ళీ వీళ్ళు నాకు జన్మలో కనిపించకపోవచ్చు. అందరూ నాన్న కోసమే వచ్చారు.

ఇంతలో మామయ్య కారులోంచి దిగాడు. ఆయన వెనకాలే, ఆయన్ని పట్టుకుని చిన్నూ దిగాడు. వాడు పరధ్యానంగా ఉన్నాడనిపించింది. వాడి దృష్టి లాన్‌లో ఉన్న మనుషులమీద పడింది. ఎవరినీ గుర్తుపట్టలేదు. మొదటిసారి కొత్తింటికి వచ్చాడు. ఇంటిని కూడా కొత్తగా చూశాడు. బహుశా వాడికి అక్కయ్యలూ, అన్నయ్యలూ కూడా గుర్తున్నట్టు లేరు. చివరికి నన్ను కూడా గుర్తుపట్టకపోయేసరికి నా మనసుకి చాలా కష్టం వేసింది. వాడి బుర్రలో ఏం జరుగుతుందో నాకు తెలీడంలేదు. మా ఇద్దరిమధ్యా ఎంత ప్రేమా ఆప్యాయతా ఉండేవి! అది కూడా జ్ఞాపకం లేదా? బహుశా మనుషులమధ్య సంబంధాలు చైతన్యం ఉన్నంతవరకేనేమో! ప్రాణం లేకుండా పడివున్న నాన్నకీ, మనసూ, మెదడూ దెబ్బతిన్న చిన్నూకీ నాతో వాళ్ళకున్న సంబంధం గురించి ఎలా తెలుస్తుంది? నేను ఇంతవరకూ ఎంతో ముఖ్యమని అనుకుంటున్న మమకారాలు ఒక్క దెబ్బతో తెగిపోయినట్టేనా?

అలా అనుకునేసరికి ఆవేశం ఉబికి వచ్చింది. గబగబా చిన్నూవైపు వెళ్ళాను. వాడి భుజాలు పట్టుకుని "నాన్న మనని వదిలి వెళ్ళిపోయాడు రా చిన్నూ!" అని గట్టిగా ఏడ్చేశాను.

రెండుమూడు క్షణాలు శూన్యంగా నావైపు చూసి చిన్నూ "ఏమైంది.. నాన్నకి ఏమైంది? ఎక్కడున్నాడు? " అన్నాడు.

"నాన్న ఇక లేడు" అన్నాను.

నాకు ఏడుపు ఆగడంలేదు. నేను ఏడవడం చూసో లేక ఇంకే కారణంగానో తెలీదు, వాడి మొహం కలతబారింది. కొన్ని గంటలపాటు వాడి మొహంలో అదే దిగులు కనిపించింది. వాడు ఎవరితోనూ మాట్లాడలేదు. మౌనంగా అందర్నీ చూస్తూ ఉండిపోయాడు.

మామయ్య వాణ్ణి నాన్న శవం దగ్గరకి తీసుకెళ్ళి "నాన్న కాళ్ళకి దణ్ణం పెట్టు" అన్నాడు. వాడు అలాగే అయోమయంగా, దిగులుగా నాన్న శవాన్ని కొంచెంసేపు చూశాడు. తరవాత ఆయన పక్కన కూర్చుని కళ్ళార్పకుండా ఆయన్నే చూడసా

గాడు. తరవాత హఠాత్తుగా "ఏమైంది నాన్నకి? ఎందుకిలా పడుకున్నాడు? " అని మామయ్యా వైపు చూసి అడిగాడు.

మామయ్యా జవాబు చెప్పకపోయేసరికి అక్కడున్న మిగతావాళ్ళని అదే ప్రశ్న వేశాడు. పరిస్థితి చాలా ఇబ్బందికరంగా తయారైంది. అంత దుఃఖంలోనూ కొందరి మొహాలలో ఎగతాళి కనిపించింది. మామయ్యకీ, అన్నయ్యలకీ సిగ్గనిపించింది. మరుక్షణం వాళ్ళు చిన్నూని అక్కణ్ణించి లేవదీసి నాన్న వాడికోసం కట్టించిన గదిలోకి తీసుకుపోయారు. వాడు బాగా అలిసిపోయినట్టు కనిపించాడు. అక్కడ పక్కమీద పడుకోబెట్టేసరికి వెంటనే నిద్రపోయాడు. వాణ్ణి శ్మశానానికి ఎవరూ తీసుకెళ్ళలేదు.




పదమూడు రోజులవరకూ బంధువులు వచ్చిపోతూనే ఉన్నారు. చిన్నూ చాలామటుకు తన గదిలోనే ఉండేవాడు. ఎవరో ఒకరం వాడికి అక్కడికే భోజనం తీసుకెళ్ళి ఇచ్చేవాళ్ళం. ఎప్పుడైనా కొద్దిసేపు బైటికి వస్తే అందరూ వాణ్ణి బోనులోంచి తప్పించుకుని బైటికి వచ్చిన అడవి జంతువుని చూసినట్టు వింతగానూ, భయంగానూ చూసేవారు. వాడు కూడా ఒక్కొక్కళ్ళనీ అదేపనిగా కన్నార్పకుండా చూసేవాడు. వంటింట్లోకొచ్చి మాటామంతీ లేకుండా గుడ్లప్పగించి అక్కడున్న వాళ్ళకేసి చూస్తూ ఉండిపోయేవాడు. వాణ్ణి చూస్తే ఏదో చెప్పడానికి వచ్చాడనీ, కానీ ఏం చెప్పాలనుకున్నాడో మర్చిపోయాడనీ అనిపించేది నాకు. ఏం కావాలి.. మంచినీళ్ళా? అని ఎవరైనా అడిగితే, తలూపి మంచినీళ్ళు తాగి మళ్ళీ తన గదిలోకి వెళ్ళిపోయేవాడు.

అక్కయ్యా పిల్లలూ, అన్నయ్యా పిల్లలూ కుతూహలం ఆపుకోలేక వాడి గదిముందు మూగి లోపలికి తొంగి చూసేవాళ్ళు. చిన్నూ ఏం చేసినా వింతగా ఒకరికొకరు చెప్పుకునేవాళ్ళు. వాళ్ళ కళ్ళకి జూలో వింతజంతువులా, కనిపించేవాడు చిన్నూ. చిన్నూ వినిపించుకోకపోయినా, కసురుకున్నా వాళ్ళ ఉత్సాహం ఇనుమడించేది.

అక్కయ్యా పెద్దకూతురు కాస్త లోకజ్ఞానం ఉన్న పిల్ల.

"చిన్నూ మామయ్యా మాతో ఆడుకోడేం? " అని అడిగింది నన్ను.

"మామయ్యకి ఒంట్లో బాలేదు" అన్నాను.

"పోనీ, మాతో మాట్లాడచ్చు కదా? "

"..."

"సిమ్లా వచ్చినప్పుడు మాతో ఎన్ని ఆటలు ఆడాడో తెలుసా పిన్నీ? చాక్లెట్లు కూడా కొనిచ్చేవాడు. మరిప్పుడు? "

"..."

"పక్కింటి అబ్బాయి సోనూ మామయ్యకి పిచ్చి అంటున్నాడు"

"అవన్నీ అర్థంలేని మాటలు"

"వాళ్ళమ్మ కూడా అదే అంది"

"ఊరికే వాగకే" అంటూ ఆ పిల్ల నోరు మూయించాను.

'చిన్నూ కొత్తింటికి వచ్చి రెండు వారాలైనా కాలేదు, ఈ లోపల ఇరుగు పొరుగు వాళ్ళకి మా చరిత్ర మొత్తం తెలిసిపోయిందే!' అనుకున్నాను.

"మీరసలు వాణ్ణి ఎందుకలా పీడి




స్తారు? వాడి తలుపు తట్టడం, మాటిమా టికి లోపలికి తొంగి చూడడం.. ఇదే మన్నా బావుందా? " అన్నాను.

"నేనలా చెయ్యను పిన్నీ. నాకు చిన్నూ మామయ్యని చూస్తే భయం. ఎలాగో ఉంటాయి మామయ్య చూపులు!"

"పెద్దదానివి నువ్వే కదా. వాళ్ళని అలా చెయ్యొద్దని చెప్పలేవా? "

"చెప్పాను. వినిపించుకోకపోతే ఏం చెయ్యను? పిన్నీ, చిన్నూ మామయ్యకి నిజంగా పిచ్చా? "

పిల్లల అమాయకత్వం, అజ్ఞానం ఎంత బావుంటాయో.. అంతే క్రూరంగా కూడా ఉంటాయి. అరమరికలు లేకుండా మనసులో మాట సూటిగా చెప్పేస్తారు. అవతలివాళ్ళని బాధపెట్టే విషయాలని కూడా కుతూహలంతో గుచ్చి గుచ్చి అడిగేందుకు వెనకాడరు. చిన్నూ అందరిలా లేకపోవడం పిల్లలకి ఆసక్తిని రేకెత్తిస్తోంది. కోప్పడ్డంత మాత్రాన అది తగ్గిపోదు. కూతుళ్ళూ, కోడళ్ళూ తమ పిల్లలని అదుపు చెయ్యడం లేదని అమ్మ బాధపడింది. చిన్నూని అందరూ హేళన చేస్తూంటే తల్లి మనసు తల్లడిల్లదా? చిన్నూ విషయం కాస్త చూద్దామంటే ఇంటినిండా బంధువులు.. ముందు వాళ్ళ అవసరాలు చూడాలి. నాన్న పోవడం అసలే ఆవిణ్ణి శారీరకంగా, మానసికంగా కుంగదీసింది. మామూలు పనులు చేసే శక్తి ఆవిడకి లేదు. అందుకే చిన్నూ బాధ్యత ఎవరో



ఒకరికి అప్పజెప్పేది.

ఒకరోజు చిన్నూ కోసం వాడి గదిలో వడ్డించి పెట్టిన భోజనాన్ని వాడు ముట్టనే లేదు. మర్నాడు కూడా అలాగే జరిగింది. అమ్మ స్వయంగా తీసుకెళ్ళి ఇచ్చినా తిన లేదు. అమ్మ బతిమాలితే "అమ్మా! నువ్వు కూడా తినద్దు. ఆయన ఇందులో ఏదో కలిపాడు!" అన్నాడు వాడు.

"ఎవరు కలిపార్రా? ఏం కలిపారు? "

"ఆయనే"

"ఎవరు? ఏమంటున్నావు నువ్వు? "

"చెప్పాగా? ఆయన విషం కలిపాడు"

"విషమా? ఎవరు కలుపుతారు విషం? మేమందరం ఇదే భోజనం తిన్నాం కదా? మాకేమీ కాలేదే? నామాట విను, దా! కొంచెంగానైనా తిను"

ఎంతసేపు బతిమాలినా వాడు తినకపో యేసరికి అన్నయ్య గదిలోకొచ్చాడు. అమ్మ అన్నయ్యతో "వీడికి కాస్త చెప్పరా. అసలే నీరసంగా ఉన్నాడు. రెండ్రోజులుగా ఒక్క మెతుకు కూడా లోపలికెళ్ళలేదు. ఇలా అయితే ఎలా? " అంది.

అన్నయ్య వాణ్ణి కసురుకుంటూ "నీకు పిచ్చెక్కిందిరా! ఎవరైనా అన్నంలో విష మెందుకు కలుపుతార్రా? అందరూ నీవా ళ్ళేగా? రా, త్వరగా తిను. అమ్మని పీడిం చకు. అసలే కష్టాల్లో ఉన్నాం. అది చాల నట్టు నువ్వు కూడా.." అన్నయ్య చెమ్చాతో అన్నం వాడి నోట్లో కుక్కాడు.

అన్నం నోట్లో పెట్టుకుని చిన్నూ మరు

క్షణం దాన్ని ఉమ్మేశాడు. అన్నయ్య మొహం కోపంతో జేవురించింది. "తినక పోతే నీకే నష్టం, మాకేమీ కాదు. తెలుసుగా నేనేం చేస్తానో? మళ్ళీ ఆస్పత్రిలో పడేస్తాను. ఊ.. త్వరగా తినెయ్యి!" అన్నాడు.

చిన్నూ కోపంగా అసహ్యంగా అన్నయ్య కేసి చూస్తూ అమ్మతో "ఈయనే.. ఈయనే అన్నంలో విషం కలిపాడు!" అని గట్టిగా అరిచాడు.

అమ్మ మొహం భయంతో పాలిపోయింది. "ఒరే! వాడు నీ అన్నయ్యరా, అలా అనకూడదు చిన్నూ!" అందావిడ.

"ఇట్ ఈజ్ టైమ్ టు సెండ్ హిమ్ బ్యాక్ టు ద హాస్పిటల్. వీడి పరిస్థితి ఇంకా అధ్వాన్నంగా తయారైంది" అన్నాడు అన్నయ్య గదిలోంచి బైటికెళ్తూ.

చిన్నూ కోపంగా, అసహ్యంగా వెళ్ళిపోతున్న అన్నయ్యని చూస్తూ ఉండిపోయాడు. అమ్మ ఎంత సముదాయించినా "నీకు తెలీదు.. ఈయనే విషం కలిపాడు.. నువ్వు కూడా జాగ్రత్తగా ఉండు.. ఎప్పుడో నిన్ను కూడా విషం పెట్టి చంపేస్తాడు, నిజం!" అన్నాడు అమ్మతో.

అమ్మ భయం కన్నీళ్ళుగా మారింది. నేను చిన్నూ తలమీద చేత్తో నిమురుతూ వాణ్ణి శాంతింపచేసేందుకు ప్రయత్నించాను. "నిన్నెవరూ చంపరు, చిన్నూ! ఏం భయం లేదు. మేమందరం లేమూ.. ఇంకెందుకురా భయం? " అన్నాను.

అయినా ఆ పూట కూడా వాడు అన్నం తినలేదు. మేం మళ్ళీ వచ్చేపోయే జనాలతో బిజీ అయిపోయాం. వాడి విషయం వదిలేసాం.

★ ★ ★

మర్నాడు అమ్మ హోమానికి కావలసిన వస్తువులు తెమ్మని అన్నయ్యకి చెప్పింది. అన్నయ్య స్కూటర్ బైటికి తీస్తే టైరు పంక్చరయి ఉంది. ఇంటి ముందున్న వసారాలో అన్నయ్య టైరు మారుస్తున్నాడు. మేమందరం లోపల ఉన్నాం. ఇంతలో అన్నయ్య గావుకేక పెట్టాడు. నేను బైటికి పరిగెత్తాను. చిన్నూ చేతిలో కత్తి. దానికి రక్తం అంటి ఉంది. వాడు అన్నయ్యవైపు అసహ్యం నిండిన కళ్ళతో చూస్తున్నాడు. అన్నయ్య పొట్ట పట్టుకుని నేలమీద పడిపోయాడు. షర్టుమీదా, ప్యాంటుమీదా రక్తం మరకలూ.. నేలమీదకి కూడా రక్తం కారుతోంది.

"ఏం పని చేశావురా, చిన్నూ? " అంటూ భయంతో అరిచాను.

నా గొంతు వినగానే వాడు తన గదిలోకి పారిపోయాడు. పదోరోజున జరిపే తంతుకోసం ఇంటినిండా జనం వచ్చి ఉన్నారు. బాబాయి కారు గేటుబైటే ఉంది. ఆయన అన్నయ్యని వెంటనే ఆస్పత్రికి తీసుకెళ్ళాడు. ఇక నాన్న చనిపోవడం గురించి మాట్లాడడం మరిచిపోయి, జనం అన్నయ్య గురించి ఎవరికి తోచినది వాళ్ళు అనడం మొదలెట్టారు.

"పాపం ఆ మానవుడు తమ్ముడికోసం ఎంత చేశాడు. చూడండి.. వాడు చేసిన పని!"

"అసలు వాణ్ణి ఇంటికి తీసుకురావడమే తప్పు. ఆస్పత్రిలోనే పడి ఉండనివ్వా

ల్సింది!"

"ఏ జన్మలో చేసుకున్న పాపమో వీళ్ళది.. బతికుండాల్సినవాళ్ళు పోవడం, బతికున్నా లాభంలేని వాడు ఇంకా బతి కుండడం.. దేవుడు ఎందుకిలా చేస్తాడో!"

చిన్నూ తనగది తలుపులు బిడాయించు కుని కూర్చున్నాడు. వాడి గదికున్న ముందు తలుపు ఇంట్లోకి ఉంటే వెనక తలుపు గేరేజిలోకి ఉంది. వాడు ఆ తలుపు తీసుకునే అన్నయ్యని పొడిచేం దుకు వెళ్ళాడులాగుంది. అందుకే మాకెవ రికీ కనిపించలేదు. నేను ఎన్నిసార్లు తట్టినా వాడు తలుపు తెరవలేదు. వాడిచే తిలో ఇంకా కత్తి ఉంది. తనకి ఎక్కడ గాయం చేసుకుంటాడోనని చాలా భయం వేసింది నాకు. వాడి దగ్గరున్నది మాంసం కోసే కత్తి. వంటింట్లోంచే తీసి ఉండాలి.

చిన్నూని ఇంట్లో ఉంచుకున్నందుకు అమ్మతో పోట్లాడారు అక్కయ్యా, చిన్న న్నయ్యా. "వాడు అందరిలా లేడని ఎందుకు ఒప్పుకోవు? ఇంట్లో ఉంటే అంద రికీ ప్రమాదమే కదా? " అంటూ కోప్ప డ్డారు.

అమ్మ మౌనంగా అన్నీ వినేది. కానీ ఒక సారి అక్కయ్యతో అమ్మ ఇలా అనడం నా చెవిన పడింది "మీరందరూ మీ మీ సంసారాలు సుఖంగా చేసుకుంటున్నారు. వాణ్ణి నేను చూసుకోకపోతే ఎవరు చూసు కుంటారు? పైగా ఈ ఇంట్లో వాడికీ మీతో పాటు సమాన హక్కుంది" అంటూ అమ్మ ఏడ్చేసింది. నాన్నలేని కొరత మళ్ళీ పచ్చి పుండులా బాధపెట్టింది కాబోలు!

నాకు కూడా చిన్నూ మీద కోపం వచ్చేది. కానీ వాడికి బంధుత్వాలు జ్ఞాపకం వుంటే అన్నయ్యమీద దాడిచే స్తాడా? ఇప్పుడు మా ముందున్న చిన్నూ మునుపటి చిన్నూ కాదన్న చేదు నిజాన్ని ఒప్పుకోక తప్పేది కాదు నాకు. అమ్మ కూడా ఆ నిజాన్ని ఒప్పుకుంటే వాడితో అంటీముట్టనట్టు ఉండడం ఆవిడకి సాధ్య మయేది. ఎవరైనా చనిపోతే కొన్నాళ్ళకి వాళ్ళిక కనబడరన్న సత్యాన్ని జీర్ణించుకోగ లుగుతాం. కానీ చిన్నూ అలా కాదు కదా! వాడు ఎప్పటికైనా మారకపోతాడా? అన్న మాలోని ఆశ వాణ్ణి పూర్తిగా నిర్లక్ష్యం చెయ్యనివ్వదు. అందుకే మా పరిస్థితి అయోమయంగా తయారైంది.

అక్కయ్యలూ, అన్నయ్యలూ మాతో ఉండరు కాబట్టి వాళ్ళకి వాడితో తెగతెం పులు చేసుకోడం సులభమైంది. కానీ అమ్మకీ నాకూ అలా కాదు. ఒకసారి అక్కయ్య అమ్మతో వాడి గురించి నిర్ల

క్ష్యంగా మాట్లాడితే అమ్మకి చాలా బాధ వేసి "అనుభవించేవాళ్ళకే బాధ తెలుస్తుం దమ్మా. పెద్దవాడికి గాయమైంది, కానీ కోలుకుంటున్నాడు. వాడికి పెళ్ళాం పిల్లలూ ఉన్నారు చూసుకునేందుకు. అమ్మ మనసు అలా కాదు. తన పిల్లల్లో ఎవరి జీవితం పాడయిందో వాళ్ళమీదే ఎక్కువ ధ్యాస అమ్మకి ఉంటుంది!" అంది.

చిన్నూ రోజంతా తన గది తలుపులు మూసుకునే ఉండిపోయాడు. ఇంకా మాకు అన్నయ్యని చూసుకునేందుకు ఆస్పత్రికి ఇంటికీ తిరగడానికే సరిపోతోంది. చిన్నూ సంగతి అందరూ మర్చిపోయారు. అమ్మ మాత్రమే మధ్య మధ్య వాడి తలుపు తట్టి అన్నం తినమని బతిమాలుతోంది. అయినా వాడు తలుపు తెరవలేదు.

మర్నాడు చిన్నన్నయ్య ఆస్పత్రికి వెళ్తూంటే అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ "కాస్త చిన్నూ సంగతి కూడా చూడండ్రా. లేకపోతే వాడు తిండి తినకుండా అలాగే చచ్చిపోతాడు!" అంది.

చిన్నన్నయ్య వాడి గది దగ్గరికెళ్ళి బూటు కాళ్ళతో తలుపుల్ని తన్నసాగాడు. లోపల్నించి ఎటువంటి స్పందనా రాలేదు. చిన్నూకి ఏమైందో! మూడు రోజులుగా అన్నం తినలేదు వాడు. స్పృహ లేకుండా పడిపోయి ఉంటాడా? నా గొంతెండిపో యింది. అయినా బైటినించే గట్టిగా అరి చాను "చిన్నూ! ప్లీజ్ తలుపు తెరు. నిన్ను ఎవరూ ఏమీ అనరు. చూడూ, అక్క య్యని, నేను ప్రామిస్ చేస్తున్నా, నీ మీద ఎవరూ చెయ్యి వెయ్యకుండా చూసే బాధ్యత నాది. తలుపు తెరవరా!"

అన్నయ్య కాసేపు తలుపులు బాది ఆ తరవాత భుజం దన్నుపెట్టి తలుపు తొయ్యడానికి ప్రయత్నించాడు. అలా చెయ్యగా చెయ్యగా గడియ వదులై తలుపు ధడాలున తెరుచుకుంది. చిన్నూ దగ్గర ఇంకా ఆ కత్తి ఉంది. వాడు మళ్ళీ చిన్న న్నయ్యని కూడా పొడుస్తాడని భయప డ్డాను. నేను చిన్నన్నయ్య ముందుకు వెళ్ళి వణుకుతూ నిలబడ్డాను. చిన్నూ నన్ను గుర్తుపడతాడనీ, నన్ను చూస్తే ఎలాంటి అఘాయిత్యపు పనులూ చెయ్యడనీ ఇంకా నాకు పిచ్చి నమ్మకం!

చిన్నూ గదిలో ఒక మూల నక్కి కూర్చు న్నాడు. వాడి కళ్ళు తలుపువైపే చూస్తు న్నాయి. వాటిలో చావు భయం! అన్నయ్య వాడివైపు నాలుగడుగులు వేసేసరికి ఇంకా ముడుచుకుపోయాడు చిన్నూ. నేను వాడి దగ్గరికి వెళ్ళి "ఎందుకురా చిన్నూ అంత భయం? మేమేగా, ఏం భయంలేదు" అన్నాను.

"అన్నం తినరా ముందు" అన్నాడు అన్నయ్య, గొంతులో ఎలాంటి భావమూ కనిపించనీయకుండా. అమ్మ కంచం తీసు కొచ్చి వాడికి తినిపించడం మొదలెట్టింది. వాడు ఈసారి అభ్యంతర పెట్టకుండా తిన సాగాడు. తింటూ ఉంటే వాడి మొహంలో భయం పోయి తల్లి దగ్గర పాలుతాగే పసిపిల్లాడి మొహంలో కనిపించేలాంటి తృప్తి కనిపించసాగింది. ఇంతకు ముందు ఉన్న భయం ఎలా మాయమైందో తెలీదు! ఆ వెలిసిన తుపాను ఛాయలేవీ కనబడలేదు.

అయినా చిన్నూని ఆస్పత్రికి పంపించక తప్పలేదు. వాడు ఎప్పుడు ఎలా ప్రవర్తి స్తాడో తెలీకుండా పోయింది. పైగా నా పెళ్ళి కూడా దగ్గర పడింది. పెద్దన్నయ్య ఆస్పత్రిలో ఉన్నాడు. అయినా అమ్మ చిన్నూని ఆస్పత్రికి పంపేందుకు వీల్లేదని మొండికేసింది ముందు. చిన్నన్నయ్య అమ్మకి నచ్చజెపుతూ "చిన్నూని ఆస్పత్రికి పంపకపోతే శశి పెళ్ళి వ్యవహారాలన్నీ ఎలా చూసుకోగలవు చెప్పు? బంధువులు కూడా వస్తారు. అబ్బాయి తరఫువాళ్ళు

వస్తారు. అలాంటప్పుడు వీడు ఉంటే అందరికీ సమస్యే కదా? " అన్నాడు.

అన్నయ్యకి చిన్నూపై కోపమో, శత్రుత్వమో లేదు. బాధ్యతగానే మాట్లాడాడనిపించింది నాకు. కర్తవ్యానికీ ఆప్యాయతలకీ జరిగే సంఘర్షణ అది. చిన్నూ కన్నా నేను ముఖ్యమని కాదు. నా పెళ్ళి ఎటువంటి గొడవలూ లేకుండా జరిగిపోవాలన్న బాధ్యత. కానీ అన్నయ్య తీసుకున్న నిర్ణయం సరైనదేనా? ఎవరు చెప్పగలరు? కాలం చెప్పగలదా? కాలమే తప్పొప్పులు నిర్ణయిస్తుందంటారు. కానీ కాలం కూడా పరిస్థితులనే అనుసరిస్తుంది. వర్తమానంలో చేసే పనుల ఫలితాలు తెలిసేది భవిష్యత్తులోనే. అలాంటప్పుడు ఏం చెయ్యాలి? జీవితం అంటే ఇల్లాంటి నిర్ణయాల అల్లికే మరి. పడుగూ, పేకా... రెండూ కలిస్తేనే అల్లడం సాధ్యం!

అమ్మని ఒంటరిగా వదిలి వెళ్ళాలని లేదు నాకు. కానీ శుభకార్యం అనుకున్న ప్రకారం జరిగిపోవాలని అందరూ తీర్మానించారు. పెళ్ళి అనేది కూడా మృత్యువు లాగ ప్రకృతి నియమాలలో ఒకటా? నిత్య సత్యంలాంటిదా? అనుకున్న సమయానికి జరిగి తీరవలసిందేనా? నా మనసులో ఎన్నో ప్రశ్నలు! జవాబులు దొరకని ప్రశ్నలు!

అశోక్‌తో జీవితాన్ని ఊహించుకుంటే కలలలో తేలిపోయేదాన్ని. కానీ పెళ్ళి తంతు, హడావిడీ నాలో ఉత్సాహం కలిగించలేకపోయాయి. అదేదో తప్పనిసరి పని లాగ అనిపించింది. అన్నయ్యా, అమ్మా పెళ్ళి పనుల్లో మునిగిపోయారు. అమ్మతో పెళ్ళిచీరలు కొనేందుకు వెళ్ళానే గాని, నాకూ ఆ పెద్ద పెద్ద జరీ పట్టుచీరల్లో ఏమాత్రం ఆసక్తి లేదు. ఒకప్పుడు అలాంటి చీరలు కొనుక్కోవాలని ఉవ్విళ్ళూరిన మాట నిజమే. కానీ ప్రస్తుతం నగలూ, చీరలూ నా మనసుకి నచ్చడం లేదు. అమ్మ నగలూ, గిన్నెలూ కొనడానికి కూడా నన్ను రమ్మంది. ఏమాత్రం ఆసక్తి లేకపోయినా అమ్మకోసం యాంత్రికంగా ఆ పనులు కూడా అయ్యాయనిపించాను.

మళ్ళీ ఇల్లు బంధువులతో నిండిపోయింది. అక్కయ్యావాళ్ళు రెండ్రోజులు సెలవు పెట్టుకుని వచ్చారు. పెద్దన్నయ్య కూడా పూర్తిగా కోలుకున్నాడు.

ఎవరూ చిన్నూ పేరెత్తలేదు. ఇంట్లో పెళ్ళి హడావిడి జరుగుతూంటే వాడు అదేమీ తెలీకుండా ఆస్పత్రిలో పడి ఉండిపోయాడు. అమ్మ అన్నయ్యతో "వాడికి కనీసం పెళ్ళికి చేసిన మిఠాయిలైనా ఇవ్వద్దా? " అంది.

"ఏమిటమ్మా అంటున్నావు? జబ్బుగా ఉన్నవాడికి మిఠాయిలు అరుగుతాయా? " అని విసుక్కున్నాడు అన్నయ్య.

"తినకపోయినా కనీసం రుచి చూస్తాడురా! తమ్ముడు కదా? "

"సర్లే, తీసుకెళ్ళి ఇస్తాలే" అన్నాడు అన్నయ్య.

మామూలుగా ఉండే పెళ్ళి హడావిడి నా పెళ్ళిలో కనిపించలేదు. దగ్గర బంధువులని మాత్రమే పిలిచాం. ఏదో కొద్దిగా అలంకరణా సంగీతమూ పెట్టించాడు అన్నయ్య. షెహనాయ్ సన్నగా వినిపిస్తోంది. మండపాన్ని తెల్లటి పూలతో

అలంకరించారు. వాతావరణం చాలా సాత్వికంగా ఉంది. జననం, వివాహం, మరణం... మూడు ముఖ్యమైన ఘట్టాలు! మూడూ ఎంత దగ్గరగా ఉంటాయో అంత దూరంగా కూడా ఉంటాయి. ఒకదాన్ని ఒకటి ఎప్పుడూ స్పృశించవు! అయినా మూడూ ముడిపడి ఉంటాయి. నా మనసు అస్తవ్యస్తమైపోయింది. నా పెళ్ళి తంతులో నాన్న లేకపోవడం పెద్ద లోట నిపించింది. మాటి మాటికీ కళ్ళు చెమరు స్తూంటే యాంత్రికంగా నా పెళ్ళి తంతులోని పనులన్నీ చేశాను.

'అందర్నీ సమస్యల్లో వదిలి నా దారిన నేను వెళ్ళిపోతున్నానే' అన్న అపరాధ భావం కూడా తలెత్తింది.

అప్పగింతలప్పుడు అమ్మమ్మ "ఇక ఈ ఇంటికీ నీకూ రుణం తీరిపోయిందమ్మా! మెట్టినింటికి మంచి పేరు తేవాలి నువ్వు" అనేసరికి భోరుమని ఏడ్చేశాను. ఆవిడ అలా అనేసరికి పుట్టి పెరిగిన ఆ ఇల్లు నాకు పరాయిదైపోయినట్టు అనిపించింది.

'ఈ ఇల్లొదలి ఎక్కడికీ వెళ్ళను! చిన్నూకి దగ్గరగా ఈ ఊళ్ళోనే, ఈ ఇంట్లోనే ఉంటాను' అని అమ్మ నిర్ణయించుకుంది. అన్నయ్యకి ఈ ఊరికి బదిలీ చేయించుకు నేందుకు సమయం పడుతుంది. ఇలాంటి సమస్యలెన్నో ఆ రోజు రాత్రి నాలో తొంగి చూడసాగాయి. కొత్తగా ఏర్పడిన బంధం ఆ ఇంటి గుమ్మంతో రుణం తీరిపోయిం దని హెచ్చరిస్తోంది. ఇప్పుడు నేను దాన్ని దాటక తప్పదని నాకు తెలుసు.

అంశూకీ ఆ ఇంటికీ ఏమైనా సంబంధం ఉందా? అందుకే వాడు అశోక్‌కి కూడా కొడుకైనా నాకు మాత్రమే సొంతం అనిపి స్తున్నాడా? ఒక మనిషితో సంబంధం ఏర్పడ్డంత మాత్రాన వాళ్ళ తలరాతతో సంబంధం ఉండాలని నియమమేమీ లేదేమో! నేను చెప్పేది అశోక్‌కి మాత్రమే కాదు, నాకూ వర్తిస్తుంది. చిన్నూకి అక్క నైనా నా దారి నేను చూసుకొని వచ్చెయ్యా లేదా?




అశోక్ వెంట నేను నిజంగానే ఒక కొత్త ప్రపంచంలోకి అడుగుపెట్టాను. రంగురంగుల, తళతళ మెరిసిపోయే, కోలాహలంతో నిండిన ముంబయి నగరం! సాయంకాలాలు సంగీతం, నాటకాలూ, సినిమాలు! ఒక్కొక్క సాయంకాలమూ ఏదో ఒక ప్రత్యేకతతో నిండి ఉండేది. అశోక్ నన్ను ఒక్క క్షణం కూడా వదిలే వాడు కాదు. చివరికి పగలు బిజినెస్ మీటింగులకి కూడా నన్ను వెంటపెట్టుకుని వెళ్ళేవాడు. అతని మీటింగ్ అయేదాకా నేను బైట కారులోనే కూర్చుని ఉండే దాన్ని. బైట ఊళ్ళకి వెళ్ళాల్సి వస్తే మాకది ఒక పిక్నిక్ లాగే గడిచేది.

"నీలాంటి విలువైన రత్నాన్ని ఇంట్లో ఎలా వదిలి వెళ్తాను? " అనేవాడు అశోక్.

"ఏం.. ఇంట్లో వదిలేస్తే ఏమవు తుంది? " అని అడిగేదాన్ని.

"ఏమో, ఎవరైనా దోచుకుంటేనో? "

"ఎవరు దోచుకుంటారు? "

"నేను ఈ విషయంలో ఎవర్నీ నమ్మను తెలుసా!"

నా ప్రపంచం అశోక్‌తోటే నిండిపో యింది. ఇంకెవరికీ అందులో చోటు మిగ

ల్లేదు. అమ్మకి ఉత్తరం రాసేందుకు కూడా తీరిక చేసుకోలేకపోయేదాన్ని. అమ్మతోనూ, చిన్నూతోనూ అంతవరకూ ప్రగాఢమైన అనుబంధం ఉండేది. అయితే ఇప్పుడు నా జీవితంలో దాని ప్రసక్తి కూడా లేదు! ఎప్పుడూ అతని గురించే ఆలోచిస్తూ, అతనికోసమే అలంకరించుకుంటూ, అతని అవసరాలు తీర్చడంలో కాలాన్ని గడుపుతూ ఉండేదాన్ని. అసలు ఆ ఇల్లు అశోక్‌కి కొనసాగింపులా కనిపించేది! అందుకే ఇంట్లో ప్రతి మూలనీ అందంగా తీర్చిదిద్దడమే వ్యాపకం అయిపోయింది నాకు. ఒకసారి కర్టెన్లు కొత్తవి కొనేదాన్ని, బెడ్ కవర్లు పాతబడిపోయాయని షాపుకి పరిగెత్తేదాన్ని. అశోక్ కోసం షర్టులూ, నా కోసం.. నేను అశోక్‌కి అందంగా కనిపించడం కోసం... కొత్త చీరో, ఒక నగో కొనడం.. ఇలా ఏదో ఒక కొత్త వస్తువు కొని అశోక్‌ని సంతోషపెట్టడమే నా ధ్యేయం అన్నంతగా మారిపోయాను. రోజులూ, వారాలూ క్షణాల్లా దొర్లిపోసాగాయి. ఒక్క క్షణం నిలబడి ఊపిరి పీల్చుకునేందుకు కూడా తీరిక దొరికేది కాదు. అశోక్‌తో పాటు అతని కుటుంబం, స్నేహితులూ, బిజినెస్ భాగస్వాములూ అందరూ నావాళ్ళే అయిపోయారు.

చూస్తుండగానే రెండేళ్ళు అలాగే గడిచిపోయాయి. నేను అమ్మని చూసేందుకు వెళ్ళలేదు. పగలంతా వర్తమానంలో గడిపినా రాత్రి కలల్లో మాత్రం మరచిపోయిన నా మునుపటి రోజులు వచ్చేవి. ఒక కలైతే మళ్ళీ మళ్ళీ వచ్చేది- చలి రాత్రి.. అంతటా నిర్మానుష్యంగా ఉంటుంది.. మంచుకప్పిన గుట్టలు.. నల్లటి చీకటి రాత్రిలో తెల్లగా మెరిసే మంచు! కానీ ఆ మెరుపులో సంతోషం లేదు. విషంలా నీలంగా ఉందది.. ఒక గుట్టమీద నాన్న పడుకుని ఉంటాడు.. ఒంటరిగా తెల్లటి దుప్పటిలో చుట్టిన నాన్న శరీరం! ఆయన పక్కనే మోడువారిన ఒక చెట్టు మొదలు.. దాన్ని చూడగానే నేను భయంతో వణికిపోతాను. మెలకువ వచ్చేస్తుంది. కాని నేను చలి జ్వరం వచ్చిన దానిలా ఇంకా వణుకుతూనే ఉంటాను!

ఒక్కోసారి అమ్మ కూడా కలలోకొస్తుంది. ఎవరో చచ్చిపోయినట్టు విపరీతంగా ఏడుస్తూ ఉంటుంది, కానీ ఎవరు చనిపోయారో తెలీదు! భయంతో ఒళ్ళంతా చెమటలుపట్టి నిద్ర మేలుకుంటాను. అయినా ఆ కల వాస్తవంలా భయపెడుతూనే ఉంటుంది. 'అమ్మ గడిచిపోయిన విషాదాన్ని తల్చుకుని ఏడుస్తోందా, లేక ఇంకా ఏమైనా ఘోరం జరగబోతోందా?' అనే ప్రశ్న నన్నిక నిద్ర పోనివ్వదు.

ఒకరోజు రాత్రి అన్నయ్య దగ్గర్నించి ఫోన్ వచ్చింది. అమ్మకి ఒంట్లో ఏమీ బాగాలేదనీ, నన్ను చూడాలని అంటోందనీ, వీలుంటే ఒక్కసారి వచ్చి వెళ్ళమనీ అన్నాడు అన్నయ్య.

అప్పుడు నేను అంశూకి కడుపుతో ఉన్నాను. అశోక్ నన్ను ఎక్కడికీ ఒంటరిగా పంపించేందుకు ఒప్పుకునేవాడు కాదు. ఈరోజు అది తల్చుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. నన్ను విడిచి ఒక్కక్షణం కూడా ఉండలేకపోయేవాడు అశోక్. మరి ఇవాళ ఇద్దరం ఎంత దూరమైపోయాం! అంశూ

పుట్టకముందు నన్ను అనుక్షణం కనిపెట్టుకుని నన్నూ, నా కడుపులో బిడ్డనీ కంటికి రెప్పలా కాపాడిన అశోక్ ఇప్పుడు అంశూ కనబడితేనే మొహం తిప్పేసుకుంటున్నాడు! వాడికి దెబ్బతగిలి ఇలా అయిపోయినప్పణ్ణించీ వాణ్ణి తప్పించుకుని తిరుగుతున్నాడు. ఇంత రాయిలా ఎవరైనా ఎలా మారిపోగలరో నాకర్థంకాదు. తన సొంత వాళ్ల సమస్యలనించి పారిపోయేందుకు, తప్పించుకునేందుకు మనుషులు ఎంత కష్టపడి గోడలు నిర్మించుకుంటారు!

ఆ సంఘటన నాకు ఇప్పటికీ గుర్తుంది. అంశూ కొత్తగా పెయింటింగ్ చెయ్యడం మొదలెట్టాడు. ఎప్పుడు చూసినా రంగులతో ఎక్కడ చోటుంటే అక్కడ బొమ్మలు వేసేవాడు. నేను వాడికి బోలెడన్ని రంగులూ, బ్రష్షులూ, కేన్వాస్ కాయితాలూ కొనిచ్చాను. ఒక్కోసారి వరండా నేల తడిగా ఉంటే దానిమీద చాక్ పీస్‌తో బొమ్మలు గీసేవాడు. తోటలో ఎండుపుల్లల్తో రకరకాల ఆకారాలు తయారు చేసేవాడు. నేను వాణ్ణి అడ్డుకునేదాన్ని కాదు. వాడు ఆ బొమ్మల ద్వారా ఏదో చెప్పాలనుకుంటున్నాడని అనిపించేది. వాడు వేసే బొమ్మలు బాగా వస్తే వాటిని గోడకి అంటించి పొగిడేదాన్ని. అశోక్‌కి అలా గోడలమీది వాటిని అంటించడం అసలు ఇష్టం ఉండేదే కాదు. గొప్ప చిత్రకారుల చిత్రాలు మాత్రమే గోడలకి తగిలించాలనుకునేవాడు.

ఒకసారి నేను వంటింట్లో పనిలో ఉన్నప్పుడు అశోక్ బల్లమీద ఉన్న కాయితాల మీద అంశూ రంగులు పులిమాడు. సాయంత్రం ఇంటికి రాగానే అశోక్ వాటిని చూసి మండిపడ్డాడు. అంశూని కొట్టడానికి వచ్చాడు. అంశూ లాన్‌లో కూర్చుని నా దగ్గర అల్లడం నేర్చుకుంటున్నాడు. ఇంతలో అశోక్ వచ్చి వాడి చెయ్యి పట్టి లాగాడు. వాడు హడలిపోయి చూస్తూంటే నేను కెవ్వుమని అరిచాను. అశోక్ ఏమైనా అనేలోపల నేను అతని గుప్పిట్లోంచి అంశూ చేతిని విడిపించేందుకు ప్రయత్నిస్తూ, "వాడి మీద చెయ్యి వేశావంటే ఊరుకోను! వాడు అంత పెద్ద తప్పేం చేశాడని? అయినా వాడి సమస్య తెలుసుకదా నీకు? " అన్నాను కోపంగా.

"వాడిని మరీ ముద్దుచేసి పాడుచేస్తున్నావు. వాడిలాగే నువ్వు కూడా పిచ్చిదానివేమో అనిపిస్తోంది నాకు!"

"నన్ను ఎన్ని మాటలైనా అను. పడతాను, కానీ వాడిమీద చెయ్యి చేసుకుంటే ఊరుకునేది లేదు. కొట్టాలనిపిస్తే నన్ను కొట్టు!" అన్నాను.

కోపంతో బుసలు కొడుతూ అశోక్ తన గదిలోకి వెళ్ళిపోయాడు. వెళ్ళే ముందు, "ఇది ఇల్లు కాదు, పిల్లల నర్సరీ కొంపలా తయారైంది. ఎక్కడ చూసినా అడ్డదిడ్డంగా వస్తువులు. నేను ఎప్పుడూ ఇంట్లో ఉండనని నీకు కోపం. ఈ ఇల్లు ఇల్లులా ఉంటే కదా? పిచ్చాసుపత్రిలా ఉంది! రంగులు పులిమితే పెయింటింగ్ అవదు. నీ బతుకు ఎలాగూ అధ్వాన్నంగా తయారైంది. నన్ను కూడా ఈ పిచ్చాసుపత్రిలోకి ఈడ్చాలని చూస్తున్నట్టున్నావు!" అంటూ అరిచాడు.

అతను అన్న అన్ని మాటల్లోనూ పిచ్చాసుపత్రి అనే మాట మళ్ళీ మళ్ళీ బుర్రని తొలవసాగింది. నిజంగానే నేను పిచ్చిదాన్ని అయిపోతున్నానా? ఒక్క క్షణం అనుమానం వచ్చింది. పిచ్చివాళ్ళకి వాళ్ళ పిచ్చి తెలీదు కదా! కానీ మరుక్షణం ఆ అనుమానాన్ని అవతలకి నెట్టేశాను.

ఆ రోజు ఎందుకో నాన్న చిన్నూని చావబాదడం గుర్తొచ్చింది. దాంతో మనసంతా వికలమైపోయింది. దిగులు ముంచుకొచ్చింది. అంశూ విషయంలో అలా జరగని

వ్వను. అశోక్ వాడిమీద ఒక్క దెబ్బ వేసినా ఊరుకోను. అసలు వాణ్ణి ఏనా డైనా ముద్దుచేస్తే కదా? అలాంటప్పుడు కొట్టే హక్కు ఎక్కణ్ణించి వస్తుంది? అసలు ఒకరి శరీరానికి హాని కలిగించే హక్కు ఎవరికి మాత్రం ఎలా ఉంటుంది? అతను తండ్రి అయితే మాత్రమేం? కానీ మా నాన్నని అడ్డుకునే ధైర్యం ఆ రోజు నాకు లేకపోయింది! ఇప్పుడు అలా కాదు. అంశూ నా శరీరంలో ఒక భాగం. అమ్మ తనం నాలో ఈ ధైర్యాన్ని సృష్టించి ఉండాలి. 'పుట్టింట్లో ఉండగా నాలో ఈ ధైర్యం ఉండిఉంటే చిన్నూని రక్షించుకుని ఉండేదాన్ని కదా? ' అని బాధపడ్డాను. ఒక్కోసారి అప్పటి పరిస్థితులు వేరు అని పించేది. ఈ రోజు మనకున్న సాంకేతిక పరిజ్ఞానం, విజ్ఞానం అందించిన సౌక ర్యాలూ, అనుభవమూ ఇంతకు మునుపు ఎక్కడున్నాయి? అప్పట్లో అవే ఉంటే చిన్నూ బాగయేవాడేమో!

ఈ ప్రశ్న చాలాసార్లు నన్ను నేను వేసు కున్నాను, మిగతావాళ్లనీ అడిగాను. జవాబు దొరకలేదు. బహుశా దీనికి సరైన జవాబే లేదేమో! ఏ ఇద్దరి పరిస్థితీ బహుశా ఒకలా ఉండదు. అయినప్పటికీ నా మనసులో ప్రశ్నలు మొలుస్తూనే ఉన్నాయి. పశ్చాత్తాపానికి గురయేదాన్ని. అంశూతో నాకున్న బంధం చిన్నూతో ఉండిన సంబంధానికి కొనసాగింపులా కన బడేది. చిన్నూవల్లే అంశూ పరిస్థితిని అంత బాగా అర్థం చేసుకోగలిగాను. లేక పోతే ఇవాళ అంశూ కూడా అమానుష మైన ఏ పిచ్చాసుపత్రిలోనో కుంగి కృశించి పోతూ ఉండేవాడు. నేనేమో అశోక్‌లాగే అంశూలోని లోటుని నాకిష్టమైన రకార కాల పనులతో పూరించుకునేదాన్నేమో? కానీ నేనలా చెయ్యలేదు. అంశూ తప్ప నాకింకొక ప్రపంచమే లేకుండా పోయింది. ఆ ప్రపంచంలో అశోక్‌కి కూడా చోటు లేదు! మరి అలాంటప్పుడు అశోక్ బైట తన ప్రపంచాన్ని సృష్టించుకోడంలో తప్పే ముంది? అయినా పరాయి స్త్రీలతో అతను సంబంధాలు పెట్టుకున్నాడని తెలిసిన ప్పుడు మాత్రం తట్టుకోలేకపోయాను. పూర్తిగా కుంగిపోయాను. అతన్ని నిలదీస్తే "నీకు నాతో గడిపే తీరికేదీ? నన్ను కూడా నీతోబాటు ఏడుస్తూ కూర్చోమం

టావా? నా అవసరాలు నాకుండవా? నన్నెప్పుడైనా పట్టించుకున్నావా? ఆడది తల్లి మాత్రమే కాదుగా? పెళ్ళాంగా కూడా నీకు నా పట్ల కొన్ని బాధ్యతలు ఉంటాయి కదా? నేను నీలాగ అన్నీ వదిలేసి ఇంట్లో కూర్చోలేను. నాకోసం కూడా నేను బతకాలి!" అని కరుకుగా జవాబిచ్చాడు.

ఒక్కోసారి చిరాకు మరీ ఎక్కువైతే "నువ్వు చేస్తున్నపని దేవుడికి, దయ్యానికీ మాత్రమే సాధ్యం! నేను మామూలు మనిషిని. నన్నిలాగే బతకనీ!" అనేవాడు.

నేను అశోక్ స్నేహితురాళ్ళని ఎప్పుడూ చూడలేదు. ఫోన్లు వచ్చేవి. అశోక్ ఇంట్లో ఉంటే గంటలకొద్దీ వాళ్ళతో ఫోన్‌లో మాట్లాడేవాడు. ఈ రోజుల్లో స్నేహాలకి రకరకాల పేర్లు పెట్టుకోవచ్చు. బిజినెస్ సంబంధాలు, పరిచయస్థులు.. కానీ శరీరం, మనసుని తృప్తిపరిచేందుకు ఏర్పరచుకునే సంబంధాలకి పేర్లేముంటాయి? అలాంటి స్త్రీలని ప్రియురాళ్లని కూడా అనలేం. అయినా అతనికి వాళ్ళవల్ల శారీరకంగానూ, మానసికంగానూ సుఖం దొరుకుతోంది. కనక నేను దాన్ని అడ్డుకోదలుచుకోలేదు. అతను రాత్రిళ్ళు ఆలస్యంగా వచ్చి అబద్ధాలు చెప్పినా, అతని మొహం, హావభావాలూ చూసి నిజం తెల్సిపోయేది నాకు. నేను పూర్తిగా అంశూకే అంకితమైపోయాను. మరి అశోక్ తన దారి తను చూసుకుంటే ఎలా తప్పుపట్టను? కనీసం నాకు విడాకులు ఇవ్వడంలేదు కదా! అలాగే అతనితో సంబంధం పెట్టుకున్న ఆడవాళ్ళు కూడా అతని మీద తమ హక్కుని ప్రకటించటం లేదుకదా!

అశోక్ గతంలో చిన్నూలాంటి వ్యక్తితో కలిసి బతకలేదు. అందుకే అంశూ పరిస్థితికి నాలాగ స్పందించలేకపోయాడు. చిన్నతనంలోలాగే హాయిగా, చీకూ చింతా లేకుండా బతకాలని అతని ఆశ. నా దగ్గర్నించి సహజంగా పొందాల్సిన సుఖాలకి అతన్ని దూరం చేశాను. ఇంకెవరో ఆ సుఖాలని ఇస్తూంటే నేనెందుకు బాధపడాలి? ఆ ఆడవాళ్ళకి నేనే కృతజ్ఞతలు చెప్పాలి. వాళ్లవల్లే అశోక్ ఇంకా మాతో కలిసి ఒకే కుటుంబంగా ఉంటున్నాడు!

★ ★ ★

డాక్టర్ని అడిగితే ఇంకా నాలుగో నెలే కాబట్టి విమాన ప్రయాణం చెయ్యచ్చన్నాడు. అన్ని రోజుల తరవాత పుట్టిపెరిగిన ఢిల్లీని చూసేసరికి ఎంతో ఆనందం వేసింది. అన్నయ్య ఫోన్ చేసి ఉండకపోతే ఇక్కడికి అసలు బైలుదేరేదాన్నే కాదు! అమ్మని చూసే అవకాశమే వచ్చేది కాదు. పెళ్ళైన నా అక్కయ్యలిద్దరూ వాళ్ళ సంసారాల్లో మునిగిపోయి ఇంకెవరి గురించీ ఆలోచించే తీరికే లేకుండా తయారయారు. వాళ్ళు పరాయివాళ్లలాగ అంటీ ముట్టనట్టు, మర్యాదకోసం కృత్రిమంగా మాట్లాడడం, ఆప్యాయత ఏమాత్రం లేకుండా ప్రవర్తించడం తెలుస్తూనే ఉంది. 'నేను కూడా అలాగే తయారయానా?' అని అనిపించింది. ఎయిర్‌పోర్ట్‌కి పెద్దన్నయ్య వచ్చాడు. చిక్కిపోయి, వయసు పైబడ్డవాడిలా కనిపించాడు. నాన్న పోయాక బాధ్యతంతా మరి అన్నయ్య మీదే పడింది. నన్ను చూడగానే అన్నయ్య కళ్లలో మెరుపు కనిపించింది. నేను కూడా ఇన్నేళ్ళ తరవాత పాత శశినే అయిపోయాను.

"అమ్మెలా ఉంది?"

"ఆస్పత్రి నించి ఇంటికి వచ్చింది. కానీ మునుపటిలా లేచి తిరగలేకపోతోంది"

"వదిన?"

"బెంగళూరులోనే ఉంది. పిల్లలకి పరీక్షలు జరుగుతున్నాయి"

"నీ ట్రాన్స్‌ఫర్ సంగతేమైంది?"

"ప్రయత్నిస్తూనే ఉన్నాను. బహుశా పై ఏడాదికల్లా అయిపోతుందేమో!"

ఎక్కువసేపు మనసుకి బాధ కలిగించే విషయాన్ని ప్రస్తావించకుండా ఉండలేకపోయాను.

"చిన్నూ ఎలా ఉన్నాడు? "

"అమ్మ ఇన్నాళ్లూ వాణ్ణి చూసేందుకు వెళ్తూనే ఉంది. బస్సుల్లో పడి అంత దూరం వెళ్లద్దమ్మా, అంటే వినడం లేదు. ఇప్పుడు గుండెపోటు వచ్చి, ఆరోగ్యం పాడయాక వాణ్ణి ఇంటికి తీసుకురమ్మని ఒకటే గొడవ!"

అశోక్ నాకు చెప్పిన జాగ్రత్తలు గుర్తొచ్చాయి. "శశీ! నీ మనసులో ఏం జరుగుతోందో నాకు తెలుసు. కానీ జాగ్రత్త! పుట్టబోయే బిడ్డకోసమైనా నువ్వు ఎటువంటి సాహసాలూ చెయ్యకూడదు"

అప్పుడు అంశూకి ఇలా అవుతుందని నాకేం తెలుసు? నేను జాగ్రత్తగా ఉంటానని అతనికి మాటిచ్చాను.

అమ్మ తన గదిలో మంచానికి అంటుకుపోయి పడుకునుంది. నేనే వంగి అమ్మని వాటేసుకున్నాను.

"అబ్బ, ఎన్నాళ్లకి చూశానే నిన్ను! ఉత్తరం పత్తరం ఏమీ రాయవు. నన్ను మర్చిపోయావు కదూ? " అంది అమ్మ.

"నేను ఒకటో రెండో రాశాను.. నువ్వు అదీ రాయలేదుగా? " అన్నాను.

చిన్నూ సమస్యతో అమ్మ ఎంతగా నలిగిపోయిందో, అన్నయ్య అప్పుడప్పుడూ వచ్చి చూసి వెళ్ళినా, ఒంటరిగా అన్ని పనులూ ఎలా చేసుకుందో నేను ఊహించగలను.

అందుకే "సర్లే, అవన్నీ ఇప్పుడొద్దు కానీ నేను ఇప్పుడొచ్చాగా, కబుర్లు చెప్పు!" అన్నాను.

అమ్మకోసం ఒక మనిషిని పెట్టారు. ఆమె అమ్మ పనులేకాక ఇంటి పనులు కూడా చేస్తుంది. అమ్మ ఆమెని పిలిచింది. నాకోసం ఏవో చెయ్యమని పురమాయించబోయింది.

"అమ్మా నేనేమన్నా పరాయిదాన్నా? ఎందుకింత హైరాన పడుతున్నావు? ప్లేన్‌లో తినేసే వచ్చాను. ఆకలేస్తే నేనే అడిగి చేయించుకుంటాను. నేనే వంటింట్లోకి వెళ్లి కావలసినవి చేసుకుంటాను" అన్నాను.

అయినా అందరూ నన్ను అతిథిలాగే చూశారు. అన్నయ్య కూడా! నాకు కూడా ఇది నా ఇల్లు కాదనిపించేట్టు ప్రవర్తించారు. రెండేళ్ళలో ఇల్లు కూడా పాడయిపోయింది. రంగులు వెలిసిపోయాయి. గోడలు మాసిపోయాయి. కిటికీల్లో బూజూ, దుమ్మూ నిండిపోయాయి. అమ్మ ఇంటిని అద్దంలా ఉంచేది. ఆవిడ మంచం పట్టగానే ఇంటిని శుభ్రంగా ఉంచే నాథుడు లేకపోయాడు!

ఇక్కడికొచ్చాక నాకు కాలం నిలిచిపోయినట్టనిపించింది. ముంబయిలో ఉరుకులూ, పరుగులతో గడిచేది. ఇక్కడ చేసేందుకు కూడా పనేమీ లేదు. అమ్మ గదికీ, బైట లాన్‌కీ తిరగడం, ఫోన్లో పాత స్నేహితురాళ్ళతో కబుర్లు చెప్పుకోడం, వీధిలో వెళ్ళే కూరగాయలూ, పళ్ళూ పిలిచి కొనడం. డాబా మీద నిలబడి చుట్టూ కడుతున్న కొత్త ఇళ్ళని చూడడం.. అంత ఖరీదైన

ఇళ్ళని కట్టే కూలీలు ఆ ఇటుకలూ, రాళ్ళ కింద నలిగిపోతూ శ్రమ చెయ్యడం చూసి బాధపడడం!

నేనొచ్చేసరికి అన్నయ్యకి కాస్త తెరిపిన పడ్డట్టనిపించి, బెంగళూరుకి ప్రయాణం కట్టే ప్రయత్నాల్లో పడ్డాడు.

"ఒక్కసారి చిన్నూని ఇంటికి తీసుకొచ్చాక వెళ్ళువుగాని, శశి కూడా తమ్ముణ్ణి చూసి చాలా కాలమైంది" అని అమ్మ పట్టుపట్టింది.

"అమ్మా! నీకసలే ఒంట్లో బాలేదు. ఇలాటప్పుడు.."

అన్నయ్య మాటలకి అడ్డొచ్చి "ఒక్క రోజులో నాకేమవదులే" అంది అమ్మ.

"సరే, అయితే పొద్దున్నే తీసుకొచ్చి సాయంత్రం దిగబెట్టేస్తాను, సరేనా? "

"చూద్దాం, ముందు వాణ్ణి తీసుకురా నువ్వు. ఎలా ఉన్నాడో ఏమో! వాణ్ణి చూసి కొన్ని నెలలయింది!"

చిన్నూ వచ్చాడు. వాణ్ణి చూస్తే వాడి నీడని చూస్తున్నట్టనిపించింది నాకు. ఒంట్లో ఒక్క నలుసు మాంసం కూడా లేదు. అస్తిపంజరంలాగ అయిపోయాడు. ముట్టుకుంటే విరిగిపోతుందేమో అన్నట్టు ఎముకల గూడులా ఉంది ఒళ్ళు. మొహం, ఒంటిమీది చర్మం నల్లబడిపోయాయి. ఒంట్లో ఒక్క చుక్క రక్తం లేనట్టు, కళ్ళు బాగా లోతుకిపోయి, సొట్టలు పడే బుగ్గలు ఇప్పుడు పీక్కుపోయి, అందమైన చిన్నూ గుర్తుపట్టలేకుండా తయారయాడు. వాణ్ణి చూస్తే భయం వేసింది నాకు!

లోపలికి వచ్చి నిలబడే శక్తి కూడా లేనట్టు అన్నయ్య చేతుల్లో వాలిపోసాగాడు. అన్నయ్య వాణ్ణి తీసుకెళ్ళి వాడి గదిలో మంచం మీద పడుకోబెట్టాడు. వాడు మాలో ఎవర్నీ గుర్తుపట్టలేదని అనిపించింది. నేను పలకరించినా జవాబు చెప్పకుండా ఎటో చూస్తున్నాడు. అమ్మ ఏదైనా అడిగితే 'ఊ.. ఆ..' అంటున్నాడే తప్ప మాట్లాడే ఓపిక లేనట్టు మౌనంగానే ఉన్నాడు. పైగా దగ్గొకటి విడవకుండా వస్తూనే ఉంది. దగ్గినప్పుడల్లా మొహం బాధతో కొంకర్లు తిరుగుతోంది. ఉమ్మితే కళ్ళెతో బాటు రక్తం పడుతోంది. వాణ్ణి చూసి నా మనసు మౌనంగా దుఃఖించడం తప్ప ఏమీ చెయ్యలేని స్థితి. 'పదిహేను పదహారేళ్ల వయసులో ఆరడుగుల పొడవుతో, అందమైన ఆకారంతో చలాకీగా తిరిగిన ఆ చిన్నూయేనా వీడు!' అని అనుకోగానే అమ్మ ముందే ఏడ్చేశాను. పదిహేను నించి పాతికేళ్ల మధ్య... ఎవరైనా ఆ వయసులో ఎప్పుడూ లేనంత ఆనందంగా గడుపుతారు. ఎన్నో కలలూ, ఆకాంక్షలూ మనసులో రొద చెయ్యడం ప్రారంభిస్తాయి. కొన్ని ఫలిస్తాయి. రక్తం ఉరకలు వేసే వయసది. కానీ అదే వయసులో వీడు నరకయాతన అనుభవిస్తున్నాడు!

సాయంత్రం అన్నయ్య చిన్నూని ఆస్పత్రికి తీసుకెళ్తూంటే అమ్మ చాలా సేపటి వరకూ కుమిలి కుమిలి ఏడుస్తూనే ఉంది. వాడు వెళ్ళిపోయాక "ఇంక వీడు బతికేటట్టులేడు!" అంటూ బావురుమని ఏడ్చింది.

"అమ్మా! వాడు అనుభవిస్తున్న ఈ నరకం కన్నా, అదే మంచిదేమో..." అన్నాను.

"నిజమేనే! వాడు కళ్లలో ప్రాణాలు పెట్టుకుని ఉన్నాడు. క్షయరోగం వాణ్ణి హరించేసింది... ఇదంతా నేను చేసుకున్న పాపమే!"

"అదేం మాటమ్మా? "

"అవునే... నేను అప్పుడా మందులు వేసుకోకపోయుంటే... గర్భం పోవడానికి ఏమేం చేశానో! ముందే అయిదుగురు పిల్లల్ని కన్నాం, ఇంకొద్దు అనుకున్నాం నేనూ, మీ నాన్నా. ఆ మందులవల్లే వాడి

మెదడు దెబ్బతింది"

"ఎందుకమ్మా అలా అంటావు? మందులవల్ల కాకపోవచ్చు. వాడి ఖర్మకొద్దీ..." అంటూంటే అమ్మ చెప్పిన కారణం సరైనదేనేమో అన్న అనుమానం వచ్చింది.

నన్ను లోపల ఏదో తొలుస్తున్నట్టు అంతా ఖాళీ అయిపోయినట్టు అనిపించింది. గర్భం పోయేందుకు చేసిన ప్రయత్నం ఫలించక, అభం శుభం తెలీని పసివాడి జీవితం నాశనమయింది! ఎవరిది తప్పు?

అయితే అమ్మ ఇంతవరకూ ఈ సంగతి బయట పెట్టలేదేం? ముందునించే ఆవిడలో ఇలా జరగచ్చన్న భయం వుందా? అందుకేనా చిన్నాని అంత గారాబం చేసింది! ఆ అపరాధ భావంతోనేనా? ఆ ప్రశ్నలన్నీ అమ్మని అడిగి బాధ పెట్టదల్చుకోలేదు నేను. గతంగతః అన్నట్టు ఊరుకున్నాను.

దానికి తోడు వాడు కన్న కలలు... డాక్టరవాలన్న ఆకాంక్ష నిజం కాకపోవడం... అదో పెద్ద దెబ్బ వాడికి... ఒక వేళ మెడిసిన్లో సీటొచ్చుంటే ఇలా అయేవాడు కాదా? జీవితంలో ఏ సంఘటనలు మనిషిని ఎటువైపు మళ్ళిస్తాయో ఎవరికైనా ముందే ఎలా తెలుస్తుంది? ఇంజనీరింగ్‌లోనో మెడికల్‌లోనో సీటు వచ్చాక చిన్నా ఇంకే కారణం చేతో ఇలా తయారైతే అప్పుడు మా బాధ ఇంకో రకంగా ఉండేదా? నాన్న వాణ్ణి చూసి గర్వపడేవాడా లేక అంత ప్రతిభావంతుడైన కొడుకు అలా అయిపోయాడని ఇంకా కుంగిపోయేవాడా? ఎవరు చెప్తారు ఈ ప్రశ్నలకి జవాబులు? జీవితమంటే అణువణువుగా నశించిపోవడమేనేమో అనిపిస్తుంది అప్పుడప్పుడూ! అసలు విషయం ఎప్పుడూ మనిషి పట్టుకోలేడు. ప్రేమలాగే అందరూ కోరుకునేదే, కానీ చేతికి అందనిది అదే!




పుట్టింటికి వచ్చి రెండు నెలలయింది. ఒక రోజు పొద్దున్నే ఆస్పత్రినించి ఫోనొచ్చింది. "కుముద్ సైగల్ పరిస్థితి ఏమీ బాగాలేదు. ఊపిరితిత్తులు పూర్తిగా పాడైపోయాయి. ఇంక ఎక్కువ కాలం బతికుంటాడన్న ఆశ లేదు. అతన్ని ఇంటికి తీసుకెళ్ళాలనుకుంటే వెంటనే వచ్చి తీసుకెళ్తే మంచిది"

నా కాళ్ళ కింది నించి నేల కదిలిపోయినట్టనిపించింది. ఏం చెయ్యను? అమ్మ ఇంకా కోలుకోలేదు. అన్నయ్య బెంగళూరుకి వెళ్ళి చాలా రోజులైంది. నాలో పెరుగుతున్న బిడ్డవల్ల నాకు నా శరీరం కూడా భారంగా అనిపిస్తోంది. బైటికి వెళ్ళడం తగ్గించేశాను. ఒకవేళ వెళ్ళగలిగినా ఈ స్థితిలో ఆస్పత్రికి వెళ్తే అంటు రోగాలూ అవీ పట్టుకుంటాయన్న భయం ఉంది. ఏం చెయ్యాలో తోచలేదు. అమ్మకి ఈ విషయం చెప్పలేదు. ఆమెకి తెలీకుండా అన్నయ్యకి ఫోన్ చేశాను. అన్నయ్యకి మళ్ళీ ఇంత త్వరగా సెలవు దొరకడం కష్టమేనని అయినా ప్రయత్నిస్తానన్నాడు. అమ్మకి ఎందుకో వెంటనే చిన్నాని చూడాలన్న ఆరాటం కలిగింది. తల్లి పేగుకి చెప్పకుండానే తెలిసినట్టుంది!

"ముందు నువ్వు కోలుకో అమ్మా! తరు

వాత చూద్దువుగాని..” అన్నాను.

“అది సరే, కానీ ఎందుకో మనసు మన సులో లేదమ్మా. వాణ్ణి ఒక్కసారి చూస్తే గానీ ఆరాటం తగ్గేలా లేదు!”

‘బాబాయికి ఫోన్ చేద్దామా? ’ అనుకున్నాను. కాని చెయ్యాలనిపించలేదు. బాబాయి ఎప్పుడో వాడిమీద ఆశ వదులుకున్నాడు. ‘అన్నయ్య రానీ, ఆలోచిద్దాం ’ అని అనుకున్నాను. రెండ్రోజుల తరవాత మళ్ళీ ఆస్పత్రి నించి ఫోనొచ్చింది. మేం భయపడ్డంతా అయింది. బహుశా ఆ వార్త కోసమే ఎదురుచూస్తున్నామేమో! అయినా తట్టుకోలేకపోయాం. ఒకవైపు, పోనీలే వాడికి బాధలనించి విముక్తి దొరికింది అనిపించినా, అస్తిపంజరంలాంటి చిన్నూ శవాన్ని చూసే ధైర్యం లేనట్టు అనిపించింది. శాశ్వతంగా వాడు మాకు దూరమైపోయాడని తలచుకోగానే గుండె వెయ్యి ముక్కలైంది.

ఆ వార్త వినగానే అమ్మ మూర్ఛపోయింది. రెండు మూడేళ్ళలో ఇది రెండోసారి ఆవిడకి ఇలాంటి ఘోరమైన అనుభవం. నాన్న పోయినప్పటి దుఃఖం వేరు. తను సర్వస్వం పోగొట్టుకున్నానన్న వేదన అది. చిన్నూ విషయంలో శారీరకంగా, మానసికంగానూ వాడు భరించిన బాధని తల్చుకుని తల్చుకుని ఏడ్చింది అమ్మ.

వాడు పోయిన ఇరవై నాలుగ్గంటల తరవాత రాగలిగాడు అన్నయ్య. తోబుట్టువులకి తప్ప దూరపు బంధువులకి ఈ వార్త చెప్పలేదు మేం. ఎండుకట్టెలాంటి చిన్నూ శవాన్ని అన్నయ్య వచ్చాకే ఇంటికి తెచ్చారు. త్వరత్వరగా వాడికి స్నానం చేయించి, కొత్త బట్ట కప్పి శ్మశానానికి తీసుకుపోయారు. ఎవరి కోసమూ ఆగలేదు. సమయానికి రాగలిగినవాళ్ళు మాత్రమే వచ్చారు.

చిన్నూని ఏదో అంటరానివాడిలాగా గబగబా ఇంట్లోంచి బైటికి పంపించేశారు! వాడెప్పుడూ ఇంటికి తీసుకెళ్ళమని గోల చేసేవాడు. అలాంటిది ఇప్పుడు వాడి శవాన్ని కూడా ఇంట్లో ఎక్కువ సేపు ఉండనివ్వలేదు. వాడికి హక్కుగా దొరకవలసిన దహనక్రియలు కూడా క్లుప్తంగా ముగిసిపోయాయి. అమ్మకి ఇక పోరాడే శక్తి లేకపోయింది. లేకపోతే ఆవిడ ఊరుకునే రకం కాదు. జీవితాంతం చిన్నూ హక్కుల కోసం పోరాడుతూనే ఉంది. నేను నాలో పెరుగుతున్న బిడ్డ గురించి ఎక్కువ ఆందోళన పడసాగాను. మిగతా విషయాలు అంతగా పట్టించుకోలేదు.

ఇంట్లో మళ్ళీ శూన్యం నెలకొంది. మంచి పడుచు వయసులోనే ఆ ఇల్లు ముసలిదయి పోయిందనిపించింది.. చిన్నూలాగే అణువణువూ కృశిస్తూ.. కృంగిపోతూ!

★ ★ ★

నాలుగైదు రోజులు గడిచాక అమ్మ నన్ను తన బీరువాలో నాన్న దాచిపెట్టిన కాయితాలు కాస్త చూడమని చెప్పింది. ఆయన పోయాక అమ్మ అనారోగ్యం పాలవ్వడం, చిన్నూ ఆరోగ్యం రోజురోజుకీ క్షీణించిపోవడం, అన్నయ్య బెంగుళూరు వదిలి రాలేకపోవడం వల్ల ఆ కాయితాలని ఎవరూ ముట్టుకోలేదు. రెండేళ్ళుగా అవి పెట్టినచోటే ఉండిపోయాయి. అమ్మ తనకి ఈ విషయాలు అంతగా తెలీదని కూడా అంది.

ఆ కాయితాల మధ్య ఒక కవరు కనిపించింది. అది అతికించి ఉంది. చింపి చూస్తే అది నాన్న రాసిన వీలునామా! నేను మొత్తం చదివేశాను. ఇంటి విషయం రాస్తూ ఆ ఇల్లు చివరికి ఇద్దరు కొడుకులకీ చెందుతుందనీ, చిన్నూ బతికున్నంతకాలం ఇంటిమీద మొదటి హక్కు వాడిదేననీ రాశాడు నాన్న. వాడి కోసం కొంత డబ్బు కూడా విడిగా కేటాయించాడాయన. ఆ

డబ్బుతో చిన్నూని చూసుకోవాల్సిన బాధ్యత ఇద్దరు పెద్ద కొడుకులకీ అప్పగించాడు. కాలం ఎంత విచిత్రమైనది! చిన్నూ శవం లేచాకే ఈ కవరు చింపడం కాలం మమ్మల్ని వెక్కిరించినట్లు అనిపించింది!

అయితే 'చిన్నూకి ఎక్కడా ఆశ్రయం దొరకదేమో' అన్న భయం వల్లే నాన్న అంత హడావిడిగా ఈ ఇల్లు కట్టించి ఉండాలి. 'తనని ఇంట్లోంచి గెంటించింది నాన్నే' అని చిన్నూ ఎప్పుడూ ఆయన్ని తప్పుపట్టేవాడు. ఆయన తన కోసం ఎంత కష్టపడి ఈ ఇల్లు కట్టించాడో తెలుసుకోకుండానే వాడీ లోకం వదిలి వెళ్ళిపోయాడు. పాపం! వాడు ఈ ఇంట్లో ఉండనే లేదు. బతికున్నా ఇక్కడ ఉండేవాడా? ఆస్పత్రిలోనే ఉండేవాడేమో!

చిన్నూ చనిపోతే అమ్మ తప్ప ఎవరమూ ఏడవలేదు. అందరూ 'వాడు పోవడమే మంచిది' అని అంటున్నప్పుడు మన సారా ఏడవాలని కూడా అనిపించదు! ఆవిడ మౌనంగానే శోకాన్ని భరించింది. పైగా అమ్మ బాగా బలహీనమైపోయింది కూడా. ఒంట్లో శక్తి మొత్తం ఎవరో పీల్చేసినట్టు.. ఆవిడ జీవితంలో ఒక ముఖ్యమైన భాగం ఎటువంటి ప్రతిఫలాన్నీ ఇవ్వకుండా వ్యర్థంగా గడిచిపోయింది. చిన్నూ బతికుండగా ఏడ్చి ఏడ్చి ఆవిడ కన్నీళ్ళు కూడా ఇంకిపోయాయి. చిన్నూ కొంచెం కొంచెంగా చనిపోతూ.. ఇంటికీ ఆస్పత్రికీ తిరుగుతూ.. వాడు బతికి ఉన్నా తన దగ్గర లేకపోవడంతో ఆవిడ నరకం అనుభవించింది.

మరోపక్క కడుపులో బిడ్డ కొద్దికొద్దిగా ప్రాణం పోసుకోవడాన్ని నేను తెలుసుకుంటున్నాను.

అంశూ పుట్టాక మళ్ళీ చిన్నూ బతికి వచ్చినట్టనిపించింది నాకు. వాడి కను ముక్కు తీరు కూడా అలాగే ఉంది.. బుగ్గల్లో సొట్టల దగ్గర్నించీ! కానీ అలాంటి పోలికలు చూసి నేను లోలోపల భయపడ్డాను. 'వీడి భవిష్యత్తు కూడా చిన్నూలాగే..' అనుకుంటేనే నిలువెల్లా వణుకు పుట్టుకొచ్చేది. కానీ వాడు సవ్యంగా ఉండడం చూసి కుదుటపడేదాన్ని. వాడు మొదటి అంతస్తులోంచి పడి, తలకి దెబ్బ తగలడం వల్ల వాడి మెదడు దెబ్బతిన్నప్పుడు కూడా నేను ఒకటే అనుకున్నాను... 'నేను నా గర్భం పోయేందుకు ఏమీ చెయ్యలేదే. మరి వీడికి ఇలా ఎందుకు జరిగింది? ' అని.

పరిస్థితులు ఎవరి అదుపులోనూ ఉండవని అర్థమైంది. నా శాయశక్తులా వాటిని మార్చే ప్రయత్నమైతే చేశాను. డబ్బూ, హోదా, పరిస్థితులూ మారాలన్న బలమైన కోరికా ఉన్నవాళ్ళు చెయ్యగలిగినవన్నీ చేశాను. కానీ అశోక్‌కి నేనలా ప్రయత్నించడం కూడా కోపం తెప్పించేది. అంశూ వల్ల అలాంటి మరెందరో పిల్లల తల్లులతో నాకు కలిగిన పరిచయమూ నచ్చదు. నాలాంటి తల్లుల్ని చూసినా అతనికి ఏవగింపే. అలాంటి పిల్లలున్న స్కూళ్ళకి నేను వెళ్ళినా, వికలాంగుల కోసం పనిచేసే సంస్థలని సంప్రదించినా అంశూని బాగు చేసుకునేందుకే. అయినా అశోక్‌కి అది కంటగింపుగా ఉండేది.

ఒక రోజు వ్యంగ్యంగా "పెద్ద లీడరువైపోతున్నట్టున్నావే! వికలాంగుల సంఘానికి లీడర్! కష్టాలని కూడా సొంత ప్రయోజనాలకి ఉపయోగించుకుంటారు కొందరు. అది సొంత కొడుకైనా ఫరవాలేదు కదూ? వికలాంగుల తరఫున నువ్వు కూడా ఎన్నికల్లో పోటీ చెయ్యి ఈసారి!" అన్నాడు.

అశోక్ మనసులో ఎంత విషం! ఎంత కసి నా మీద! అంశూని మనిషిని చేసే ప్రయత్నంలో నా వ్యక్తిత్వం గట్టిపడింది.

భర్త మీద ఆధారపడకుండా సొంతంగా నేనేదైనా చేస్తే భరించలేకపోతున్నాడు అశోక్.

అంశూకి పదిహేనేళ్ళు వచ్చాయి. అశోక్ ప్రమేయం లేకుండా అంశూని ఒక రెసిడెన్షియల్ స్కూల్లో చేర్పించాను. ఊరికి దూరంగా కొండ మీద ఉందది. వాడు కూడా త్వరగా అన్నీ నేర్చుకుంటున్నాడు. కొంతవరకూ తన పనులు స్వయంగా చేసుకోగలుగుతున్నాడు. వాడిలో వచ్చిన ఈ మార్పు వల్ల నాకు కూడా స్వేచ్ఛ దొరికినట్టనిపించింది. నేను మునుపు అనుభవించినటువంటి కష్టాలలో ఉన్న మరెందరికో సాయం చేసే స్థితికి చేరుకున్నాను. నిస్సహాయులైన తల్లులకి నేను సాయం చెయ్యడం, వాళ్ళ బాధని పంచుకోడం వల్ల అశోక్‌కి లీడర్‌లాగా కనిపిస్తున్నాను. అలా చెయ్యడం నా బాధ్యత కాదా? అశోక్, అతని స్నేహితులూ అంశూకి అలాంటి సహాయం చేసేవారా? చిన్నూలాగే వీడు కూడా అశోక్‌కి తల వంచుకునే పరిస్థితి కల్పించి ఉండేవాడు. అంశూని బాగుచేసేందుకు నేను అశోక్‌ని పోగొట్టుకోవలసి వచ్చింది. అతన్ని పోగొట్టుకున్నాను. ఎవరో ఒకరిని ఎంచుకోవలసి రావడం నా దురదృష్టం! లేకపోతే నేను చేతులారా చేసుకున్నదేమో? అంశూ గురించి ఎంతో ఆందోళన పడుతూ ఇంక దేన్నీ పట్టించుకోలేదు నేను. అశోక్‌లోని మార్పు ఎవరో చెపితే గానీ తెలీలేదు. అంతగా అంశూ సమస్యలో మునిగిపోయాను.

ఒక్కోసారి మనసు గిలగిల్లాడుతుంది... నా అశోక్‌ని నాకిచ్చెయ్యమని ఆ అనామక స్త్రీలని అడగాలనుంటుంది.

ఒకసారి భరించలేక అతని ముందు కన్నీళ్ళు పెట్టుకున్నాను. అలా ఏడ్చినప్పుడే, 'పెద్ద లీడరువి అయిపోయావు' అని దెప్పిపొడిచాడు నన్ను.

జీవితాన్ని చాలాసార్లు రెండు చేతులతోనూ పొదువుకోలేని పరిస్థితులు వస్తాయి. అప్పుడు ఒక చేత్తోనే అన్నీ సాధించుకోవాలి. అది ఎంత కష్టమో అనుభవించినవాళ్ళకే తెలుస్తుంది. ఎంతో సున్నితమైనది జీవితం. చేజారి కిందపడితే వెయ్యి ముక్కలవుతుంది. ఆ ముక్కలని ఏరి అతికించినా మునుపటి రూపం రాదు. అతుకులూ, పగుళ్ళూ కనిపిస్తూనే ఉంటాయి.

నా విషయంలో అదే జరిగింది! ఏం సాధించానని వెనక్కి తిరిగి చూసుకున్నాను.

★ ★ ★

అంశూ నాకు రెండు పెయింటింగ్స్ పంపాడు. రాయల్ బ్లూ, లేత ఎరుపూ... ఈ రెండు రంగులతో మాత్రమే వేశాడు ఆ చిత్రాలని. ఒకటి నైరూప్య చిత్రం. కేవలం రంగులతో ఆడుకున్నట్టు ఉందది. రెండో దాన్లో అవే రంగులున్నాయి. కానీ... మధ్యలో ఒక మానవ ఆకారం వేశాడు. బక్కచిక్కిన శరీరం, లోతుకి పోయిన కళ్ళూ, దవడలూ... దాన్ని చూడగానే ఉలిక్కిపడ్డాను... అది చిన్నూ బొమ్మలా అనిపించింది.

అంశూ మనసులోకి ఇదెలా వచ్చింది? చిన్నూ తన బొమ్మ గీస్తే ఇలాగే ఉండేది కదా? నా మనసులో ఉన్న చిన్నూని వీడెలా గీశాడు? అదెలా సాధ్యం? ఒకవేళ చిన్నూ బొమ్మలు గీయగలిగితే చావు తప్పించుకుని ఉండేవాడా? మళ్ళీ అనేక ప్రశ్నలు! బహుశా చిన్నూని చూసి నేర్చుకున్న అనుభవం వల్లే అంశూని బతికించుకోగలిగానేమో!

అమ్మ అన్నిటినీ కర్మఫలం అని కొట్టిపారేసేది. అదే నిజమా?

అబ్బా! ఎన్ని ప్రశ్నలు! అన్నీ ప్రశ్నలే. ఒక్కదానికీ జవాబు దొరకదు. పరిస్థితులు

ప్రశ్నలు లేవదీస్తే, జవాబులు కర్మఫలంలో దొరుకుతాయి కాబోలు! పరిస్థితులు తమ మొనదేలిన గోళ్ళతో రక్కి గాయపరుస్తూంటే మనిషి కర్మ అనుకుని ఉపశమనం పొందుతాడేమో!

అమ్మ పూర్తిగా డీలా పడిపోయింది. చావు కోసమే ఎదురుచూస్తూ బతికేవాళ్ళకి జీవితం గుదిబండలా భారమైపోతుంది. అంత పెద్ద ఇంట్లో అమ్మ ఒక్కతే... తనే ఒక నీడలా కదుల్తూ! చిన్నూ పోయాక అంతా శూన్యం అయిపోయిందంటుంది. అమ్మకి వాడు ఉన్నన్నాళ్ళూ బతికేందుకు ఒక కారణం ఉండేది. అందరూ వాడు ఉన్నా లేకపోయినా ఒకటే అనే నిర్ధారణకి వచ్చేశాక కూడా నాన్న పోయాక అమ్మ వాడికోసమే బతికింది.

ఈ మధ్య అమ్మ దగ్గరకి వెళ్ళినప్పుడు ఆవిడకి అంశూ వేసిన బొమ్మలు చూపిస్తూ "అంశూకి నేను చిన్నూ సంగతి ఏమీ చెప్పలేదు. అసలు చిన్నూ పేరే వాడి దగ్గర ఎత్తలేదు. మరి ఈ చిత్రాలు? " అన్నాను.

అమ్మ దానికి అంత ప్రాధాన్యం ఇవ్వకుండా "నీ మనసులో చిన్నూ ఇంకా ఉండడంవల్లే నీకలా అనిపిస్తూ ఉండచ్చు" అంది.

"వాడికి అదే రాసిపెట్టి ఉందేమో! అలా జరగాల్సి ఉంది, అందుకే జరిగింది..." అంది మళ్ళీ.

నేను అవాక్కయి అమ్మనే చూస్తూ ఉండిపోయాను.

తేరుకున్నాక "ఎందుకమ్మా అలా అంటున్నావు? " అన్నాను.

అమ్మ కొద్దిగా తటపటాయించింది. ముడతలు పడ్డ మొహంలో బాగా అలసినట్టున్న కళ్లని కిందికి దించుకుని "మీ డాక్టర్ బాబాయే చెప్పాడు.. నువ్వు పుట్టిన ఏడాదికి నాకు చక్కెర వ్యాధి వచ్చిందని చెప్పాను, గుర్తుందా? నువ్వు పుట్టాక రావడం మంచిదైంది.. చక్కెర వ్యాధి ఉన్న తల్లికి పుట్టే పిల్లలకి మెదడు..." అంటూ ఉంటే అమ్మ గొంతు పూడుకుపోయి మాటలు రాలేదు.

అయినా నిర్దయగా "అయితే నీకు చిన్నూకి ఇలా జరుగుతుందని ముందే తెలుసన్నమాట" అన్నాను.

"తెలిసినంత మాత్రాన బాధ తగ్గుతుందా? అందుకే వాణ్ణి పుట్టకుండా చేద్దామని చూశాను. అయినా ఇలాటివి కచ్చితంగా ఎవరూ చెప్పలేరు. అలా జరగవచ్చు అని మాత్రమే అంటారు. నిజంగా అలా జరుగుతుందని తెలీదు, జరగదులే అన్న ధీమాతో బతుకుతాం.. పుట్టబోయే బిడ్డ ఆరోగ్యం కోసం నేను చెయ్యని పూజల్లేవు, మొక్కని దేవుళ్ళు లేరు... దేవుడు నా మొర తప్పక వింటాడన్న ఆశ... ఆ ఆశతోనేగా.."

ఈసారి అమ్మ ఏడుపు ఆపుకోలేకపోయింది. అంశూ వేసిన అస్థిపంజరంలాంటి ఆకారాన్నే చూస్తూ 'అమ్మ కూడా నాలాగే పోరాటం చేసింది! ఓడిపోతానని తెలిసీ తలరాతతో పోరాడింది. నేను పోరాడింది పరిస్థితులతో. అశోక్‌ని కోల్పోయాను, నిజమే!.. అమ్మ నాన్నని పోగొట్టుకోడానికి కారణం కర్మఫలం, పరిస్థితులు కాదు. అయినా బాధ మాత్రం ఇద్దరిదీ ఒకటే!' అనుకున్నాను.

జరిగిన వాటికి కొత్త నిర్వచనాలని వెతుక్కుంటూ, మనకి అర్థమయే పరిధిలో వాటిని గ్రహిస్తాం. బాధ అనేది ప్రతి ఒక్కరికీ వేర్వేరుగా ఉంటుంది. దాని అనుభవం, అనుభవించే పద్ధతీ వేరుగా ఉంటాయి. అణువణువుగా.. కొద్దికొద్దిగా.. క్షణ క్షణం బాధతో నలిగిపోతూ, కుంగి కృశించిపోతూ బతకడమనేది ఎవరికి వాళ్ళకి ఒక ప్రత్యేకమైన అనుభవమే..!! C

❑ బెంగాలీ రచయిత శరత్ బాబు తొలి కథ

# కోరేల్

**అనువాదం : ధప్పూరి శ్రీధరాచార్యులు**

అది కోరేల్ అనే ఒక గ్రామం. లండన్ నగరానికి ఉత్తరదిశలో యాభైమైళ్ల దూరంలో వుంది. ఆ గ్రామం పక్కన చిన్ననది. ఆ నది ఒడ్డునానుకుని రెండు పెద్ద బంగళాలున్నాయి. ఆ బంగళాల వల్ల ఆ గ్రామం అందం పెరిగింది.

చూడటానికి రెండు భవంతులు ఒకేలా వున్నా, అక్కడక్కడ తేడాలు కనబడక పోవు. ఒక భవనం విలాసవంతంగా వుంటే, మరొకటి శాంతినికేతనమే. ఒకదానిలో రంగు రంగుల పాలరాళ్లు మెరుస్తుంటాయి. కాని మరొకటి సాధారణంగా ఉంటుంది.

ఆ రెండు భవంతులు సైనిక మిత్రులవి. ఒకతను కెప్టెన్ నోల్. రెండో అతను కల్నల్ నోరింగ్‌టన్. ఇద్దరూ ఉద్యోగాల నుండి విశ్రాంతి పొంది, తమ జీవిత చరమాంకంలో ప్రశాంతంగా గడపడానికి చెరొక భవంతిని కొన్నారు.

కెప్టెన్ నోల్‌కు ఒక్కతే కూతురు. పేరు మేరీ. అలాగే నోరింగ్‌టన్‌కు ఒక్కడే కొడుకు. అతని పేరు లియోపోల్డ్. తల్లి గారాబంగా అతన్ని 'లియో' అని పిలిచేది.

ఒకరోజు అతని తల్లి లియోను తన దగ్గర కూర్చోబెట్టుకుని, భర్త చేతిని తన చేతిలో వుంచుకుని "ఏమండీ! మీరు ఆశీర్వదించండి" అంటూ సూర్యోదయం వేళ ఆమె ఈ లోకం విడిచివెళ్ళిపోయింది.

అప్పుడు లియో పదేళ్ళవాడు. తల్లి చనిపోవటం చూసి అతను ఏడుస్తుంటే, మేరీ తల్లి అతన్ని ఒడిలోకి తీసుకుంది.

అతన్ని బుజ్జగిస్తూ "ఏడవకయ్యా! అమ్మ లేకున్నా నేనున్నాను గదా, అమ్మను. బెంగపడకు" అంది.

లియో కళ్ళు తుడుస్తూ ఏడేళ్ల మేరీ "ఎందుకేడుస్తావు? మేమున్నాంకదా? !" అంది ఆరిందాలా.

నోరింగ్‌టన్ భార్యా వియోగంతో, మూడుముక్కలాటలో మునిగిపోయాడు. సంపాదించిన డబ్బు కరిగిపోవటం ప్రారంభమయింది. దూరప్రాంతంలో వున్న కొడుకు ముఖాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ పోగొట్టుకున్నదాన్ని తిరిగి అక్కడే పొందాలని రెట్టించిన ఉత్సాహంతో మళ్లీ ఆడేవాడు. చిల్లిగవ్వ తిరిగి రాలేదు. మిత్రుని వద్ద యిల్లు తాకట్టు పెట్టి అప్పుగా తీసుకున్న డబ్బు కూడా పోయింది.

చివరకు పూట గడవని భయంకర పరిస్థితిలో చిక్కుకుని, స్వంత తుపాకీతో కాల్చుకుని ఆత్మహత్య చేసుకున్నాడో రోజు. లండన్‌లో చదువుకుంటున్న లియో తండ్రి మరణవార్త విని యింటికొచ్చాడు.

అప్పటికే మేరీ తల్లి చనిపోయి చాలా కాలమైంది. కెప్టెన్ నోల్ ముఖప్రీతిగా లియోకు సాంత్వన తెలిపాడు. పదిహేనేళ్ళ మేరీ, దుఃఖ సముద్రంలో మునిగిన పదిహేడేళ్ల లియోచేతిని పట్టుకుంది.

"లియో! నేనింకా బతికే వున్నాను.

నువ్వేం బాధపడకు" అంది.

లియో ఆమెవైపు తిరిగి అధీరుడై చూస్తుండిపోయాడు.

ఆ ఏడాది లియో, మేరీలకు తీవ్రమైన దుఃఖాన్ని మిగిల్చింది. ఎందుకంటే ఆ తర్వాత జ్వరం వచ్చి కెప్టెన్ నోల్ కూడా మరణించాడు.

మేరీ లియోను కౌగిలించుకుని, అతని ఛాతిపై ముఖంపెట్టి ఏడుస్తూ "లియో! నాకు నువ్వు మాత్రమే మిగిలావు. అమ్మానాన్నలు పోయారు. మీ అమ్మా నాన్నలు కూడా పోయారు" అంది.

లియో స్నేహపూర్వకంగా ఆమె కళ్ళు తుడుస్తూ "మేరీ! నీకు అధైర్యమెందుకు? నేనున్నాను కదా? !" అన్నాడు.

"అయితే లియో ఒట్టు వెయ్యి.. ఎన్నటికీ నా చెయ్యి విడువనని" అంటూ చెయ్యి చాపింది మేరీ.

లియో ఆమె చేతిలో చెయ్యి వేశాడు.

★ ★ ★

లియో స్వయంగా ఓ రచన చేశాడు. లండన్‌లో వున్న మిత్రునికి దానిపై అభిప్రాయం చెప్పమని పంపించాడు. అయితే కొన్ని రోజుల తర్వాత ఆ మిత్రుడు లండన్ నుంచి అయిదు వందల పౌండ్ల నోట్లు పంపిస్తూ ఓ ఉత్తరం రాశాడు-

'మిత్రమా! క్షమించు. నీ రచనను ఓ ప్రచురణకర్తకు ఇచ్చాను. అతను దాన్ని ముద్రించటానికి ఒప్పుకున్నాడు. అయిదు వందల పౌండ్ల ధనమిచ్చాడు. ఆ పారితోషికం నీకు పంపిస్తున్నాను. నీ అనుమతి లేకుండానే యిదంతా జరిగిపోయింది. ఈ పారితోషికం నీ అభివృద్ధికి తొలిమెట్టు కావాలని కోరుకుంటున్నాను.

- నీ మిత్రుడు'

ఆ ఉత్తరం చదివిన మేరీ కళ్ళలో నీళ్ళు తిరిగాయి ఆనందంతో. లియో చెంపపై ముద్దుపెట్టి సంతోషంగా "లియో! నువ్వొక నాడు ప్రపంచ ప్రసిద్ధ కవివి కావాలని కోరుకుంటున్నాను" అంది.

లియో నవ్వి "నేను ఏమి సాధించినా సాధించకున్నా, నా తండ్రి రుణం మాత్రం తీర్చాలని వుంది" అన్నాడు.

మేరీ యిప్పుడు తన ఆస్తికి యజమానురాలు. లియో మాట విని ఆమె సిగ్గుపడి "లియో! నువ్విలా మాట్లాడితే అసలు ఇంకెపుడూ నీ వద్దకు రాను" అంది.

లియో నవ్వి "మేరీ! నా తండ్రి మీ వద్ద చేసిన అప్పును నేను తీర్చాల్సిన అవసరం ఉంది. నేను రుణ విముక్తుడ్ని కావాలి" అన్నాడు.

అప్పట్నుండి లియో రాత్రింబవళ్ళు కష్టపడటం ప్రారంభించాడు. కొత్తపుస్తకం రాస్తున్నాడు. ఆ రోజు ఉదయం నుండి లేవకుండా రాస్తూనే వున్నాడు.

మేరీ వచ్చి అతని రీడింగ్‌రూమ్, డైనింగ్‌హాల్, బెడ్‌రూమ్ అన్నీ చక్కగా సర్దిపెట్టింది. ప్రతిరోజూ ఆ పనులు ఆమే చేస్తుంటుంది. ఇంట్లో యిద్దరుముగ్గురు నౌకర్లున్నా స్వయంగా ఆ పనులను తను చెయ్యకపోతే ఆమెకు తృప్తిగా వుండదు.

లియో కూర్చున్న చోట అతనికెదురుగా పెద్ద అద్దముంది. అందులో లియో ప్రతిబింబం కనబడుతోంది. దాన్ని దీర్ఘంగా చూసిన మేరీ "లియో! నువ్వు ఆడపిల్ల అయ్యుంటే ఎప్పుడో ఇంగ్లాండుకు రాణివై వుండేదానివి" అంది.

లియో బిగ్గరగా నవ్వి "ఎలా? " అన్నాడు.

"ఇంత అందమైన రూపాన్ని చూసి యువరాజు సింహాసనంపై తన పక్కన కూర్చోబెట్టుకునేవాడు. నల్లని తుమ్మెద రెక్కల్లాంటి కురులు, గతంలో ఏ సామ్రాజ్ఞికీ లేని అందమైన ముఖారవిందం, నీ శరీరంలోని సొబగుల ముందు స్వర్గంలోని రంభాది అప్సరస భామలు కూడా దిగదుడుపే. యింకా..."

## 'కోరేల్' పుట్టు పూర్వోత్తరాలు!



సుప్రసిద్ధ బెంగాలీ నవలా రచయిత శరచ్చంద్ర చటర్జీ మొట్టమొదటి రచన 'కోరేల్'. ఇది రాసినప్పుడు ఆయన వయస్సు కేవలం పదహేడు సంవత్సరాలే. అప్పుడతడు బాగల్పూర్‌లోని జూబ్లీ కాలేజియేట్ స్కూలులో పదో తరగతి విద్యార్థి. తాను రాసుకున్న లిఖిత ప్రతి మొదటి పేజీపైన కుడిపక్కన జులై29, 1893 అంటూ అతడు తేదీ నమోదు చేశాడు. బెంగాలీ ప్రముఖ కథా రచయిత సైరేంద్ర మోహన్ ముఖోపాధ్యాయ తర్వాతి కాలంలో శరత్‌బాబు జీవిత చరిత్ర రాశారు. అందులో వారు "నాకు జ్ఞాపకమున్నది. ఆ రోజుల్లో అతడు 'కోరేల్' రాయడంలో నిమగ్నమైవున్నాడు. ఈ రచన పూర్తిగా మరుగున పడిపోయింది. బెంగాలీలో ఎక్కడా ముద్రితం కాలేదు. దీన్ని రాసేటప్పుడు- విదేశీ పాత్రలను తీసుకుని కథ రాస్తున్నాను- అని చెప్పేవాడు. ఇది అతని సొంత రచన. అనువాదం కాదు" అని పేర్కొన్నారు.

'కోరేల్' మూల ప్రతి ఇప్పటికీ సురక్షితంగా ఉంది. 'మొదటిసారి హిందీలో ప్రచురితమవుతున్న శరత్‌బాబు తొలి రచన' అంటూ 1976లో హిందీలో ఈ నవలికకు పుస్తక రూపమిచ్చిన హింద్ పాకెట్‌బుక్స్ ప్రచురణ సంస్థవారు ముఖచిత్రంపై ప్రచురించారు. దీన్ని ప్రబోధకుమార్ మజుందార్ బెంగాలీ నుంచి హిందీ చేశారు. ఈ నవలికలో ప్రేమాధిక్యతలో ఉత్పన్నమయ్యే ప్రతీకార భావం చాలా చక్కగా చిత్రితమైంది. భాష, భావం, సంఘటనలు, అభివ్యక్తి తదితర అంశాలలో 'కోరేల్' కథ ఎంతో వైవిధ్యంగా ఉందని చెప్పవచ్చు.

లియో బిగ్గరగా నవ్వుతూ "కాలేజీలో చాలామంది యిలాగే అంటుండేవారు. నువ్వాడదానివైతే ఎగరేసుకుపోయేవాళ్ళమని" చెప్పాడు.

మేరీ మనసులోనే ఉవ్విళ్లూరుతూ... సిగ్గుపడి నవ్వుతూ "అవును నువ్వు ఆడపిల్లలా బక్క పలుచగా వున్నావు. కోమలమైన శరీరంతో స్త్రీల మాదిరిగా లావణ్యంతో వున్నావు. ఓహ్! నీ సౌందర్యానికి హద్దుల్లేవు"

మేరీ అతని అందం ముందు తననొక క్షుద్రజీవిగా భావించి కించపడింది.

★ ★ ★

కోరేల్ గ్రామంలో ప్రతి సంవత్సరం గుర్రపు పందాలు చాలా వేడుకగా జరుగుతాయి. ఈ రోజు అదే సందర్భంగా గ్రామానికి రెండో వైపున వున్న విశాలమైన మైదానంలో చాలామంది చేరిపోయారు.

మేరీ చప్పుడు కాకుండా వచ్చి, రాసుకుంటున్న లియో వెనకగా నిలుచున్నది. అతడు రచనలో నిమగ్నుడై ఆమెను గమనించలేదు.

"లియో! నేనొచ్చాను.. తిరిగి చూడు"

లియో వెనుదిరిగి చూశాడు. మేరీ చాలా అందంగా అలంకరించుకుంది.

"మేరీ! ఎందుకింతగా అలంకరించుకున్నావు? "

మేరీ నవ్వుతూ "ఇంత అలంకారం ఎందుకు చేసుకున్నానో వింటానంటే చెబుతాను" అంది.

"ఆ! చెప్పు... చెప్పు..."

"ఇవ్వాళ గుర్రప్పందాల పండుగ జరుగుతోంది గదా? ఆ పరుగు పందెంలో విజయం సాధించిన వ్యక్తి గ్రామాధికారిణి అయిన నాకు పూలహారం యిస్తాడు"

"అయితే ఈ రోజు నీకు గొప్ప సత్కారం జరుగుతోందన్న మాట!" లియో చిరునవ్వుతో అన్నాడు.

పులకితురాలైన మేరీ ప్రపుల్ల నేత్రాలతో లియోను కొంతసేపు పరికించి, మిక్కిలి

స్నేహభావంతో తన రెండు చేతుల్ని అతని మెడలో వేసి, ముఖాన్ని ముఖంతో కలిపి, అతని చెవిలో గుసగుసగా "అంతే కాదు, నువ్వు నా దగ్గరుంటావు. నీ పక్కన నిలబడితే నేను అందవిహీనంగా కనబడ కుండా యీ అలంకరణంతా చేసుకున్నా ను. నీకు తెలుసు గదా నగలతో సౌందర్యం ఇనుమడిస్తుందని"

ఎదురుగా వున్న అద్దంలో యిద్దరూ అప్పుడే విరిసిన గులాబీల్లా వెలిగిపోతూ కనిపిస్తున్నారు.

లియో ఆమెను అద్దంలోని ప్రతిబిం బాన్ని చూడమన్నాడు.

మేరీ అసంతృప్త నయనాలతో కొద్దిసేపు అద్దంలోని తమ చిత్రాల్ని చూస్తూ గడి పింది. కాసేపయ్యాక 'ఈ రోజు తను అందంగా వెలిగిపోతున్నాను' అనుకుంది. అంతేగాకుండా ఈ రోజు ఆమెకు నిజం తెలిసి వచ్చింది. అందంతో కూడిన ఏ వస్తువూ కుత్సితంగా వుండదు. సౌం దర్యంలో దాగిన చిన్న దోషం కనిపిం చకుండా పోతుంది.

ఆమె కళ్ళు మూసుకొని "లియో! నేను చందమామలోని నలుపు వంటి దాన్ని. అయినా నాలో యింత అందమా!"

లియో ప్రేమతో ఆమె ముఖాన్ని దగ్గ రగా తీసుకొని "నోర్మూసుకో. నువ్వు నాలో కళంకానివి కాదు. నాలో ఓ భాగానివి, వెన్నెల్లో వికసించే కమలానివి" అన్నాడు.

మేరీ కళ్ళు తెరిచే సాహసం చేయలేదు. అలాంటి స్థితిలో ఎంత కాలమైనా వుండి పోయేదే. కాని హఠాత్తుగా చర్చి గంటలు మోగుతూ ఒంటిగంటైనట్లు సూచించి, ఆమెను తొందరపాటుకు గురిచేశాయి.

మేరీ లేచి నిలబడుతూ "పద! మనం త్వరగా వెళ్ళాలి" అంది.

"నాకు రావటం కుదరదు"

"ఎందుకు కుదరదు!? " అడిగింది.

"ఈ పుస్తకాన్ని అయిదు రోజుల్లో పూర్తి చేసి యిస్తానని మాట యిచ్చాను. మాట తప్పటం బాగుండదు"

"ఈ విధంగా కష్టపడుతూ నిన్ను చావ నియ్యను"

"మేరీ! నేను తండ్రి రుణంలో మునిగి వున్న వాణ్ణి. దాని నుంచి నివృత్తి ముఖ్యం నాకు. దానికోసం ఎంతైనా శ్రమిస్తాను"

అతని మనోభావాన్ని గ్రహించిన మేరీకి ఆగ్రహం కలిగింది.

"నీ పుస్తకాన్ని నాకు అమ్మెయ్యి. రెండు రెట్ల పారితోషికం యిస్తాను" అంది.

లియోకు ఆమెపై సందేహం లేదు. అత డు నవ్వుతూ "ఈ పుస్తకం తీసుకొని ఏం చేస్తావు? " అన్నాడు.

మేరీ మరింత ఆవేశంతో తన మెడలోని ముత్యాల హారాన్ని చూపి "యిందులోని ముత్యాలతో ఆ పుస్తకాన్ని అలంకరించి పెట్టెలో పెట్టి పందిరి మంచంపై నా త లాపున వుంచుకొంటాను. తర్వాత... తర్వాత..."

"ఆ! తర్వాత? " అన్నాడ లియో.

సిగ్గుతో రక్తం పొంగుకొచ్చిన ముఖాన్ని కొద్దిగా వంచి "ఆ తర్వాత ఏరోజురాత్రి పెద్ద చందమామ ఉదయించి నిద్రించే నీ ముఖంపై వెన్నెల కిరణాలు ప్రసరింపజే స్తుందో... ఆ రోజు..."

"ఆ! ఆ రోజు... చెప్పు"

"ఆ రోజు చాతక పక్షి పెద్ద స్వరంతో పాడుతుంది. అయినా నీకు నిద్రాభంగం కాదు. నేను నీ చెవుల దగ్గర కూర్చుని.." పెద్దగా నవ్వింది మేరీ.

లియో ఆమెను ఉడికించే స్వరంతో "నా చెవుల దగ్గర కూర్చొని పుస్తకంలోని విష యమంతా చదివేస్తావన్నమాట" అన్నాడు.

మేరీ అవునన్నట్లు తలాడించింది.

"అయితే నేను నిద్రలేచి, ఇదిగో యిలా నీ ముఖాన్ని ముద్దులతో నింపుతాను"

అంటూ ఆమె ముఖమంతా ముద్దులతో నింపాడు.

ఇద్దరూ ఒకేసారి పగలబడి నవ్వారు తమ చర్యలకు.

గడియారంలో ఒకటిన్నరయింది.

"మేరీ! ఆలస్యమవుతోంది.. నువ్వు బయలుదేరు" అన్నాడు లియో.

మేరీ స్థిరంగా కూర్చుంటూ అంది "ఈ రోజు నా ఆరోగ్యం బాగాలేదు. ఎక్కడికీ వెళ్ళను"

"అలా ఎలా కుదురుతుంది? వాళ్ళకు వస్తానని మాట యిచ్చావు. వెళ్ళకుంటే బాగుంటుందా? వాళ్ళంతా నీ కోసం ఎదురుచూస్తుంటారు, వెళ్ళు"

మేరీ మరీ స్థిరంగా చెప్పింది "వెళ్ళకుండా మాటతప్పితే, నీలాగ నాకేం సిగ్గనిపించదు. ఆ! నేను వెళ్ళనుగాక వెళ్ళను"

"ఛీ.. ఛీ.. యిలా మొండితనం బాగాలేదు.. వెళ్ళమ్మా!"

"అయితే నువ్వూ నాతో రా"

"సాధ్యపడితే వచ్చేవాడిని గదా? "

"అసాధ్యమేం కాదు. పద, సాధ్యమే"

"సాధ్యం కాదు. నాకు రావడానికి వీలు పడదు" కచ్చితంగా చెప్పాడు లియో.

మేరీ లేచి నిలబడింది. "ఇక నేనెన్నడూ ఇక్కడికి రాను" అంది.

లియో నవ్వుతూ "నాకు తెలుసు.. నువ్వు తప్పకుండా వస్తావు" అన్నాడు.

మేరీ కోపంగా "నేను రాకపోతే, నువ్వు నీ తిండీతిప్పలు కూడా పట్టించుకోవు. నా మనస్సు లాగుతుంది. లేకపోతే రెండు కాదు నాలుగు రోజులైనా నీ ముఖం చూసేదాన్ని కాదు" అంది.

"నీకు అంత ధైర్యం లేనప్పుడు, ఇలా కోప్పడటంలో అర్థమేముంది!"

ఈ విషయంలో మేరీకి ఏమాత్రం సందేహం లేదు. బయటికి వచ్చి బండిలో కూర్చొని ఆలోచిస్తోంది. చిన్నప్పుడు ఆమె

చదువుకున్ననాటి సంగతులు, ఇతర విష యాలు జ్ఞప్తికి వస్తోంటే ఆమెకు ఏమంత సంతోషకరంగా లేదు.

బండి ముందుకు సాగడంతో మెల్లమె ల్లగా ఆమె కోపం కూడా తగ్గిపోయి, లియోపై ప్రేమ పెరిగిపోసాగింది.

★ ★ ★

రెండు గంటలకు కొంచెం ముందు, మేరీ ఎక్కిన అందమైన గుర్రంబండి ఆ మైదానం వద్దకు చేరుకుంది. అది చూసిన మైదానంలోని జనం ఆనందంతో కేరిం తలు కొట్టారు. ఆమె అందమైంది. పైగా అవివాహిత యువతి. చాలా ధనవంతు రాలు కూడా. గ్రామాధికారి పీఠం ఆమె కోసం నిరీక్షిస్తోంది. ఆమె ఈ రోజు పూల హారాలు పంచుతుంది. విజేత చేతి నుండి ఆమె మాల అందుకోనుంది. అంతకంటే భాగ్యవంతులెవరుంటారు?

నిర్వాహకులు వచ్చి ఆమెను సాదరంగా ఆసనం వైపు తీసుకువెళ్ళారు.

పోటీలో పాల్గొనే గుర్రాల్ని ఎర్రని వస్త్రా లతో అలంకరించారు. పందెంలో పాల్గొనే యువకులంతా ఉత్సాహంతో గుర్రాల క ళ్లేల్ని పట్టివుంచి, సమయం కోసం ఎదురు చూస్తున్నారు. వాళ్ళను, వాళ్ళలోని వుత్సాహాన్ని చూస్తుంటే ఏకబిగిన పర్వ తాల్ని లంఘించేలా వున్నారు.

మేరీ రాకతో ప్రారంభసమయం కూడా అయింది. ప్రారంభాన్ని సూచిస్తూ తుపాకి పేల్చారు.

అశ్వాల్ని అదిలించారు. కళ్లేల్ని బిగబట్టి గాలితో పోటీపడి గుర్రాల్ని పరుగెత్తిస్తు న్నారు యువకులు.

ఒక్కో అశ్వికుడు మేరీ దగ్గరికొచ్చి, కళ్ళెం వదులు చేసి ఆమె చేతినుండి మాల నందుకుని, మరుక్షణం గాలికంటే వేగంగా అశ్వాన్ని పరుగులు తీయిస్తున్నాడు.

వారికి ఏమాత్రం సమయం లేదు. ప్రా ణాలకు తెగించి విజయాన్ని అందుకునేం దుకు పరుగులు తీస్తున్నారు. ముందుగా తిరిగొచ్చి మాలను ఆమె చేతికి ఇచ్చిన వాడే విజేత.

'ఈ రోజు నన్ను చేరుకోవడమే వారి లక్ష్యం. వాళ్ళు నన్ను సమీపించటానికి ప్రా ణాలు కూడా వదులుకుంటారు' అని యవ్వన చపలత్వంతో ఆలోచిస్తోందామె.

అశ్వాలు పరుగెడుతున్నాయి. అంద రిలోనూ వుత్కంఠే.

ఎవరో అరుస్తున్నారు. "డేవిడ్ విజయం సాధిస్తాడు"

మరెవరో అంటున్నారు. "కాదు... కాదు... చార్లెస్ విజయం సాధిస్తాడు. అదుగో డేవిడ్‌ను దాటి ముందుకుపోతు న్నాడు"

మెరుపుకంటే వేగంగా అందరూ పరు గులు తీయిస్తున్నారు.

"డేవిడ్ వెనక పడిపోయాడు. చార్లెస్ ముందుకు దూసుకుపోతున్నాడు. అదిగో.. చూడండి.." అంటూ అరుస్తున్నారు.

అంతలో అందర్నీ దాటేసి చార్లెస్ అశ్వాన్ని వేగంగా పరుగెత్తిస్తూ వచ్చి పుష్ప మాలను మేరీ పాదాల దగ్గర వదిలాడు.

పెద్ద కోలాహలం.. చప్పట్లు.. జయ ఘోష... భూమ్యాకాశాల మధ్య వ్యాపిం చాయి.

చార్లెస్ మొదటివాడుగా వచ్చాడు. మేరీ అతనితో చేయి కలిపి అభినందించింది.

తర్వాత రెండో పరుగు ప్రారంభం. అందరూ అశ్వాలనధిరోహించి కళ్ళేలు బిగించి పట్టుకున్నారు. పిస్తోలు పేలింది. ఛడీతో గుర్రాలపై దెబ్బలు పడ్డాయి. అవి యజమాని మనసు తెలిసి పరుగులు ప్రారంభించాయి.

ఈసారి చార్లెస్ అజాగ్రత్తగా కింద పడిపోయాడు. వెనక వచ్చే గుర్రం వేగంగా అతని కాళ్ళను తొక్కుతూ వెళ్ళిపోయింది. దగ్గర నుంచి చూసేవాళ్ళంతా హాహాకారాలు చేశారు. వాళ్ల అరుపులు ఆగకముందే చార్లెస్ వేగంగా ఒక గెంతు గెంతి అశ్వం మీద కూర్చున్నాడు. కాలికి బలమైన దెబ్బ తగిలినప్పటికీ అతడు దాన్ని లెక్కజేయకుండా అశ్వాన్ని వేగంగా పరుగెత్తించాడు.

మేరీ భయపడిపోయింది. 'ఒకవేళ అతడు గుర్రాల కాళ్ళకింద నలిగిపోయి వుంటే...? ' అనుకుంది.

స్వాభావికంగా ఆమెది స్త్రీ హృదయం. అందులోనూ మేరీ మనసు చాలా మెత్తన. కష్టాలను చూసినపుడు ఆమె వెనువెంటనే స్పందిస్తుంది. మరోకారణం ఆమె వంశ గతం. చిన్నప్పట్నుంచీ ఆమెకు వీరత్వం అంటే అభిమానం. తండ్రి, తాత.. వాళ్ల వంశంలో చాలామంది యోధాగ్రేసరులే. తండ్రి ద్వారా చిన్నప్పుడు వీరుల కథలు చాలా విన్నది. గుర్రపుస్వారీ యుద్ధంలో ఒక భాగం. అందులో పట్టుదల, సాహసం, సహనశక్తి అత్యవసరమవుతాయి. యుద్ధానికి సంబంధించిన ప్రతివిషయమూ ఆమె దృష్టిలో గౌరవప్రదమే. గౌరవంకోసం వీరులు ప్రాణాలు అర్పించడానికి ఎప్పుడూ సిద్ధంగా వుంటారు.

ఈ రోజు పొందే గౌరవం కోసం చార్లెస్ తనకు తగిలిన గాయాన్ని లెక్కచెయ్యలేదు. అవసరమైతే ప్రాణాలు కూడా యిచ్చేవాడు. ఆ ఆలోచనే ఆమెను భయకంపితురాల్ని చేసింది. అతని ప్రాణాలు పోయి వుంటే!? అన్న ఆలోచనతో మేరీ చకితురాలైంది. చార్లెస్ క్షేమంగా తిరిగిరావాలని ప్రభువును ప్రార్థించింది.

మైదానంలో పెద్దకోలాహలం ప్రారంభమైంది. ఏమైందనే ఉత్సుకతతో దుర్భిణులు పట్టి చూడసాగారు. చార్లెస్ తిరిగి ప్రథముడిగా విజయపథం వైపు దూసుకుపోతున్నాడు.

అంత తక్కువ సమయంలోనే మేరీ హృదయంలో చార్లెస్‌పై ఆత్మీయతా భావం పెరిగింది. అతను చూపిన ధైర్యసాహసాలను మేరీ తనకు తాను ఎంతో గొప్పగా భావించుకోసాగింది.

చార్లెస్ గెలిచాడు.

మేరీ తన మెడలోని లాకెట్ తీసి అతని మెడలో వేసి "చార్లెస్! నిజంగా ఈ గ్రామానికి నువ్వు రత్నానివి. నీలాంటి సాహసి మరొకరు లేరు" అంది.

చార్లెస్ చిరునవ్వుతో తన వక్షాన్ని మరింత పెంచాడు. మేరీకి హృదయపూర్వక ధన్యవాదాలు తెలిపాడు.

ఆ రాత్రి మేరీ గొప్ప పార్టీ ఏర్పాటు చేసింది. అందర్నీ ఆహ్వానించింది. ఆమె యింటి వద్ద సాయంత్రం విందు కార్యక్రమం ప్రారంభమైంది.

భోజన సమయంలో చార్లెస్ పక్కన మేరీ కూర్చుని మృదుస్వరంతో "నీ గురించి నేను చాలా భయపడ్డాను" అంది.

చార్లెస్ చిరునవ్వుతో "ఎందుకని? " అన్నాడు.

"చాలా పెద్ద గాయమయింది. అయినా నువ్వు గుర్రంపై స్వారీ చేశావంటే, అది నీకు మాత్రమే సాధ్యమయింది"

చార్లెస్ చాలా వినయంగా "నా గాయం తగ్గిపోయింది. నా గురించి మీకు దుఃఖం

కలిగిందంటే నేను దాన్ని ఎంతో అదృష్టంగా భావిస్తున్నాను. ఇంతటి దయను, ప్రేమను నేనెప్పుడూ పొందలేదు. మీ అభిమానం పొంద టానికి నా కాలు తెగిపడినా ఫర్వా లేదు. నాకే మాత్రం బాధ కలగదు"




ఆ రోజు రాత్రి చాలా సేపటి వ రకు పార్టీ నడి చింది. షాంపేన్ బాటిల్స్ మైదానం నిండా పరుచుకున్నాయి.

ఆ రాత్రి చా లా సేపు లియో తన రీడింగ్ రూమ్ కిటికీ వద్ద నిలబడి మేరీ యింటిలో జరుగుతున్న పార్టీని చూస్తూ దుఃఖించాడు. ఆ ఇంటినుండి వెలువడుతున్న అపస్వరాలు వింటూ వుండిపోయాడు. చివరకు కిటికీ మూసి వచ్చి పడకపై మేను వాల్చాడు. ఆ రోజు రాత్రి అతని మనస్సు చాలా బాధపడింది.

రెండో రోజున మేరీ, లియోతో "నిన్న మా ఇంట్లో బ్రహ్మాండమైన పార్టీ ఇచ్చాను. నీకెలాగూ వీలు కాదని పిలువలేదు" అంది.

లియో కలాన్ని యింక్ బాటిల్ పై ఉంచి "చాలా మంచిపని జరిగింది. అయినా నిన్న రాత్రి నా పనేమీ ముందుకు సాగలేదు. అంతా వ్యర్థమయింది"

లియో ముఖంలోకి చూస్తూ "పని ఎందుకు కాలేదు? " అంది మేరీ.

లియో తిరిగి కలాన్ని చేతిలోకి తీసుకుని, పుస్తకంలోకి చూస్తూ "ఇలాంటి విషయాన్ని గురించి చర్చిస్తే లాభం ఏమీ వుండదు. కారణం నేను చెప్పలేను" అన్నాడు.

లియో నుండి యిలాంటి మాటలను మేరీ తన జీవితంలో మొదటిసారిగా విన్నది. ఆశ్చర్యంగా "ఏం? ఎందుకని? " అడిగిందామె.

"కారణం తెలియదు. కానీ మనస్సు మాత్రం బాగాలేదు" అన్నాడు లియో.

ఆ తర్వాత మేరీ చాలా సేపు కూర్చుంది. చాలా విషయాలు మనస్సులోనే తలుచుకుంది. కానీ లియో తిరిగి తల ఎత్తలేదు. ఒక్కమాట కూడా మాట్లాడలేదు.



చార్లెస్ రాకలో పెద్ద విశేషం ఏమీ లేదు. నిన్న రాత్రి యిచ్చిన విందుకు ధన్య వాదాలు తెలుపడానికి వ చ్చాడు.

మేరీ గదిలోకి ప్రవేశించగానే, చార్లెస్ చాలా ఆదర భావంతో లేచి నిల్చున్నాడు. మేరీ అతనితో చేయి కలిపి కూర్చోమని, తానూ కూర్చుంటూ, వచ్చిన కారణం ఏమిటని అడిగింది.

కారణం ఏదైనా వారిద్దరి సంభాషణ మరోవైపు సాగిపోయింది. అతడు మేరీని హృదయపూర్వకంగా అభినందించాడు.

మేరీ దగ్గర సంపద వుంది. డబ్బు, దస్కం వుంది. సమాజంలో ఆమెకు చాలా గౌరవం వుంది. అంతే కాకుండా ఆమె అభిజాత్యంగల యువతి. పైగా ఆమె తండ్రి గొప్ప యుద్ధవీరుడు. సహృదయుడైన మంచి మనిషి.

రాజదర్బారులో ఆయన వంటి వ్యక్తి గౌరవం పొందాలంటే అతనిలో గొప్ప బుద్ధి, వివేచనాశక్తి, రాజనీతి తెలిసిన వాడై వుంటేనే సాధ్యపడుతుంది. ఈ గుణగణాలన్నీ ఆమె తండ్రిలో వున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఈనాటి సమాజంలో ఆయన వంటి యోగ్యుడైన వ్యక్తి లభించడం దుర్లభం.

చార్లెస్ చెప్పిన విషయాలన్నీ ఆమెకు బాగా నచ్చాయి. ఇంకా చార్లెస్ చెప్పిన చివరి మాటలు మరింత ఇష్టమయ్యాయి.

మేరీ బయలుదేరుతూ "నేను వెళ్తున్నాను" అంది.

"సరే" అన్నాడు లియో.

వెళ్ళే సమయంలో ఆమె అనుకుంది. 'లియో భావాన్ని అర్థం చేసుకున్నానని. కానీ ఎలా ప్రతిస్పందించాలో ఆమెకు తెలియలేదు.

ఆమె తన ఇంటికి చేరేసరికి నౌకరు ఓ విజిటింగ్ కార్డ్‌తో వచ్చి "చార్లెస్ బయట చాలా సేపట్నుండి ఎదురుచూస్తున్నాడు" అన్నాడు.

మేరీ కనుబొమలు ముడి వేస్తూ "ఎందుకట? " అంది.

"తెలియదమ్మా! నేనడగలేదు. అడిగి రానా? "

"వద్దు. నేనే స్వయంగా వెళ్తున్నాను"

మేరీ అందాన్ని, ఆమె యవ్వనాన్ని అతడు గొప్పగా ప్రస్తుతించాడు. పురుషుని నోట అందచందాల గురించిన ప్రశంస పొందిన స్త్రీ ఎంతో తృప్తి పొందుతుంది. అలాంటి విషయాలు తప్ప మరొకటి ఆమెకు నచ్చవు. ఇలాంటి ప్రసంగాలతో మేరీ మది పులకించిపోయింది. ఇద్దరూ కాలం తెలియకుండా మాటల్లో మునిగిపోయారు.

గడియారం కొట్టిన రెండు గంటల శబ్దంతో వారిద్దరూ ఈలోకంలోకి వచ్చారు. చార్లెస్ ఆమె నుండి సెలవు తీసుకుని వెళుతూ, ఆమె నుండి ఆ రాత్రికి భోజనానికి రావల్సిందిగా మళ్లీ ఆహ్వానాన్ని కూడా పొందాడు.

అతను వెళ్ళిపోయిన తర్వాత అంత వరకు తనపై చార్లెస్ కురిపించిన ప్రశంసల వర్షపు జల్లుల ప్రభావం మెల్లమెల్లగా జారిపోయింది. ప్రశంసల జల్లులో తడిసిపోయి రాత్రి భోజనానికి అతన్ని ఆహ్వానించడం స్వాభావికంగా భావించింది.

రాత్రికి అతనొస్తాడు. అతన్తోబాటు భోజనం చేయాలి. ఎన్నో విషయాలు మాట్లాడుకునే అవకాశం లభిస్తుంది. అయితే ఆమె మనస్సు అభావంలో పడిపోయింది.

ఈ విషయం బయట తెలిస్తే? వెంటనే ఆమె ఓ కాగితం తీసుకుని "సాయంత్రం రావద్దు. నా ఆరోగ్యం బాగాలేదు" అంటూ రాసింది. కానీ ఆ లేఖను చార్లెస్‌కు పంపటానికి సంకోచించింది. తిరిగి అందులో "ఒకవేళ నువ్వు వస్తే నీతో బాటు మరో యిద్దరుముగ్గురు మిత్రుల్ని కూడా తీసుకు నిరా" అని దానికి జోడించింది.

నౌకరు లేఖను తీసుకుని వెళ్ళిపోయాడు.

వద్దనుకుంటూనే ఆ రోజు రాత్రి చార్లెస్ తనతోబాటు మరో ముగ్గురు మిత్రుల్ని తీసుకుని వచ్చాడు.

భోజన కార్యక్రమం ముగిసిన తర్వాత చార్లెస్ మిత్రులు ఆమెను ఓ పాట పాడి వినిపించాల్సిందిగా ప్రార్థించారు.

మేరీ పియానో మెట్లు మీటుతూ పాట ప్రారంభించింది. వారిలో ఉత్సాహం పెరిగింది. పాటతోబాటు ఆట!, ఆటతోబాటు మదిర!

గానాబజానా తారస్థాయికి చేరిపోయింది. ధ్వని తరంగాలు లియో గదిలోకి ప్రవేశిస్తున్నాయి. ఆ ధ్వనులు అతని చెవుల్లో ప్రతిధ్వనించసాగాయి. అయినా అతనీరోజు గది కిటికీ మూసివేశాడు.

పాడుతూ... పాడుతూ... ఆమె గొంతు మూగపోయినా మదిరాపానంలో మునిగి తేలే చార్లెస్, అతని స్నేహితులు చేసే ప్రశంసలకు ఓపిక తెచ్చుకుని పాటలు పాడింది మేరీ. ఆ రాత్రి చాలాసేపు అలాగే గడిచిపోయింది.

విందు తర్వాత మేరీ పడకపైకి చేరింది. ఆమెకు నిద్రరాకుండా ఆలోచనలు చుట్టుముట్టాయి. చాలా విషయాలు ఆలోచించింది. పాటలు విన్నవాళ్ళు ఎంత ప్రశంసించారు! పూలమొగ్గల్లాంటి ఆమె వేళ్ళు పియానోమెట్లపై పరుగెడుతుంటే వాటికున్న వజ్రపుటుంగరాల్లోని మెరుపులు, ఆ వేళ్ల అందం గురించి ఆలోచిస్తుంటే, వాటికంటే ఎక్కడో వున్న అందమైన వేళ్ళు

ఆమె కళ్లముందు మెరిశాయి.

పూలల్లో వుండే మకరందం కోసం తేనె టీగలు తిరగడం సహజం. దానికి తానేం చెయ్యగలదు? యవ్వనంలో కొత్తకొత్త బంధాలు ఏర్పడటం సహజం. ఇష్టం వున్నా లేకున్నా కొన్ని సంబంధాలు కొనసాగించాల్సి వస్తుంది. దుఃఖం, ఉద్వేగ భావాలతో ఆ రోజు రాత్రి మేరీ నిద్రలోకి జారుకుంది.

రెండో రోజు మేరీ లియో దగ్గరకు వెళ్ళి కూర్చున్నది. లియో రాసుకుంటున్నాడు. అతను ఒక్కసారి కూడా తలెత్తి ఆమె వైపు చూడలేదు. చాలాసేపటి వరకు మేరీకేమి తోచలేదు. ధైర్యం కూడగట్టుకుని "నీ పని యింకెంత మిగిలివుంది? " అంది.

"చాలా"

"రెండుమూడు రోజులుగా రాసిందే మిటో వినిపించు, వింటాను. ఆ మాటతో కలం రాయడం ఆగిపోవడంతో, కలం చివర పేరుకున్న సిరాచుక్క కాగితం పైన పడింది. లియో పుస్తకాన్ని పక్కకు జరి పాడు. కలం ముడిచివేస్తూ "మేరీ! నీ నోట్నుండి మద్యం వాసన వస్తోంది. దాన్ని సహించడం నావల్ల కాదు. దూరంగా వుండు. నువ్వు ఇంత దగ్గరగా వుంటే పొరబాట్లు జరిగిపోతాయి" అన్నాడు.

క్షణంలో మేరీ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "నేను నువ్వనుకున్నంతగా మద్యం సేవిం చలేదు"

"కావచ్చు. కానీ నీ దగ్గర్నుంచి వచ్చే ఈ మాత్రం వాసనను కూడా నేను తట్టుకోలే కపోతున్నాను. పక్కకు జరిగి కూర్చో. లేదా యింటికి వెళ్ళు"

మేరీ లేచి నిలబడింది. ఆమె చాలా గారాబంగా పెరిగింది. ఇలాంటి మాటలు ఆమె ఎన్నడూ పడివుండలేదు. లియో చేసిన అవమానం ఆమెకు బాధ కలిగిం చింది. శరీరమంతా అవమానభారంతో, క్రోధంతో నిండిపోయింది. మోసగాడు, కృతఘ్నుడు వంటి రెండు పరుషమైన మాటలు అనాలనుకుంది. అవి అతని హృదయంలో బాకులా దిగబడాలను కుంది. కానీ పైకిలేచి నిలబడుతూనే ఆమె లోని శబ్దభాండాగారం శూన్యమైంది. కను బొమలు ముడిబడ్డాయి... కళ్ళు విశాలం చేసి... పళ్ళ మధ్య పెదవి కొరుక్కుంది. కానీ ఒక్క శబ్దం కూడా ఆమె నోటినుంచి వెలువడలేదు.

ఎదురుగా వున్న అద్దంలో లియో ఆమె ప్రతిబింబాన్ని చూశాడు. అతడు ఆమెకు దగ్గరగా వచ్చి ఉన్నతమైన ఆమె భుజంపై చేతిని ఉంచి "అవమానం అనిపించిందా? " అన్నాడు.

అప్పుడు మేరీలో తన స్వాభిమానాన్ని గుర్తించే శబ్దం దొరికింది. "నువ్వు చాలా చిన్న మనిషివి, నిజంగా నువ్వు బోన్సాయి వృక్షానివి. కాబట్టే నన్నింతగా అవమానిం చావు" కఠినంగా అంది మేరీ.

లియో మెల్లగా పక్కకు జరుగుతూ "మేరీ! నేను ఇలాంటి అగౌరవపు మాటల ను ఏమాత్రం సహించలేను. ఇంకెప్పుడూ ఇలాంటి మాటల్ని నీ నోటి నుంచి రానీ యకు. నువ్వు పాతాళంలోకి జారిపోతు న్నావు. అందుకే నిన్ను హెచ్చరించదలచు కున్నాను. దానికి బదులుగా నువ్వన్న హృదయాన్ని గాయపరిచే ఈ వ్యాఖ్యలు..."

మేరీ మరింత కృద్ధురాలై "నేను ఎలా దిగజారుతున్నానో చెప్పు? " అడిగింది.

"నాకలాగే అనిపిస్తోంది. ఒక గొప్పింటి ఆడబడుచు అంత రాత్రి అయ్యేవరకు ఏకాంతంగా వాళ్ళతో ఆటపాటలతో గడ పడం సహించరానిది. లోకులు కూడా ఏమనుకుంటారు? "

"మళ్ళీ లోకుల చర్చా? " మేరీ రగిలిపో

యింది.

"నిజంగా లోకులు ఏదీ పట్టించుకోరు తెలుసా? నాకే విషయంలోనూ కొదవ లేదు. సమాజానికి భయపడాల్సిన అవసరం అంతకంటే లేదు" హేళనా పూర్వకంగా నవ్వుతూ, తిరిగి మళ్ళీ తనే "నా తండ్రి నాకు అన్యాయం చెయ్యలేదు. ఎన్నో యిచ్చిపోయాడు. ధన, వస్తు సంపద కలిగిన నేను యిద్దరుముగ్గురు అతిథులకు ఆతిథ్యమిస్తే వేలెత్తిచూపే సాహసం ఎవరికీ లేదు" అంది.

మేరీ ఇలా అంటుందని లియో ఊహించలేదు. కల్పన కూడా చేసివుండలేదు. ఆమెలో ఎంత స్నేహం? ఎంత దయ? మరి ఇపుడు ఆమెలో యింత విషమా? నిస్తబ్దంగా, ప్రాణం లేని మనిషిలా కూర్చుండిపోయాడు. ఆమెకు చెప్పాల్సిన జవాబుగాని, ప్రతివాదం చేయటానికిగాని ఏమీ తోచలేదు.

క్రోధంతో బుసలు కొడుతూ మేరీ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది. అతను చూస్తూ వుండి పోయాడు. ఆమెను వెనక్కి పిలిచే ప్రయత్నం చెయ్యలేదు. కానీ రెండు మాటలు మాట్లాడితే బాగుండేదేమోననుకున్నాడు.

మేరీ తనగదిలోకి వస్తూనే చేతిగుడ్డ ముఖంపై కప్పుకుని సోఫాలో కూర్చుండిపోయింది. కోపంతో శరీరమంతా మండిపోయింది.

అప్పుడే నౌకరు వచ్చి "అమ్మా! బయటి గదిలో చార్లెస్ మీకొరకు ఎదురు చూస్తున్నాడు" అని చెప్పాడు.

వెంటనే మేరీ ముఖం మీది గుడ్డ తొలగించి అగ్గిమీద గుగ్గిలం అవుతూ "అతన్ని అక్కడ్నుంచి తరిమెయ్యి వెంటనే" అంది.

నౌకరు విస్మితుడౌతూ బయటకు వెళ్ళిపోయాడు.

నౌకరు చార్లెస్ వద్దకు వచ్చి "బాబూ! ఇప్పుడు దొరసానితో భేటీకి అవకాశం లేదు. అమె ఆరోగ్యం బాగాలేదు" అని చెప్పాడు.

చార్లెస్ ఉత్కంఠతో చాలా ప్రశ్నలు వేశాడు. "ఎప్పట్నుండి ఆరోగ్యం బాగా లేదు? ఎప్పటికల్లా బాగవుతుంది?"

కానీ నౌకరు నుండి ఎలాంటి జవాబూ రాలేదు. ఇంతకుముందే యజమానురాలి గదమాయింపులు విన్నాడు. అతనికేం అర్థం కాలేదు. అందుకని "అయ్యా! ఆ విషయాలన్నీ నాకేం తెలియవు"

నిరాశతో చార్లెస్ నౌకరు చేతికి పూలగుత్తి యిచ్చి "తర్వాత నేను ఇచ్చినట్లుగా దీన్ని ఆమెకు అందించు" అన్నాడు.

"అలాగే.. ఆమె కిందకు వచ్చినప్పుడు ఇస్తాను" అంటూ దాన్ని మేజాబల్లపై ఉంచాడు.

★ ★ ★

దగ్గర దగ్గరగా నెలరోజులు గడిచిపోయాయి.

ఎవరినీ ఎవరూ కలువలేదు. మేరీ తన బాల్య మిత్రునిపైనున్న మమతను మెల్లమెల్లగా చంపుకుంది. ఇప్పుడతనిపై ఆమెకెలాంటి ప్రేమ, స్నేహం వంటి మోహాలు లేవు.

ఈ నెల రోజుల్లో ఈ బంధాల్ని గురించి రాత్రింబవళ్ళు ఆలోచించింది. ఎంతగా ఆమె ఆలోచిస్తుందో అంతకంటే ఎక్కువగా తన్నుతాను మోసగించుకొంటోంది. ఒక్క రోజు కూడా ఆమె తన హృదయకుహరంలోకి తొంగిచూసుకోలేదు. ఒకవేళ ఆమె ఏ మాత్రం ప్రయత్నించి చూసినా పరిస్థితి వేరుగా వుండేది. కానీ ఆమె లియోకు తనకు మధ్య ఉన్న కలహాన్ని మాత్రమే చూస్తోంది. పైగా దీన్ని ఇంకా ఎలా పెద్దది చెయ్యొచ్చా? అని ఆలోచిస్తోంది.

ఈ మధ్య మళ్ళీ రెండుసార్లు భవ్యమైన విందుభోజనాలు జరిగాయి. వాటికి అయి




న ధన వ్యయాన్ని చూసి గ్రామస్థులు పెద్దఎత్తున ప్రశంసలు కురిపించారు.

అయినా మేరీ మనస్సు కుదుట పడలేదు. ఇంకా వెలితి. ఇవన్నీ చూసి, విని లియోముఖం ఎంతగా మాడిపోయిందో ఆమెకు కావాలి. అతని మానసిక దుస్థితి తెలియాలి. అతడు బాధ పడినప్పుడే తను చేసిన ఖర్చుకు ఫలితముంటుంది. ఈ డబ్బు ఖర్చుకు కారణం లియోనే. అతన్ని బాధించడమే ఆమె ఉద్దేశ్యం.

కానీ ఆమెకు నమ్మిక చిక్కలేదు. తన ప్రయత్నంలో సాఫల్యం పొందలేదని భావించింది.

అందుకోసం ఆమె మళ్ళీ చాలా పెద్ద ఎత్తున పార్టీ ఏర్పాటు చేసింది. రాత్రంతా పార్టీని కొనసాగించాలని ఆదేశించింది.

మేరీ ఓ పక్కన కూర్చొని ఆలోచిస్తోంది. లియో నిద్ర పోకుండా ఉత్సవాన్ని గమనిం

చవచ్చు. కిటికీ తెరిచి పరిశీలిస్తుండ వచ్చు. అనే ఆమె భావనలు యదార్థం కాలేదు. లియో ఎప్పుడో కిటికీ మూసేసి గాఢనిద్రలో మునిగిపోయాడు.

మేరీ ఆక్రోశించింది. తను చేసిన ఖ ర్చంతా వృథా అయిపోయింది. అది లి యోను గడ్డిపరకంత కూడా కదిలించలేక పోయింది.

పుండు మీద కారం రాసినట్లుగా ఉంది మేరీకి. ఆమె శ్రీమంతురాలు. తన దగ్గ రవున్న సంపదలో పరకంత కూడా లియో దగ్గరలేదు. సమాజంలో తనకున్న ఖ్యాతి, పేరుప్రతిష్ఠలు లియోకు లేవు. అతన్ని గుర్తించేవారే లేరు. కానీ అతడున్నంత ఎత్తుకు చేరడానికి మేరీకి సాధ్యం కాకుండా ఉంది. అతనివంక కన్నెత్తి చూసే స్థైర్యం కూడా లేదు. ఇంత చేసినా కనీసం అతడు ఆమె వైపు కన్నెత్తి కూడా చూడడం లేదు.

మేరీ మండిపోతోంది. కోపంతో ఊగిపో తోంది. అతన్ని అందుకోలేని నిస్సహాయ స్థితికి ఉద్విగ్నురాలైపోతోంది.

★ ★ ★

మేరీ తన పుట్టినరోజును పురస్కరించు కుని గొప్ప ఉత్సవాన్ని ఏర్పాటు చేసింది. ఇది ప్రతి సంవత్సరం జరుగుతుండేదే. కా నీ ఈ యేడాది మరింత గొప్పగా ఏర్పాట్లు జరిగాయి. ఇల్లంతా రంగురంగుల పూల తోరణాలు.. దీపాల తోరణాలు.. పలుర కాల షాండ్లీయర్స్ వేలాడదీశారు. ఆ దీపపు కాంతుల్లో ఆ భవనం పట్టపగల్లా వెలిగిపోతోంది.

ఎప్పుడు రాత్రి అవుతుందా? అని ఎ దురు చూశారు గ్రామస్థులు. ప్రతి ఇంటి లోని స్త్రీలు, పురుషులందరూ ఆహ్వానం అందుకున్నారు. వీటన్నింటితో బాటు, చా లా డబ్బు ఖర్చుచేసి ఆ రోజు రాత్రి ప్రోగ్రాం కోసం లండన్ నగరం నుండి ప్రసిద్ధి చెందిన ఇంద్రజాలికుడ్ని ప్రత్యే కంగా ఆహ్వానించారు.

సాయంకాలం కాకపూర్వమే ప్రజలు ఆ భవంతిని చేరుకున్నారు. వెచ్చని దుప్పట్లు కప్పుకుని తమ తమ స్థానాల్ని నిర్ణయించు కుని కూర్చున్నారు.

రాత్రి ఏడుగంటల రైలుకు ఇంద్రజాలి కుడు వస్తాడు. మరో అరగంటలో అతను తన నైపుణ్యాన్ని ప్రదర్శిస్తాడు. ఆ తర్వాత పది గంటలకు విందు ప్రారంభం.

'ఎప్పుడు ఏడున్నర అవుతుందా?' అని అందరూ ఉత్సుకతతో ఎదురు చూస్తు న్నారు. ఏడు గంటలకు రైలుబండి వచ్చింది. జాదూగర్ రాలేదు. కానీ ఓ టెలిగ్రాం వచ్చింది. అకస్మాత్తుగా జా దూగర్ అనారోగ్యం పాలయ్యారు. రావ టానికి ఏమాత్రం అవకాశం లేదు.

ఇది విని మేరీ తల తిరిగిపోయింది. తన పక్కనున్న చార్లెస్ చేతిలో టెలిగ్రాం పెట్టి "నువ్వేం చేస్తావో.. ఏం చేయగలవో చూడు. నా గురించి ఎవరైనా అడిగితే, ఆరోగ్యం బాగాలేదని, విశ్రాంతి తీసుకొంటు న్నానని చెప్పు" అంటూ వెళ్లిపోయింది.

టెలిగ్రాం చదివి చార్లెస్ కూడా విచారిం చాడు. "ఇప్పుడేం చేద్దాం? ఏడు నుండి పదిగంటల వరకు సమయం ఎలా గడు స్తుంది?"

జనంతో హాలు నిండిపోయింది.

సమయం గడిచినకొద్దీ కార్యక్రమం ప్రారంభం అయ్యే సూచనలు కనబడక అందరిలో అశ్చర్యం, ఆగ్రహం చెలరేగిపోయాయి. గుసగుసలు వ్యాపించాయి. ముసలీముతకా తిరిగి తమతమ ఇండ్లకు పోవడానికి సిద్ధపడుతున్నారు.

ఇదంతా చూసి మేరీకి జుట్టు పీక్కునే పరిస్థితి ఏర్పడింది. ఓ వృద్ధుడు సంగీత ప్రయత్నం చెయ్యమన్నాడు. ఓ యువకుడు తన ప్రేయసిని తీసుకుని నాట్యానికి సిద్ధమయ్యాడు. మరో బిలియర్డ్స్ ప్రేమికుడు ఆటకోసం వెళ్ళిపోయాడు. మూడుగంటల సమయం ఎలా గడపాలి? అని అందరూ ఆలోచిస్తున్నారు.

ఇంతలో మారువేషంతో లియో వచ్చి, ఒక మూలగా ఉన్న కుర్చీలో కూర్చున్న యువతిని "ఇంద్రజాలికుడు ఎందుకు రాలేదు? " అని అడిగాడు.

ఆ యువతి అంది "అకస్మాత్తుగా అతని ఆరోగ్యం పాడయింది"

"మరి ఇప్పుడు? "

"చేసేదేముంది? పది గంటల వరకు ఎవరిష్టప్రకారం వారు సమయం గడపడమే. పాపం! మేరీ సిగ్గుపడిపోతోంది. కార్యక్రమం రసాభాస అయిపోయింది"

ఆ యువతి లియోను చెయ్యిపట్టి తీసుకుపోయి పియానో వద్ద కూర్చోబెట్టింది.

లియో మెట్లపై వేళ్లుంచాడు. సంగీత స్వరాలు మోగాయి. అంతవరకు దృష్టి సారించని వాళ్ళంతా పియానో వైపు మళ్లారు. పియానో స్వరాలు సంగీతంలో తడిసి శ్రవణపేయంగా ఆ హాలంతా వ్యాపించాయి. పక్కగదుల్లో ఆటలాడే వారంతా హాల్లోకొచ్చారు. అత్యద్భుతమైన, శ్రవణానందకరమైన సంగీతం! జీవితంలో ఎన్నడూ వినని సంగీతం.. వారి హృదయాల్ని, మనసుల్ని కదిలించివేస్తోంది.

హాలులోని ప్రతిఒక్కరూ 'అంత గొప్ప సంగీతం వినిపించేదెవరా? ' అని ఆలోచిస్తున్నారు. ఎందుకంటే లియో గురించి చాలామందికి పరిచయం లేదు, తెలియదు. అతన్ని దగ్గరగా చూసినవారు తక్కువ మందే.

అతని కంఠం నుంచి వెలువడే సుమధురమైన ఆ గానంతో హాలు హాలంతా ఆనంద తరంగితమైపోయింది. ఇంద్రజాలికుడు కూడా ఇంతగొప్ప సంతృప్తి ఇచ్చేవాడుకాదు. సమయం గడిచిపోయింది. శ్రోతలు ముగ్ధులై వింటూపోయారు.

పియానోపైన చివరినాదం అలల్లా తేలి ఆగిపోయింది. శ్రోతలు తండోపతండాలుగా పియానో చుట్టూ చేరిపోయారు. ప్రతిఒక్కరూ రెండోవారిని ప్రశ్నిస్తున్నారు "ఇంతబాగా పాడిందెవరు? " అని. ఎవరూ జవాబు చెప్పలేకపోయారు.

లియో తన ముఖం వంచుకునే కూర్చున్నాడు. మళ్లీ లియో పియానో మెట్లపై వేళ్ళుంచాడు. ఝుమ్.. ఝుమ్.. అంటూ సంగీతనాదం శ్రోతల చెవుల్లో నినదించడంతో వారంతా వెళ్ళి తమ తమ స్థానాల్లో సుఖాసీనులయ్యారు.

లియో విరహ గీతం అందుకున్నాడు. సముద్రపు ఒడ్డున పరిత్యక్త అయిన రాచకన్య సముద్రుడ్ని పిలిచి తన ప్రియుడికి సందేశాన్ని అందిస్తోంది.

'ఓ సముద్రుడా! నీ కెరటాల్లో శక్తి ఉంది.. నా ప్రియుడ్ని రప్పించు లేదా నన్ను కూడా నీలోకి తీసుకునిపో.. ప్రియుడు లేని ఈ నిరర్థక జీవితం నాకు వద్దు. నా మీద దయ చూపు' అంటోంది.

ఆ పాట అర్థం అలాగే ఉంటుంది. దాని ప్రభావం శ్రోతలపై ఎలా ఉంటుందో కాని.. మేరీ అప్పటివరకూ ఓ మూలన కూర్చుని విచారిస్తోంది. ఆమె హృదయం పూర్తిగా సంగీతమయమై విలపిస్తూ పరిభ్రమిస్తోంది. సముద్రుడెవరో ఆమెకు తెలి

యదు. ప్రియుడ్ని తిరిగి ఇవ్వమని కోరటమే తెలుస్తోంది. తిరిగి యివ్వు.. తిరిగి యివ్వు!

మిక్కిలి జ్వరంతో బాధపడే వ్యక్తి తాపం హరించనట్లే శ్రోతల సంగీత తృష్ణ కూడా శాంతించటం లేదు. పాట తర్వాత పాట .. అనేక పాటలు గానం చేస్తున్నాడు లియో ఆపకుండా.

పది గంటలయింది. భోజనాల సమయం దగ్గర పడింది. లియో పియానో మూసి లేచి నిలబడ్డాడు.

అప్పుడు శ్రోతలందరూ గమనించారు అతనెవరో?

మేరీ ఎప్పుడైతే అతన్ని చూసిందో.. లేచి.. కాళ్ళు తడబడుతుండగా ఓ గదిలోకి వెళ్ళి పడకపై పడిపోయింది. ఆమెలో చైతన్యం లేకుండా పోయింది. అయితే అది కొన్ని క్షణాలు మాత్రమే. తర్వాత మేరీ నిదానంగా లేచి కూర్చున్నది. తన్ను తాను సంబాళించుకుని డైనింగ్ టేబుల్ దగ్గరకొచ్చింది. నాలుగువైపులా చూసింది. అందరూ సమావేశమయ్యారు. వారిలో లియో మాత్రం లేడు. అందరూ అతడి గురించే చర్చించుకుంటున్నారు.

అందరూ మేరీని లియో గురించే అడిగారు. కానీ మేరీ 'నాకేం తెలియదు' అంటూ తల అడ్డంగా వూపింది.

నౌకరు వచ్చి లియో వెళ్ళిపోయాడని చెప్పాడు.

అసలు సంగతి ఎవరికీ అర్థం కాలేదు. కానీ అందరి మనస్సుల్లో అతని గురించిన ఆలోచనలే. సిగ్గు, అభిమానంతో మేరీ ఆవేశంలో కింద పెదవిని పళ్లతో నొక్కింది. తెగిన పెదవి నెత్తురు మయమైంది.

మేరీ అతన్ని పిలువలేదు. అయినా ప్రతియేటా వచ్చినట్లే అతను వచ్చాడు. ఆహ్వానం గురించి అతను ఆలోచించలేదు. ఈ రోజు అతను రాకుంటే అంతా రసాభాస అయివుండేది. అలా జరగకుండా ఆమెను కాపాడి అతను వెళ్ళిపోయాడు. ఆమె నుండి అతడు ధన్యవాదాలు కూడా ఆశించలేదు.

మేరీ బాధపడింది. తన్నుతాను పరాజితురాలిగా భావించింది. నిజంగా సంగీతంలోని ఏడక్షరాలు అతనికి తెలుసని కూడా లియోతో ఆమెకున్న ఇన్ని సంవత్సరాల అనుబంధంలో తెలియదు. రాత్రంతా ఆమె అలా బాధపడుతూనే గడిపింది.

★ ★ ★

మరో మూడు రోజులు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

ఈసారి మాత్రం లియో కళ్ళలో నీళ్ళూరాయి. గత నెలరోజులుగా మేరీ, లియోకు దూరంగా జరుగుతూ వెళ్ళింది. హేళన చేయడం, ఉపేక్షాభావం వ్యక్తపరచడంలో ఆమె ఏ మాత్రం వెనక్కు తగ్గలేదు. కానీ, ఇప్పుడు ఆమెకు ఈ అవమానం సహించరానిదిగా ఉంది. నెలరోజులు తనను కాదన్నా, ఆనాటి ఆమె పుట్టినరోజు విందుకు ఆమె ఆహ్వానించకున్నా వచ్చాడు. తిరిగి ఆమె నుండి మౌనభావాన్ని మోస్తూ వెళ్లాడు.

ఆమె మౌనం అతన్ని చాలా బాధిస్తోంది. మూడురోజులు గడిచి పోయినా

ఆమె ఒక్కసారి కూడా రాలేదు. ఒక్కసారి కూడా తనను పిలిపించుకోలేదు. లియోలో ఒక్కసారి అహంభావపు భావన వీచింది.

అదృష్టాన్ని నిందించి, కర్మఫలాన్ని, ఇతరుల నిందాపూర్వక చరిత్రను చూపి కొంత ఊరట పొందవచ్చేమో! కానీ అహంకారపు భావన ముంచెత్తినపుడు మాత్రం దుఃఖాన్ని సహించటానికి కచ్చితమైన ఉదాహరణ ఏదీ ఉండదు.

నెలరోజులుగా లియోలో మానసిక ప్రశాంతత లోపించింది. కానీ ఆత్మగౌరవం మాత్రం కోల్పోలేదు. అతనిలోని ఆత్మగౌరవం అతన్ని కొండలా కాపాడింది.

అతడు మేరీని ప్రేమిస్తాడు. ఎందుకంటే ఆమె అతన్ని ఇష్టపడుతుంది. కాని ఆమె లోని ఈ రోషం, దౌష్ట్యం ఏమిటి? ఆమెలో ఏమాత్రం ప్రేమభావం మిగిలి ఉన్నా, ఇట్లా ప్రవర్తించేదా?

లియో ఇక ఆమెను ప్రేమించకూడదని నిశ్చయించుకున్నాడు. ఆమెను సూటిగా అర్థం చేసుకోలేకపోవడం తన పొరబాటుగా భావించాడు. తప్పిదానికి శిక్ష తప్పకుండా పడాల్సిందే.

మేరీపై ధ్యాస విడిచి తన శక్తిని పూర్తిగా రచనావ్యాసంగంపై కేంద్రీకరించాడు. ఒక స్త్రీ జీవితాన్ని గురించి అతను రాయడం ప్రారంభించాడు.

రాసింది చదివితే అది అతన్ని మరింతగా బాధించింది. ఎవరినైతే దూరంగా ఉంచాడో, ఆమె కథనే అతను తన రచనలో చిత్రించాడు.

తలుపు మూసి పడకపై విక్షిప్తహృదయంతో మేను వాల్చాడు.

★ ★ ★

వారంరోజులు గడవక ముందే ఒక రోజు మేరీ, చార్లెస్‌తో "నువ్వు నాకో సహాయం చెయ్యాలి" అంది.

ఈ రోజు ఆమె కళ్ళు పిచ్చెక్కిపోయినట్లు మెరుస్తున్నాయి.

చార్లెస్ అడిగాడు "ఎలాంటి సహాయం కావాలి? "

మేరీ కొంచెం ఆగి అంది "నీకు అర్థం అయ్యేలా చెబుతాను. నా హృదయంలో చిన్న ముల్లు గుచ్చుకుంది. అది బయటకు కనబడదు. కాని లోపల్లోపల తీవ్రంగా సలుపుతోంది. నువ్వు దాన్ని తొలగించగలవా? "

చార్లెస్‌కు ఏమీ అర్థం కాలేదు. అయినా ఆమెకు ధైర్యం కలిగేలా "ముల్లు చిన్నదే గదా? తప్పకుండా తొలగిస్తాను" అన్నాడు.

"ఆ! ముల్లు చిన్నదే కాని గుండెగాయం పెద్దది అవుతుందేమో? చివరకు నా ప్రాణాలు కూడా బలి తీసుకోవచ్చునేమో!"

చార్లెస్ భయపడుతూ "అయితే డాక్టరును పిలవనా? " అన్నాడు.

మేరీ నవ్వుతూ అంది "డాక్టరును పిలవడానికి సిగ్గుగా ఉంది"

చార్లెస్ కొంచెం ఆలోచించి "నా వల్ల సాధ్యం కాదేమో" అన్నాడు.

మేరీ అతన్ని తీసి పారేస్తూ "చేతగాని వాడివి నన్నెందుకు కోరుకుంటున్నావు? నావెంట ఎందుకు తిరుగుతున్నావు? "

చార్లెస్ గుండె ఎండిపోయింది. అటు ఇటు చూసి గదిలో ఎవరూ లేరని నిశ్చయించుకుని, ధైర్యం తెచ్చుకుని "నిన్ను చూసిన ఏ మగాడు కోరుకోకుండా ఉండగలడు? అలాగే నేనూ కోరుకున్నాను"

మేరీ అన్యమనస్కంగా "నీలాంటివాళ్లు ఎంతమంది కోరుకున్నా, ఒక్క వ్యక్తి మాత్రం నన్ను కోరుకోవడం లేదు. అతడు చాలా అసామాన్యుడై పోయాడు" అంది.

అంతలోనే ఆమె మానసిక స్థితి మారిపోయింది. కఠోరమైన చూపులతో అతన్ని చూస్తూ "ఆ గుచ్చుకున్న ముల్లు ఒక్కసారి చేతికొచ్చిందంటే, దాంతో అతన్ని చాలా తీవ్రంగా గాయపరుస్తాను. కాని ఆ ముల్లే

చేతికి చిక్కడం లేదు. గుండెల్లోనే వుండి పోయింది" అంది.

చార్లెస్ ఆమెను విస్మితుడై చూస్తుండిపోయాడు. ముల్లును గురించి స్పష్టం కావడం లేదు. అయినా సలహా పూర్వకంగా "డాక్టరును పిలిపిస్తే బాగుంటుందేమో!" అన్నాడు.

మేరీ పెద్దగా నవ్వింది. వెంటనే గంభీరంగా మారి మెల్లగా అంది "నేను నీలాంటి వారితో మాట్లాడాల్సివచ్చింది.. దురదృష్టవంతురాల్ని! బంగారు పాత్రను విడిచిపెట్టి మట్టిపాత్రను పట్టుకున్నాను. తృప్తి ఎలా లభిస్తుంది? "

చార్లెస్‌కు అధికమైన కోపం వచ్చింది.

కాని, భయంతో ఆగిపోయాడు.

అది చూసి మేరీ మనసులోనే నవ్వుకుంటూ అనుకుంది 'ఇలాంటి వాళ్లకి నన్ను తాకే ధైర్యమా? '

ఆ రోజంతా తన గదిలోనే గడిపింది. రాత్రి పడకపై నిద్దురలేకుండా గడిపింది.

ఉదయాన్నే నౌకరును పిలిచి "బండి సిద్ధం చెయ్యి. మిస్టర్ బాయ్ గారింటికెళదాం" అంది.

కెప్టెన్ నోల్ గారి న్యాయ సలహాదారు మిస్టర్ బాయ్.

ప్రవేశద్వారం దగ్గర బండినాపి, మేరి బండి దిగింది. మిస్టర్ బాయ్ గారి కార్యాలయంలోకి ప్రవేశించింది. అక్కడ ఆయన టేబుల్‌పై బోలెడన్ని కాగితాలు పరుచుకుని వాటిని పరిశీలిస్తున్నారు.

అంత ఉదయమే మేరీని తన కార్యాలయంలో చూసి మిస్టర్ బాయ్ ఆశ్చర్యంగా ఆమెను అడిగాడు "ఇంత పొద్దున్నే వచ్చారేమ్మా? "

"పనుంది. కల్నల్ నోరింగ్‌టన్ గారు మా నాన్న గార్నుండి ఎంత అప్పు తీసుకున్నారో చెప్పండి? "

మిస్టర్ బాయ్ లెక్కల పుస్తకాలు తీసి లెక్కగట్టి "ఎనిమిది వేల పౌండ్లు" అన్నాడు.

మేరీ పండ్ల కింద పెదవిని అదిమిపట్టి "డబ్బు.. డబ్బు.. మొత్తం లెక్కలు సరిగానే చేశారు గదా? " అడిగింది

పెద్దమనిషి భయపడిపోయాడు. "అవునమ్మా! అన్నీ సరిజూశాను"

"నేటి నుండి వారం రోజుల్లో ఈ మొత్తం డబ్బు కచ్చితంగా నా చేతికి రావాలి"

వృద్ధ మహాశయుడు ఆశ్చర్యపోతూ "అమ్మా! అదెలా కుదురుతుందమ్మా? వారం రోజుల్లోపల యింత డబ్బు ఎవరైనా ఎలా యివ్వగలుగుతారు? "

మేరీ కోపంగా, ఎరుపెక్కిన కళ్ళతో "ఆయన తాత యిస్తాడు. యివ్వకపోతే అతని కొంపాగోడు అమ్మించి వసూలు చేసుకుంటాను" అంది.

మిస్టర్ బాయ్ విషయాన్ని అర్థం చేసుకుంటూ, యిద్దరి మధ్యా ఏదో గొడవ జరిగిందనుకున్నాడు. అయినా తనదైన పద్ధతిలో "ఇంతవరకూ అతని పుస్తకాలు అమ్మగా వచ్చిన రెండువేల పౌండ్లను నా వద్ద జమ చేశాడు. ఇంక అతని దగ్గర చిల్లిగవ్వ కూడా ఉండదు. రెండుమూడు సంవత్సరాల్లోగా మొత్తం బాకీ చెల్లుచేస్తానని చెప్పి వెళ్లాడు. ఇలాంటపుడు అతనిపైన ఒత్తిడి చేస్తే ఇల్లు అమ్మటం తప్పించి

అతనేం చెయ్యలేదు" అన్నాడు.

మేరీ కోపంతో "అమ్ముకోని" అంది.

"అంతే!"

"అమ్ముకుంటే అమ్ముకోని. వారం రోజుల్లోగా నా డబ్బు మాత్రం నాక్కావాలి. న్యాయపరంగా మీరు చర్యలు తీసుకోండి"

మిస్టర్ బాయ్ తన జీవితానుభవంలో ఎన్నో చూశాడు. కాని యిలాంటి విషయాన్ని మాత్రం చూడలేదు.

"అమ్మా! నీ యిష్టం. కాని ఇంత చిన్న వయస్సులో అతన్ని బిచ్చగాడిని చేసి రోడ్డున పడెయ్యడం బాగుండదు. ఇల్లు అమ్ముకొని దేశాంతరాలు వెళ్ళమనడం ఏమైనా బాగుంటుందా? "

మేరీ మరింత రెచ్చిపోతూ "డబ్బులు, మీవి గావు, నావి. అతడు కచ్చితంగా నా పాదాక్రాంతుడు కావాల్సిందే" అంది.

మేరీ చివరిమాటలు అతనికి స్పష్టంగా వినబడలేదు.

"అమ్మా! అతన్ని ఏం చెయ్యదలచుకున్నావు? "

"ఏం లేదు. నా డబ్బులు నాక్కావాలి. ఈ రోజే నోటీసు జారీ చేయించండి! వారం రోజుల్లోగా..."

★ ★ ★

లాయరు నోటీసు అందుకున్న లియోకు ప్రపంచమంతా అంధకారం వ్యాపించినట్లయ్యింది. రాత్రంతా పడకపైన అలా పడుకునే ఆలోచిస్తుండిపోయాడు. అతనికే దారీ కనబడలేదు.

ప్రభాత సమయాన మేరీ తన గదిలో కూర్చుని ఎరుపెక్కిన కళ్లను మూస్తూ, తెరుస్తూ ఆలోచిస్తోంది.

నౌకరు గదిలో ప్రవేశించి చెప్పాడు "అమ్మా! కిందవసారాలో లియో నిలబడి ఉన్నారు"

మేరీ తలెత్తి అడిగింది "ఎవరూ? "

"లియో గారమ్మా"

మేరీ భీకరంగా అరుస్తూ చెప్పింది "వెంటనే అతన్ని యిక్కడ్నుంచి వెళ్ళగొట్టు"

నౌకరుకు అర్థం కాలేదు ఆమెకు అంత కోపం ఎందుకొచ్చిందో. అతడు బయటకు నడిచాడు. వెంటనే మేరీ అతన్ని వెనక్కి పిలిచింది. "ఆగు.. అతన్ని వెళ్లగొట్టకు. అతనికి అభిమానం ఎక్కువ. దాన్ని అతడు తట్టుకోలేడు. అతన్ని మంచిగా పంపించు. నేను లేనని చెప్పు. ఏ మాత్రం బాధ కలగకుండా, నెమ్మదిగా చెప్పి పంపించు. నేనున్నట్లు అతనేమాత్రం తెలుసుకోకుండా చూడు. జాగ్రత్తగా వ్యవహరించు" అంది.

నౌకరు తలాడించాడు, అతడు ఆమె తండ్రి కాలంనాటి నౌకరు. లియో గురించి అతనికి బాగా తెలుసు.. ఆ యింట్లో అతనికెంత గౌరవం ఉండేదో. ఒకవేళ మేరీ అతన్ని అవమానించమని ఆజ్ఞాపించినా అతడు అలా చేయలేడు. అతనికి లియో అంటే అంతటి ప్రేమ, గౌరవం.

నౌకరు కిందికి వచ్చాడు. మేరీ కూడా శబ్దం చేయకుండా నౌకరును అనుసరించి కిందకు వచ్చింది. కొంచెం తెరుచుకొని ఉన్న ద్వారం గుండా ఆమె బయటకు చూసింది. లియో అలాగే నిలబడి ఉన్నాడు. ముఖం ఆరునెలల రోగిష్టివాడిలా వాడిపోయి ఉంది.

"బాబుగారూ! అమ్మ యింట్లో లేరు" అన్నాడు.

"అమ్మగారు ఎక్కడికెళ్ళారు? " లియో నెమ్మదిగా అడిగాడు.

నౌకరు ఆలోచించి "నిన్న రాత్రి ఏదో అత్యవసర పనిపై లండన్ వెళ్ళారు" అన్నాడు.

"ఎప్పుడు వస్తారు? "

"తెలీదయ్యా! బహుశా రేపు రావచ్చేమో!"

దగ్గరగా ఉన్న ఓ కుర్చీని జరుపుకుని కూర్చున్నాడు. నిజంగా అతడికి నిల్చునే

శక్తి కూడా లేదు.

అతని స్థితిని గ్రహించిన నౌకరు "కూర్చోండయ్యా! మీరు బాగా అలిసిపోయి నట్లు ఉన్నారు. ఒక గ్లాసు బీరు తెమ్మం టారా? "

లియో నెమ్మదిగా "వద్దు" అన్నాడు.

నౌకరు విడవకుండా "బాబుగారూ! మీ ఆరోగ్యం బాగున్నట్లు లేదు. కొంచెం బీరు పుచ్చుకుంటే మంచిది" అన్నాడు.

లియో చిరునవ్వుతో అతన్ని వారిస్తూ "రెండు రోజుల్నుండి నలతగా వుంది. అ లసట వల్ల నిస్త్రాణగా ఉంది. అందుకే యిలా కనబడుతున్నాను" అన్నాడు.

అప్పుడే తలుపు కదిలిన చప్పుడ య్యింది.

లియో నౌకరుతో "ఆ తలుపు చప్పు డేంటి.. చూడు? " అన్నాడు.

నౌకరు కదలకుండా ఆ వైపు చూసి "గాలికి కదిలిందేమో.. చప్పుడయ్యింది" అన్నాడు.

మేరీ నిశ్శబ్దంగా అక్కడ్నుంచి పైకి తన గదిలోకి పరుగెత్తిపోయింది.

★ ★ ★

ఆ గ్రామంలో థామస్ హగ్ ఒక పెద్ద ఆసామీ.

లియో అయన దగ్గరకు వెళ్లాడు.

"నేను మా యింటిని అమ్మదలచుకు న్నాను. మీరు కొంటారా? " అడిగాడు.

హగ్ ఆశ్చర్యపోయాడు. "ఇల్లు అమ్ము తావా? ఎందుకు? "

"విషయం వింటే మీరు కొనకపోవచ్చు"

"నిజం కావచ్చు. అయినా ఎంతకు అమ్మదలచావు? "

"పదమూడు వేల పౌండ్లు వస్తే అమ్ము తాను"

"అంత మొత్తమా? అయినా ఇప్పుడు అంత డబ్బుతో ఏం అవసరం పడింది? "

"చెబుతాను వినండి. మా నాన్నగారు కెప్టెన్ నోల్‌గారి నుండి ఎనిమిదివేల పౌండ్లు అప్పు తీసుకున్నారు. అప్పు కింద ఇల్లు కుదవ బెట్టారు. అసలు, వడ్డీ కలిపి యిప్పుడు పద్నాలుగు వేల పౌండ్లు అయి ఉంటుంది. నేను రెండు వేల పౌండ్లు చెల్లించాను. మిగతా పన్నెండు వేలు యివ్వాలి. అప్పు తీర్చదలచుకున్నాను"

థామస్ హగ్ చేతుల్లో తల పెట్టుకొని కూర్చుండిపోయాడు. "బాబూ! వాళ్ళిద్దరూ చాలా మంచి మిత్రులు. అయినా తీసు కున్న అప్పుకు ఇంత వడ్డీయా? మేమెప్పు డూ యింత వడ్డీని భరించలేదు"

లియో జవాబు చెప్పలేదు. కాని "కొంటారా? లేదా? " అని అడిగాడు.

"కొంటాను. కాని అంత డబ్బుకు కాదు. పన్నెండువేల పౌండ్లకు మించి యివ్వలేను"

లియో కొంచెం ఆలోచించి "ఇంటి నిం డా వున్న వస్తుసామాగ్రి, ఓ గదినిండా ఉన్న పుస్తకాలు.. వాటన్నిటికీ కలిపి అయినా పదమూడు వేల పౌండ్లు యివ్వ లేరా? " అన్నాడు.

"ఇవ్వవచ్చు. ఇల్లు అమ్ముతావు. మరి డబ్బులు అప్పు కింద చెల్లిస్తావా? "

లియో నవ్వి "మా వంశంలో ఎవ్వరూ అప్పు ఎగ్గొట్టలేదు. నేను కూడా ఎన్నటికీ అలా చేయను. మీకు నమ్మకం కలగక పోతే నాతోవచ్చి చూడండి. అంతా మీ చేతికి అప్పచెబుతాను"

హగ్ విశ్వసించాడు. మొత్తం లెక్కపెట్టి డబ్బు లియో చేతికిచ్చాడు. పదమూడు వేల పౌండ్లు.

"రేపు తప్పకుండా రిజిస్ట్రేషన్ చెయ్యాలి సుమా! అయినా నీకు డబ్బు జమపడిన ప్పుడు నీ యింటిని తీసుకో. తప్పకుండా తిరిగి నీకప్పగిస్తాను" అన్నాడు హగ్.

ఆరోజు రాత్రి లియో యింట్లో ఉంటున్న తండ్రికాలం నాటి ఇద్దరు నౌకర్లు ఏడ్వటం ప్రారంభించారు. హఠాత్తుగా తమ తల



మీద నీడ దూరం గావడాన్ని వాళ్లు తట్టుకోలేకపోతున్నారు.

లియో అరునెలల జీతం వాళ్ళకు బహుమతి కింద ఇచ్చాడు. అయినా వాళ్లు ఏడుస్తూనే ఉండిపోయారు.

అత్యవసరమైన కొన్ని వస్తువులను లియో మూటకట్టాడు. మిగిలిందంతా హగ్ స్వాధీనం చేశాడు.

రేపటితో వారం రోజుల గడువు పూర్తి అవుతుంది. తండ్రి రుణం తీరిపోతుంది. ఇక 'కోరేల్'తో ఉన్న అనుబంధం తీరిపోయింది. తను శాశ్వతంగా ఆ గ్రామాన్ని వదిలిపోతున్నాడు.

లియో నౌకర్లను బుజ్జగించాడు. వీలైతే మళ్లీ వాళ్లను త్వరలో తన దగ్గరకు పిలిపించుకుంటానన్నాడు.

అతను తల్లిదండ్రుల పటాల ముందు నిలబడ్డాడు. వాటి పక్కనే మేరీ తల్లిదండ్రుల ఫొటోలున్నాయి. మేరీవి, తనవి కూడా ఎన్నో ఫొటోలున్నాయి. తాను చిన్నప్పటి నుండి చదివిన పుస్తకాలు, చిన్న గది.. అన్నింటి నుండీ ఈ రోజు మేరీ తనను బహిష్కారం చేయిస్తోందని అనుకున్నాడు.

ఆరోజు రాత్రి అతనికి తీవ్రమైన జ్వరం వచ్చింది. రాత్రంతా మూర్ఛలోనే ఉండిపోయాడు. తెల్లారి మధ్యాహ్నానికి కొంచెం జ్వరం తగ్గింది. అయినా నిస్త్రాణగా ఉంది.

తనతోబాటు తీసుకుపోయే సామాను స్టేషన్‌కు పంపించాడు. నోట్ల కట్టల్ని తీసుకుని మేరీ ఇంటికి వచ్చాడు.

మేరీ పైన తన గదిలో ఉంది. నౌకరు వచ్చి "అమ్మా! లియో డబ్బు తీసుకుని వచ్చారు" అని చెప్పాడు.

లియోతండ్రి రాసిచ్చిన బాండ్ తీసుకుని మేరీ కిందకు వచ్చింది. లియో డబ్బు చెల్లిస్తాడన్న విశ్వాసం మాత్రం ఆమెకు కలగలేదు. రోజంతా ఆమె అలాగే ఆలోచించింది. ఆమె కలలో కూడా లియో డబ్బు చెల్లిస్తాడని అనుకోలేదు. డబ్బు చెల్లించి రుణ విముక్తుడై తనను విడిచిపెట్టి పోతాడనే భావన ఆమెకు రాలేదు.

గుండె స్థిరం చేసుకుని మేరీ కిందకు వచ్చింది. వసారాలో లియో నిలబడే ఉన్నాడు. మేరీ ప్రవేశిస్తూనే లియో చేతిలోని నోట్లకట్టల్ని గమనించింది.

మేరీ ఆశ్చర్యచకితురాలైంది.

లియో నవ్వుతూ ఆమె చేతిని స్పృశించాడు. మేరీ తలవంచుకుంది. ఆ స్పర్శతో అతడు తీవ్రమైన జ్వరంతో ఉన్నాడని గ్రహించింది. ఈ చిరునవ్వు కూడా అతడు బహుమానంగా ఎవరినుండో అడిగి తెచ్చుకున్నట్లున్నది.

లియో నోట్లకట్టల్ని లెక్క పెట్టి ఆమెకందిస్తూ "లెక్కపెట్టుకో! రుణం తీర్చడానికి యివ్వాళ చివరి రోజు" అన్నాడు.

మేరీ తల ఊపి బాండ్‌పేపరు అతని చేతుల్లో వుంచింది. ఆ క్షణంలోనే ఆమె ఆశలు, తెలివితేటలు, శక్తులన్నీ వుడిగిపోయాయి. హృదయం ఛిన్నాభిన్నంగావటానికి సిద్ధంగా వుంది. శరీరంలోని సర్వశక్తుల్నీ కూడగట్టుకుని నిలబడివుంది.

ఇప్పుడు తనలోని బలహీనతను బయట పెట్టుకోవటం ఆమెకు అనుచితం.

లియో గంభీరంగా "ఇక యిదే మన యిద్దరి చివరి కలయిక. ఈ చివరి క్షణంలో నీతో రెండు మాటలు చెప్పాలి.. వింటావా? " అన్నాడు.

"చెప్పు" తలాడిస్తూ అంది.

"మేరీ నా సలహా ఏమంటే తొందరగా నీకు తగిన వ్యక్తిని ఎంచుకుని పెళ్ళి చేసుకో. నీ దగ్గర సంపదకు కొదవలేదు. తరగనంత ధనం వుంది. మంచి చరిత్ర, వంశం చూసి వరుణ్ని ఎంచుకో"

ఒక్కసారి లియో ముఖం వైపు చూసి మేరీ తల దించుకుంది.

లియో మాటల్ని పొడిగిస్తూ "మరొక్క సంగతి. సిగ్గు స్త్రీకి ఎంతటి భూషణమో అభిమానం కూడా అంతటి విలువైన ఆభరణమే. అయితే అభిమానం పెరిగితే మాత్రం చెడు ఫలితాలు వస్తాయి"

గడియారంలో అయిదు గంటలు మోగాయి. లియో చేతి గడియారం వైపు చూసి "ఇక సెలవు యిప్పించు, వెళ్తాను. రైలుకు సమయం అయిపోతోంది" అంటూ అతను బయటకు నడిచాడు.

అతను వెళ్తోంటే ఆమె రుద్ధకంఠంతో కోపంగా "ఒక్కమాట చెప్పిపో" అంది.

లియో వెనక్కొచ్చి "అడుగు" అన్నాడు.

"నీకింత డబ్బెక్కడ్నుంచి వచ్చింది? "

లియో చిన్నగా నవ్వుతూ "ఆ విషయం ఎందుకడుగుతున్నావు? నా విషయంలో నీకు తెలియందేమైనా వుందా? " అన్నాడు.

"నాకేం తెలుసు నీగురించి? నీలో అంతగొప్ప గాయకుడున్నాడని ఎన్నడైనా ఊహించానా? నువ్వెప్పుడైనా చెప్పావా? "

లియో ఈసారి పకపక నవ్వుతూ "నువ్వెప్పుడైనా.. లియో! నువ్వు పాట పాడుతావా.. అని అడిగావా? అడిగితే నీకెన్ని పాటలో వినిపించేవాడిని. యిప్పటికి నీకు నాలా సంగీతం వచ్చివుండేది"

మేరీ అతన్ని ఆపుతూ "అదికాదు, నీకింత డబ్బెలా వచ్చిందో చెప్పు" అంది.

"ఎక్కడ దొరుకుతుంది? మా తండ్రి

నాకేం యిచ్చిపోయాడు? చేసిన అప్పులు తీర్చడానికి ఈ రోజు ఇల్లు, సామాను.. చివరకు నా పుస్తకాలు కూడా అమ్మేశాను. రుణం పూర్తిగా తీర్చి ఆయనా, నేనూ రుణ విముక్తులమయ్యాం ఈరోజు"

మేరీ క్రోధంగా చూస్తూ "సర్వస్వం అమ్మేశావా? " అంది.

"అవును, అంతా అమ్మేశాను. నాకంటూ ఏమీ మిగలలేదు"

"ఎక్కడ ఉంటావు? ఏం తింటావు? "

"ప్రస్తుతం లండన్ వెళుతున్నాను. అక్కడ ఏదైనా పని చూసుకుంటాను. ఎక్కువరోజులు తిండికి లేకుండా వుండాల్సిన అవసరం వుండకపోవచ్చు"

"లండన్ నగరంలో ఎక్కడుంటావు? "

"కొన్నిరోజులు హాస్పిటల్లో వుంటాను. తర్వాత ఎలా వీలైతే అలా చేస్తాను"

"లండన్ వెళ్ళడం ఎందుకు? "

"అక్కడే వుండాల్సిన అవసరం ఉంది. గత నాలుగు రోజులుగా జ్వరం వస్తోంది. జ్వరం తగ్గడంలేదు. ట్రీట్‌మెంటు అవసరం ఉన్నది. అయినా ఎక్కువ ఖర్చు చేసి టింగురంగా అనటానికి వీల్లేదు. డబ్బు కొద్దిగానే వుంది. ఇంకెక్కడికీ వెళ్ళే అవకాశం లేదు.

మేరీ కంపించిపోయింది. "నాలుగు రోజుల్నుండి జ్వరం వస్తోందా? ఇప్పటివరకూ జ్వరం తగ్గలేదా? "

"లేదు"

క్షణంలో ఆమె ముఖంలో భావాలు మారిపోయాయి. ఆమెకు బాధ, విచారం, వ్యగ్రత, నిరాశ, సిగ్గు, అభిమానం.. ఒక్కటేమిటి ఎన్నోభావాలు కలిగాయి. అంతర్లీనంగా వున్న స్నేహభావం ఒక్కసారిగా ఆమెలో విద్యుత్తులా ప్రభావం చూపింది.

వెంటనే మేరీ శరీర తాపాన్ని అంచనా వేసేందుకు అతని చెయ్యి, నుదురు తాకి చూసింది. అయినా అతని తాపాన్ని గుర్తించలేకపోయింది. తన ముఖాన్ని అతని కపోలానికి తాకించి చూసి పరిశీలించింది. ఇక ఆగకుండా అతని చేయిపట్టి లాగుతూ, లోపలికి నడిచింది.

లియో అనుమానంతో "మేరీ! నన్నెక్కడికి లాక్కుపోతున్నావు? " అన్నాడు.

"అది నా యిష్టం. నువ్వొక్క మాట మాట్లాడ్డానికి వీలులేదు"

లియోకు అర్థంకాలేదు.

మేరీ అతన్ని పైకి, తన గదిలోకి లాక్కుపోయింది. ఆ భవనంలో ఆమె పడకగదే అత్యంత అందమైంది. అందులో చాలా విలువైన పడకవుంది. మేరీ లియోను, తన లియోను పడకపై కూర్చోబెట్టింది.

దిండ్లను సవరించి "నిశ్శబ్దంగా కళ్ళు మూసుకుని విశ్రాంతిగా పడుకో" అంది.

లియో ఆ ముఖం, కండ్లు చూసి బెదిరిపోయాడు. ఏమనలేక చివరకు "మేరీ! ఈ రోజు నేను వెళ్ళాలి.. నా ప్రయాణానికి సమయం అయిపోయింది" అన్నాడు.

మేరీకి ఈ మాటలు వినిపించాయో లేదో? కాని ఆమె మౌనం వహించింది. మరుక్షణం విలువైన శాలువా తెచ్చి అతని వక్షం వరకు కప్పి "లియో! ఇప్పుడు నాతో పోట్లాడితే నీ పని ఏమాత్రం కాదు. డబ్బు చెల్లించి రుణ విముక్తుడ్నయ్యాననుకుంటున్నావు. కాని ఇంకా పూర్తి కాలేదు. నువ్వు స్వయంగా వెళ్ళగల్గిననాడు వెళ్ళు. నీ శరీరంపై నాకధికారం లేదనుకుంటున్నావా? బాగయ్యాక నీయిష్టం? " అంది.

లియో చకితుడైపోయాడు. ఇదంతా ఎలా జరిగింది? ఉష్ణ ప్రకోపంతో వున్న శరీరాన్ని ఆమె ఎలా పైకి తీసుకువచ్చింది! ఆమె వెంట నిశ్శబ్దంగా తనూ వచ్చాడు. సగం మూతలుపడిన కళ్ళతో ఆమెను చూస్తూ, బిగ్గరగా అన్నాడు "నన్ను వదిలిపెట్టు. నేను లండన్ వెళ్ళిపోతాను"

మేరీ అతని ముఖంపైన, తన ముఖం

వుంచి "లండన్ వెళ్ళేమాట అలా ఉంచు.. కనీసం నన్నడగకుండా ఈ పడక నుండి కాళ్ళు కింద పెట్టావనుకో.. నేను ఈ భవంతి పైనుండి కిందకు దూకేస్తాను, జాగ్రత్త!" అంది.

లియో మెల్లమెల్లగా అన్నాడు "అయితే నేనెలా వెళ్ళను? "

ఆ తర్వాత అతను పక్కకు తిరిగి నిద్ర లోకి జారిపోయాడు.

పదిహేను రోజులవరకు అతనికి తెలివి రాలేదు. అపస్మారకస్థితిలో వుండిపో యాడు. మేరీ అతని పక్క విడువకుండా సేవ చేస్తూనే ఉంది.

ఒకనాడు డాక్టరన్నాడు "అమ్మా, మేరీ! నువ్వింతగా శ్రమిస్తే నీ ఆరోగ్యం పాడై జబ్బు పడతావు, జాగ్రత్త!"

మేరీ వాడిపోయిన చిరునవ్వుతో అంది "డాక్టరుగారూ! ఈ సమయంలో నా ఆరోగ్యం గురించి నాకెలాంటి భయం లేదు. ఒకవేళ ఈ స్థానాన్ని విడిచిపెడితే మాత్రం నేను తప్పక అనారోగ్యం పాలవుతాను"

"నేను నర్సును పిలిపిస్తాను. ఇద్దరూ కలిసి వంతులవారీగా పనిచేయండి. నీకూ విశ్రాంతి లభిస్తుంది" అన్నాడు డాక్టరు.

మేరీ యింకా విచారంగా "డాక్టరుగారూ! ఇప్పుడు ఇతని సేవను మించి నాకు ప్రపంచంలో ముఖ్యమైంది మరేదీ లేదు" అంటూ రోదించింది.

డాక్టరు నిశ్శబ్దంగా బయటకు నడిచాడు.

లియోకు ఇప్పుడంత తీవ్రంగా జబ్బేమీ లేదు. లండన్ నుండి ప్రత్యేకంగా ముగ్గురు నలుగురు డాక్టర్లను పిలిపించిందామె. ప్రస్తుతం వారంతా మేరీ యింట్లోనే పదిహేను రోజులుగా బైఠాయించారు.

ఒకరోజు వాళ్ళంతా "అమ్మా మేరీ! మమ్మల్ని అనవసరంగా యిక్కడ వుంచావు. ప్రస్తుతం లియో పరిస్థితి మెరుగైంది. ఆయన ఆరోగ్యానికిక ఎలాంటి ఢోకాలేదు" అన్నారు.

మేరీ దీనంగా వాళ్ళచేతులు పట్టుకుని "మీరిప్పుడే వెళ్ళకండి. నా లియో సంపూర్ణ ఆరోగ్యవంతుడు కావాలి. నా సమస్త సంపదలన్నీ ఖర్చైనా ఫర్వాలేదు. మీరడిగినంత ఫీజు చెల్లిస్తాను" అంది.

మూడువారాల తర్వాత లియో పడక పైన లేచి కూర్చోవడం ప్రారంభించాడు.

డాక్టర్ల మందుల బాదరబందీ తగ్గింది.

ఆ రాత్రి మేరీ కిటికీ తెరిచింది. ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.

గదినిండా వెన్నెల వెలుగులు పరచుకుంటున్నాయి. చంద్రుడ్ని చూస్తూ మేరీ లియో వక్షస్థలంపై తలపెట్టి పడుకుంది. చాలాసేపు ఆమె కళ్ళనుండి నీళ్ళు కారుతూవుండిపోయాయి.

కొంత సమయమయ్యాక చంద్రుడ్ని చూస్తూ "లియో! ఇప్పుడు కూడా ఆ చంద్రునిలో నల్లటిమచ్చ తొలిగిపోకుండా వుంది. నా కళంకం కూడ నీ ఛాతిపై అలాగే పడివుంది. దాన్నెలా తొలగిస్తావు? " అంది.

లియో కళ్ళ నుండి నీళ్లు కారుతుంటే, కొద్దిగా సర్దుకుని "అది కళంకమో, అందమో, మొత్తానికి ఏదైతేనేం.. అదిమాత్రం నా ఛాతిపై చాలా బలంగా ముద్రపడిపోయింది. దాన్నిక తొలగించే శక్తి నాకేమాత్రం లేదు" అన్నాడు.

★ ★ ★

ఆ తర్వాత వసంతకాలం ప్రవేశించింది.

ఒకరోజు ప్రభాతవేళలో కోరేల్ గ్రామ చర్చిలో మహాఘనంగా గంట మోగడం ప్రారంభించింది. గ్రామస్థులంతా పిల్లాపాపలతో సహా చర్చివైపు నడవసాగారు. వారి నడకలో వేగం వుంది. అందరి ముఖాల్లో వెలుగులు పరచుకునివున్నాయి.

ఎందుకంటే, ఆ చర్చిలో అప్పుడు ఏం జరుగబోతోందో అందరికీ తెలుసు! Ⓒ



అత్తలూరి విజయలక్ష్మి

తెలుగు కథ

హఠాత్తుగా బైట కోలాహలం వినిపించడంతో నా రచనా వ్యాసంగానికి ఆటంకం కలిగింది. ఒక్కసారిగా నేను రాస్తున్న నవలలోంచి బైటపడి విసుగ్గా కిటికీలోంచి తొంగిచూశాను. వేసవి సెలవులేమో, ఐదు నుంచి పన్నెండేళ్ల పిల్లలంతా వాకిట్లో ఆడుకుంటున్నారు.

వాతావరణమూ హాయిగా ఉందేమో ..గుంపుగా గూళ్లనుంచి బైటపడిన పక్షుల్లా స్వేచ్ఛగా ఎగురుతున్నారు... అమ్మాయిలు

కొందరు స్కిప్పింగ్, కొందరు టెన్నికాయిట్, అబ్బాయిలు క్రికెట్, చిన్నపిల్లలు సైక్లింగ్ ఇలా ఎవరికి తోచిన ఆటలు.. కోలాహలంగా ఉంది...

ముందు నా ఏకాగ్రతకి భంగం కలిగించినందుకు కోపం వచ్చినా, వాళ్లందరినీ అలా చూస్తుంటే ముచ్చటేసింది. కొద్దిక్షణాలు కిటికీలోంచి వాళ్లనలాగే చూస్తూ కూర్చున్నానేకానీ, నా మనసంతా నేను రాస్తున్న నవలమీదే ఉంది. నవల మధ్యలో ఆగిపోయింది.

'ఏం చేయాలి? ఆ పాపనేం చేయాలి? నా నవలలో కథానాయిక చేసిన చిన్న తప్పుకి.. కాదు కాదు, పెద్ద తప్పుకి బలైపోయి, మందమతిగా పుట్టిన పాపాయినేం చేయాలి? ' ఆలోచనతో బుర్ర వేడెక్కిపోయింది. కాస్సేపలాగే కూర్చుని లేచి, కిటికీ మూసేసి లేవబోతుంటే గబ గబా తలుపు బాదుతున్న శబ్దం వచ్చింది.

"ఎవరది? " అంటూ హాల్లోకి నడిచి డోర్ తీశాను.

పదేళ్ల పాప ఆయాసపడుతూ "ఆంటీ.. ఐ వాంట్ వాటర్" అంది, చేత్తో మంచినీళ్ళన్నట్టుగా సైగ చేస్తూ.

నాకు ఆశ్చర్యం వేసింది. ఆ పాప ఎవరో నాకు తెలియదు. నాలుగేళ్లుగా నేనీ ఏరియాలో ఇల్లు కొనుక్కుని ఉంటున్నా చుట్టు పక్కల ఎవరున్నారో కూడా నాకు తెలియదు. నేనెవరో తెలియకుండా నా తలుపు తట్టి మరీ మంచినీళ్లు అడుగుతోంది. నవ్వొచ్చింది. కమ్ అంటూ డైనింగ్ టేబిల్ మీద గ్లాసెస్ స్టాండ్‌లోంచి గ్లాస్ తీసి, ఫ్రిజ్‌లోంచి మంచినీళ్ల బాటిల్ తీసి, గ్లాసులో పోసి ఇచ్చాను. గటగటా తాగేసి, "థాంక్యూ" అంటూ వెళ్లబోతుంటే అడిగాను.. "నీపేరేంటి? "

నావైపు తిరిగింది.. "అయామ్ జ్ఞాపిక" అంది, మొహం మీద పట్టిన చెమట కర్చీఫ్‌తో తుడుచుకుంటూ.

"జ్ఞాపిక... జ్ఞాపిక" అని రెండుసార్లు మనసులో అనుకుంటేకానీ, ఆ పేరు పలకడానికి మనసొప్పలేదు.

"డూ యు లైకిట్? " అడిగింది.

ఆ అమ్మాయి చొరవకి ముచ్చటేసింది.. నవ్వుతూ తలూపాను.

"థాంక్యూ" అంటూ పారిపోయింది.

ఆ అమ్మాయినలాగే కొన్నిక్షణాలు చూసి డోర్ వేసుకుని, కిచెన్‌లోకి నడిచాను. గిన్నెతో నీళ్ళు స్టవ్‌మీద పెట్టి కప్పులో రెండు స్పూన్లు తేనె వేసుకుని, ఫ్రిజ్‌లోంచి సగం కట్‌చేసిన నిమ్మబద్ద తీసుకుని కొద్దిగా రసం పిండుకున్నాను. ఈ మధ్య లెమన్ టీ నాకు రుచిగా అనిపిస్తోంది.. ఆ టీ తాగాక కలిగే ఉత్సాహం నాకా లెమన్ టీ మీద ఇష్టాన్ని కలగచేసిందేమో. నీళ్లల్లో కొన్ని టీ ఆకులు వేసి, కొన్ని క్షణాల్లోనే డికాషన్ కప్పులోకి వంపుకుని కప్పు తీసుకుని తిరిగి హాల్లోకి వచ్చాను.

కొద్దికొద్దిగా టీ సిప్ చేస్తూ రిమోట్‌తో టీవీ ఆన్ చేసి, సోఫాలో వాలాను.

న్యూస్ రీడర్ వార్తలు చదువుతోంది. రాజకీయ నాయకుల నేర చరిత్రలు, అవినీతి సామ్రాట్‌ల అరెస్టులు, సీబీఐ దర్యాప్తులు, కోట్ల రూపాయల కుంభకోణాలు, డబ్బుకోసం హత్యలు, దొంగల వీర

విహారం, విచ్చలవిడిగా బతుకుతున్న యువత, యాక్సిడెంట్లు, ఇతర దేశాల్లో జరుగుతున్న రాజకీయ పరిణామాలు... ఏవగింపునీ, రోతనీ, అసహ్యాన్ని కలగచేసే వార్తలు.. భారతదేశంలో పుట్టినందుకు గర్వపడాలో, సిగ్గుపడాలో అర్థంకాని స్థితి. ఈ దేశంలో, రాష్ట్రంలో పెరిగిపోతున్న అవినీతి.. అవినీతిని అలవాటుగా చేసు కుని బతుకుతున్న బడాబాబులు.. ఆడ వాళ్ల బలహీనతని అవకాశంగా తీసుకుని వాళ్లతో స్వర్గాన్ని పొంది, వాళ్లను నరకా నికి తోసే బలిసిన నాయకులు.. అందరినీ ఏ టు జెడ్.. అందరినీ ఒకేషాట్‌తో తుద ముట్టించే పవర్‌ఫుల్ బుల్లెట్ ఏదన్నా ఉందా? ఉండే ఉంటుంది. అదేదో నాకు దొరికితే ఎంత బాగుంటుంది!

చానెల్ మార్చాను.. ఏదో సీరియల్ వస్తోంది.. ఇద్దరు ఆడవాళ్లు ఒకళ్లనొకళ్లు నిప్పులు కురిసే కళ్లతో చూసుకుంటు న్నారు. వాళ్లిద్దరి మేకప్ వాళ్ల అసలు మొహాన్ని పూర్తిగా మార్చేసినట్లు అనిపి స్తోంది. అద్దాల చీరలు, ఒన్ గ్రామ్ గోల్డ్ నగలు, అందంగా ఉన్నారు.. వాళ్లు ఆగి, ఆగి చెబుతున్న డైలాగ్‌లు అసహ్యంగా ఉన్నాయి. వాళ్లెందుకు ఒకళ్లనొకళ్లు తిట్టు కుంటున్నారో నాకర్థం కాలేదు.. వాళ్ల హావభావాలు, సంభాషణలు పలికే తీరు, అర్థం లేని విలనీ భరించలేకపోయాను.. మరో చానెల్ తిప్పాను... ఇద్దరు భార్యల మధ్య నలిగే హీరో, వాళ్లల్లో ఎవరు మొదటి భార్యో తెలియలేదు.. కానీ ఒక భార్య పాత్ర మాత్రం వీలైనంత నీచంగా, దరిద్రంగా, అసహ్యంగా మలిచాడు రచ యిత. ఆ ఆర్టిస్టు నటన మరింత నీచంగా ఉంది. టోటల్‌గా స్త్రీ పాత్రల చిత్రీకరణ చాలా నీచంగా, దిగజారుడుగా ఉంది.. వీళ్లకి 'ఆర్టిస్టులు' అని తెలుగులో అంద మైన పదం 'కళాకారులు' అనీ ఆ పదం వాడడం అంటే నిజమైన కళాకారులను అవమానించడం అనిపించింది. ఇంక చూడలేకపోయాను.

మరో చానెల్‌లో రెండుపార్టీల నేతలతో ఒక జర్నలిస్టు చర్చ. అది చర్చలా లేదు.. వీధినబడి చేస్తున్న రచ్చలా వుంది. టీవీ ఆఫ్ చేసి, విసురుగా రిమోట్ విసిరేసి, తిరిగి నా గదిలోకి వెళ్లాను.

లెమన్ టీ ఇచ్చిన శక్తి బాగానే పనిచే స్తున్నట్టుంది. మళ్లీ నవల రాయడానికి ఉపక్రమించాను.. కానీ ఎంచేతో ముందుకు సాగలేదు. వేళ్లు విరుచు కుంటూ ఫైల్ సేవ్‌చేసి లాగ్ అవుట్ అయాను.. కంప్యూటర్ షట్ డౌన్ చేసి, గదుల్లో లైట్లు వేస్తూ హాల్లోకి వచ్చాను. ఏం చేయాలో తోచలేదు. టీవీ చూడలేక పోతున్నాను.

నవల పూర్తి చేయాలంటే ఎలా? ఆ పాపపట్ల కసాయిదానిలా ప్రవర్తించి, ఆ పాత్రను చంపేయాలని లేదు. బతికేలా చేయాలి. కానీ ఎలా? మానసికంగా, శారీ రకంగా కూడా ఎదగని ఆ పాప బతికేం చేస్తుంది? ఎవరా పాపని కంటికిరెప్పలా కాపాడుకుంటారు? అసలు నేనీ ఇతివృ త్తం ఎందుకు తీసుకున్నాను? బోలెడన్ని సమస్యలుండగా ఈ వస్తువే నాకు ఎందుకు రాయాలనిపించింది? ఏమో?

వాకిలి తలుపుతీసి బైటకి వచ్చాను. వెన్నెల పాలు ఒలికినట్టు పల్చగా పరుచు కుంది మొక్కల మీద. గాలిలో చల్లదనం పెరిగింది. వాతావరణం హాయిగా ఉంది. ఎదురుగా ఉన్న అపార్ట్‌మెంట్‌లో కొన్ని ఫ్లాట్స్‌లోనే లైట్లు వెలుగుతున్నాయి. అందుకేనేమో కళావిహీనంగా ఉంది. జ్ఞాపిక గుర్తొచ్చింది. ఎక్కడుంటుందో! ముద్దుగా, బొద్దుగా, ఆడిఆడి అలసిన కళ్లు, కందిన చెంపలు, చెదిరిన జుట్టు.. ఎంత ముద్దుగా ఉంది! రోజూ వస్తుందా ఆడుకో

డానికి? చక్కదనంతోపాటు, చలాకీతనం కూడా ఇచ్చాడు భగవంతుడు. బోళాగా, కలివిడిగా మాట్లాడింది. తీయని స్వరంతో హాయిగా, స్వచ్ఛంగా మాట్లాడింది. ఎందుకో జ్ఞాపిక వచ్చి కాస్సేపు కబుర్లు చెబితే బాగుండు అనిపించింది.

కొంచెంసేపు అలాగే నిలబడి లోపలికి వచ్చి తలుపు వేసేశాను. అన్ని గదుల్లో లైట్లార్పేసి బెడ్‌రూమ్‌లోకి వెళ్లిపోయాను. ఈ ప్రపంచంలో దురదృష్టవంతులు ఒంటరివాళ్లు. నేను చాలా దురదృష్టవంతురాలిని. కానీ నేనిలా ఒంటరిగా మిగిలిపోడానికి కారణం ఎవరు? నా మనసు ఒక్కసారిగా గతంలోకి వెళ్లిపోయింది.

'అప్పుడే పిల్లలొద్దు, పిల్లలొద్దు..' అంటూ, పిల్లలు పుడితే నా కెరీర్ పాడైపోతుందని పిల్లల్ని కనడం వాయిదా వేస్తూ వచ్చినందుకు భగవంతుడు నా కసలు పిల్లలే లేకుండా చేశాడు. పిల్లలకోసం పలవరించిన మాధవ్ విసిగిపోయినట్లున్నాడు. నన్నూ, ఈ లోకాన్నీ వదిలి వెళ్లిపోయాడు. ఏం సాధించాను? నిట్టూర్పు గుండెల్ని చీల్చుకుంటూ వచ్చింది.

జీవితంలో యాభైఏళ్లు గడిచిపోయాయి. బోలెడంత డబ్బు, పేరు ప్రతిష్ఠలు సంపాదించుకున్నాను. ఇంకా సంపాదిస్తూనే ఉన్నాను. కానీ, ఎవరికోసం? నా తరవాత ఎవరు అనుభవించాలి? నా దగ్గర ఐదు లక్షల ఫిక్సెడ్ డిపాజిట్ ఉంది. యాభైలక్షల విలువచేసే ఈ ఇల్లుంది. సుమారు పదిలక్షలదాకా విలువచేసే బంగారు నగలున్నాయి. సేవింగ్స్ ఎకౌంట్‌లో రెండు మూడు లక్షలున్నాయి. ఇంకో రెండేళ్లలో రిటైర్ అవుతాను. ఇరవైవేలు పెన్షన్! మరో కొన్ని లక్షలు బ్యాంకులో జమ అవుతాయి. ఏం చేయనివన్నీ? ఎంత ఖర్చు పెట్టుకుంటే కరుగుతాయి? ఏం ఖర్చు పెట్టుకోను. ఇంకా సంపాదిస్తాను. బతికున్నంతకాలం సంపాదిస్తాను. కానీ, ఎవరికోసం? ఎవరున్నారు? గుండెల్లో ఆవేదన సుళ్లు తిరుగుతోంటే మంచం మీద వాలిపోయాను.

గుండెనిండా దుఃఖమే. కానీ, కన్నీళ్లే కరువైనాయి. ఎప్పటికో నిద్రపట్టింది.

రోజులు గడుస్తున్నా నా నవల మాత్రం పూర్తి కావడంలేదు. నా మనసు బాధపడకుండా, పాత్రకి అన్యాయం చేయకుండా నేనా పాత్రకి ఒక ముగింపు ఇవ్వాలి. అది ఎలాంటి ముగింపు? ఎలా చేయాలి? నాకేం అర్థం కావడంలేదు. ఆలోచన సంపూర్ణంగా వచ్చిందాకా కంప్యూటర్ ముట్టుకోకూడదని నన్ను నేను నిర్బంధించుకుని కూర్చున్నాను. ఆఫీసుకి వెళ్లడం, నాకిష్టమైన పార్కులో కొంతసేపు గడిపి ఇంటికి రావడం, టీవీ చూసి పడుకోడం.. ఇదే నా దినచర్య.

వారం గడిచింది. ఆ రోజు ఆదివారం. ఉదయం పది దాటి ఉంటుంది. ఆరుంబావుకాల్లా లేచి మార్నింగ్‌వాక్, యోగా పూర్తి చేసుకుని, స్నానం, పూజ కానిచ్చి, ఇడ్లీ తిని కూర్చున్నాను. తలుపు చప్పుడైంది. చూస్తే జ్ఞాపిక! వారం క్రితం మంచినీళ్ల కోసం వచ్చింది.. మళ్లీ ఇవాళ!

"రా రా! వాటర్ కావాలా? " అడిగాను, చేయి పట్టుకుని ముద్దుపెట్టుకుంటూ.

"ప్చ్.." పెదవి విరిచింది. "నాకు బోర్‌గా ఉంది. నా ఫ్రెండ్స్ అందరూ వెకేషన్‌కి ఊరెళ్ళారు" అంది చనువుగా సోఫాలో కూర్చుంటూ.

"అలాగా.. మరి నువ్వెళ్లలేదేం? "

"మమ్మీకి వెకేషన్ లేదు"

"ఓ.." జాలేసింది తన మొహం చూస్తే.

అప్పటిదాకా జాలిగా పెట్టిన మొహంలో హుషారు తెచ్చుకుంటూ అడిగింది "ఆంటీ! మీ ఇంట్లో టాయ్స్ ఉన్నాయా? "

"లేవమ్మా.. మా ఇంట్లో పిల్లలు లేరు కదా? "

"మీకు చిల్డ్రన్ లేరా? " ఆశ్చర్యంగా చూసింది.

లేరన్నట్టు నవ్వాను.

"మీరు ఒక్కరే ఉంటారా? అంకుల్ కూడా ఉండరా? "

"లేదు.. సరేగానీ నీ సంగతి చెప్పు.. మీరెక్కడ ఉంటారు? "

గుమ్మందాకా వెళ్లి చేత్తో చూపించింది.. "అదిగో ఆ అపార్ట్‌మెంట్.."

సరిగ్గా మా ఇంటికి కొంచెం ఎదురుగా పెద్ద అపార్ట్‌మెంట్.

"ఎవరెవరుంటారు? నీకెంతమంది అక్కలు అన్నలు? "

"నాకు ఒకడే తమ్ముడు"

"అలాగా! మరి తమ్ముడిని తీసుకురాలేదేం? "

"వాడిక్కడ లేడు. అమెరికా.."

"అమెరికాలోనా? అక్కడెవరున్నారు? "

"ఎవరూ లేరు"

"మరి తమ్ముడు ఎక్కడున్నాడు? "

"హాస్పిటల్.."

"ఏ హాస్పిటల్? " ఆశ్చర్యంగా అడిగా.

భుజాలెగరేసి "ఐ డోంట్ నో" అంది.

"ఇక్కడ ఎవరెవరుంటారు? "

"మమ్మీ, నేను, డాడీ"

నాకేం అర్థం కాలేదు. తమ్ముడు అమెరికాలో హాస్పిటల్లో, ఇక్కడ తల్లి, తండ్రితో ఈ పాప.. ఇంక చిన్నపిల్లతో అంతకన్నా ఆ విషయాలు డిస్కస్ చేయడం సభ్యత కాదు. పద్ధతి అంతకన్నా కాదు. ఫ్రిజ్ తెరిచి క్యాడ్‌బరి చాక్లెట్ తీసిచ్చాను. "థాంక్యూ" అంటూ తీసుకుంది.

ఆ పాపని ఎలా ఎంటర్‌టైన్ చేయాలో నాకర్థం కాలేదు.. నా దగ్గర కాలక్షేపం అవుతుందని తనకి ఎందుకనిపించిందో కూడా నాకు తెలియలేదు.. అయినా నాకు తోచిన విధంగా అవీ ఇవీ మాట్లాడుతూ "టీవీ చూస్తావా? " అని అడిగాను.

"యా.." అంది హుషారుగా.

టీవీ ఆన్ చేసి "ఏం చానెల్ చూస్తావు? " అడిగాను.

"డిస్కవరీ" అంది.

తను కోరిన చానెల్ పెట్టి నేను కిచెన్‌లోకి వెళ్ళిపోయాను, వంట చేసుకోడానికి. కానీ నా మనసంతా జ్ఞాపిక తమ్ముడితో నిండిపోయింది. అమెరికాలో హాస్పిటల్‌లో పసివాడ్ని ఒక్కడినీ వదిలేసి, వీళ్లంతా ఇక్కడ ఉన్నారేంటి? ఎందుకు? వాడికేం జబ్బు? జబ్బున్నవాడిని ఒక్కడినే డాక్టర్లకు వదిలేసి ఆ తల్లి, తండ్రి ఇక్కడ హైదరాబాదులో ఉండడం నాకు ఎలాగో అనిపించింది. ఏం జబ్బు అయి ఉంటుంది? నాకెందుకో నేను రాస్తున్న నవలలో పాపాయి పాత్రకి, జ్ఞాపిక తమ్ముడికి ఏదన్నా పోలిక ఉందేమో అన్న సందేహం కలిగింది. రాసే నవల మీద ధ్యాస ఉన్న ప్రతి రచయితకీ ఇలాంటి ఆలోచనలు వస్తూనే ఉంటాయన్నది వాస్తవం. కాబట్టి అంతగా నా ఆలోచనకి ప్రాధాన్యం ఇవ్వకపోయినా, ఎక్కడో మనసులో ఓ మూల జ్ఞాపిక తమ్ముడిని గురించిన వివరాలు పూర్తిగా తెలుసుకోవాలనిపించింది.

"ఆంటీ! అయామ్ గోయింగ్" అంటూ

కిచెన్‌లోకి వచ్చింది జ్ఞాపిక.

"ఏం? బోర్‌గా ఉందా? " అడిగాను. నాకెందుకో తను వెళ్లడం ఇష్టం లేదు..

అనుకోని అతిథిలా ఇంట్లోకి వచ్చి చనువుగా ఆ పాప తిరుగుతోంటే ఇంటికేదో కొత్త అందం వచ్చినట్టుగా అనిపిస్తోంది. అందుకే అన్నాను "నాతో కలిసి లంచ్ చేస్తావా? "

"నో.. మమ్మీ తిడుతుంది" అంటూ పారిపోయింది.

అప్పటి నుంచీ జ్ఞాపికకోసం ఎదురు చూడడం నా దినచర్యలో భాగమైంది.

ఆ అమ్మాయి కూడా నా దగ్గరకి తరచూ నేను ఇంట్లో ఉన్న సమయంలో రావడం, కాస్సేపు ఏవో కబుర్లు చెప్పి, టీవీ చూసి వెళ్లడం అలవాటైంది. అప్పుడప్పుడూ డ్రెస్సింగ్ టేబిల్ దగ్గరకు వెళ్లి నెయిల్ పాలిష్‌లు తీసుకుని వేసేసుకోడం, ఎంతో స్వతంత్రంగా ఫ్రిజ్‌లో వాటర్ బాటిల్ తీసుకుని నీళ్లు తాగేయడం, ఫ్రీజర్‌లో చాక్లెట్స్ కోసం వెతుక్కోడం, రిమోట్ తీసుకుని నచ్చిన చానెల్ పెట్టేసుకుని టీవీ చూడడం.. ఇలా ఎంత అలవాటై పోయిందంటే తనకోసం నేను ఆఫీసు నుంచి పార్కుకి వెళ్లే అలవాటు మానుకుని ఇంటికి త్వరగా రావడం ప్రారంభించాను. తన సమక్షంలో నేను కోల్పోయిందేదో పొందుతున్న అనుభూతి కలగసాగింది.. నాకు తెలియకుండానే జ్ఞాపిక పట్ల నాలో అభిమానం, వాత్సల్యం కలిగి తన రాకకోసం ఎదురు చూడడం ఒక అలవాటుగా మారింది.

జ్ఞాపికను చూస్తుంటే నా నవల మొత్తం తిరగ రాయాలనిపిస్తోంది. నేను సృష్టించిన పాత్రల్లో ఎక్కడా ఏ లోపం లేకుండా విషాదం, వెలితి లేకుండా మార్చేయాలనిపిస్తోంది. కథానాయిక చేసిన పొరపాటు ద్వారా కలిగిన బుద్ధిమాంద్యంగల పాప పాత్ర స్థానంలో జ్ఞాపికలాంటి చక్కటి, చలాకీ పాపాయిని సృష్టించి, ఆ పాత్రతో నాకు ఒక అనుబంధాన్ని పెంచుకోవాలని పిస్తోంది. కానీ నవల మొత్తం మార్చాలి. ఈ నవలని నేనలా మార్చలేను. ఏది ఏమైనా జ్ఞాపిక రాక నా జీవితంలో ఒక చిన్న ఆనందానికి తెరతీసింది.

అయితే, సరిగ్గా రెండురోజుల్లో నా ఆనందానికి చిన్న అవరోధం ఏర్పడింది. అనుకోకుండా జ్ఞాపిక రావడం మానేసింది. మొదటి రెండురోజులూ అసహనంగా ఎదురుచూశాను. ఏమైందో ఏంటో అని బెంగపెట్టుకున్నాను. వాళ్లుండే అపార్ట్‌మెంట్ తెలిసినా, ఫ్లాట్ నెంబరు తెలియకపోడంతో ఎందుకు రావడం లేదో విచారించడానికి కూడా వీల్లేకుండా అయింది. నాకు తెలియకుండానే నాలో నిరుత్సాహం, ఏదో తెలియని వెలితి, దుఃఖం కలగసాగాయి. నాలుగురోజులు గడిచాయి.. పాప రాలేదు.. ఆ రోజు నేనింక ఆగలేకపోయాను. తలుపు తాళం వేసి, వాళ్ల అపార్ట్‌మెంట్ వైపు వెళ్లాను. వాచ్‌మాన్ కనిపించాడు.. అతడినే అడిగాను "జ్ఞాపిక అనే పాపవాళ్లు ఏ ఫ్లాట్‌లో ఉంటారో తెలుసా? "

"తెలుసమ్మా. 202లో ఉంటారు"

లిఫ్ట్‌లో సెకండ్‌ఫ్లోర్‌కి వెళ్లాను. వెంటనే కనిపించింది 202. తలుపు వేసి ఉంది.. ఫ్లాట్లలో మామూలేగా. కాలింగ్‌బెల్ కొట్టాను.. కొన్ని సెకన్ల తరవాత పంజాబీ డ్రెస్‌లో ఉన్న ఒకమ్మాయి డోర్ తీసింది..

నావైపు ఆశ్చర్యంగా చూసింది...

"జ్ఞాపిక ఇల్లేనా? " అడిగాను.

"మీరు..? "

"జ్ఞాపిక ఫ్రెండ్" నవ్వుతూ, "ఉందా? " అని అడిగాను.

"రండి లోపలికి.." ఆ అమ్మాయి పక్కకి జరిగి చోటిచ్చింది.

హాల్లో దివాన్ మీద గులాబీలా పడుకుని ఉంది జ్ఞాపిక. నాకు కంగారుగా అనిపించింది. వేగంగా దివాన్ దగ్గరకు వెళ్ళి, "జ్ఞాపికా!" అంటూ పిలిచాను.

కళ్లు తెరిచింది. నన్ను చూసి "హాయ్ ఆంటీ" అని నవ్వింది. నీరసంగా ఉన్న ఆ నవ్వు చూస్తే నాకు దుఃఖం వచ్చింది.

"ఏమైందమ్మా? " అడిగాను.

"ఫీవర్" అంది.

నేను ఆ పాప తల్లివైపు చూశాను.

"అవునండీ.. ఒన్‌వీక్ నుంచి ఫీవర్" అంది జ్ఞాపిక దగ్గరగా వచ్చి ఆప్యాయంగా జుట్టు సవరిస్తూ.

"అరెరె! నీకు తెలుసా? నువ్వు రాక పోతే నాకసలు తోచడం లేదు" అన్నాను జ్ఞాపికతో. నా మాటలకి తల్లివైపు చూసింది. ఆ చూపులో 'చూశావా!' అన్న భావన కనిపించింది.

ఆమె నావైపు చూసి "మీరెక్కడ ఉంటారు? " అడిగింది.

నేను చెప్పాను. అంతేకాదు, జ్ఞాపికతో నాకు ఎలా పరిచయం అయిందో, తన పట్ల నా మనసులో అభిమానం రోజురోజుకీ ఎలా పెరుగుతోందో.. అన్నీ చెప్పాను.

"అలాగా! నాకసలు తెలియదు. తను ఆడుకోడానికి వెళ్తుంది కదా, ఎవరింటికి వెళ్తుందో నాకు తెలియదు. సారీ! మిమ్మల్ని ఇబ్బందేం పెట్టలేదుకదా మా అమ్మాయి? " అంది.

"ఇబ్బంది పెట్టిన వాళ్లని వెతుక్కుంటూ వస్తారా ఎవరైనా? " అడిగాను.

ఆమె ఏం మాట్లాడలేదు.

జ్ఞాపిక వైపు చూసి అడిగాను "ఏమన్నా తింటున్నావా? ఫ్రూట్స్ తింటావా? "

"నో.." కచ్చితంగా అంది.

"ఏం తినడంలేదు. యాంటీ బయోటిక్స్ వాడుతున్నాం కదా? " అంది వాళ్లమ్మ.

కాస్సేపు అలాగే కూర్చుని కబుర్లు చెప్పి నేను ఇంటికి వచ్చానే గానీ, జ్ఞాపికను విడిచి రావడం అసలు నచ్చలేదు నాకు. ఆ రోజు నుంచీ రోజూ ఆఫీసు నుంచి వస్తూ వస్తూ అటువైపు ఓ అడుగువేసి రావడం మొదలుపెట్టాను.

రెండురోజుల్లో జ్ఞాపిక కొంచెం తేరుకుంది. ఇంట్లో తిరుగుతోంది. జ్ఞాపిక తల్లి పేరు కృత్తిక. ఆ అమ్మాయితో కూడా నాకు బాగానే సాన్నిహిత్యం పెరిగింది. ప్రతిరోజూ తనకోసం పళ్లు, పేస్ట్రీలు తీసుకుని వెళ్లడం, బతిమాలి, గారంచేసి తినిపించడం నాకే ఆశ్చర్యంగా అనిపిస్తోంది. మా ఇద్దరి మధ్యా ఈ చిత్రమైన అనుబంధం ఎలా ఏర్పడిందో! కూడా నాకర్థం కాలేదు. ఈ హడావుడిలో నా నవల సంగతిని తాత్కాలికంగా మర్చిపోయాను.

నాకు జ్ఞాపిక పట్ల ఉన్న అభిమానానికి, ప్రేమకీ కృత్తిక మనస్ఫూర్తిగా ఆనందించింది. "మా అమ్మాయి ఎక్కడికీ వెళ్లదు. అలాంటిది మీ ఇంట్లో అంత చనువుగా కలిసిపోయిందంటే నమ్మలేకపోతున్నాను" అంది ఒకరోజు.

నవ్వి ఊరుకున్నాను. నా మనసులో ఉన్న సందేహం తీర్చుకోడానికి ఆ రోజే నాకు అవకాశం కూడా కలిగింది. జ్ఞాపిక వాళ్ల నాన్నతో కలిసి చాలా రోజుల తరవాత బైటికి వెళ్లింది. ఇంట్లో నేనూ, కృత్తిక.. కృత్తిక కూడా నన్ను 'ఆంటీ' అని పిలుస్తోంది. అందుకే జ్ఞాపికకి చెప్పాను.. నన్ను 'అమ్మమ్మా' అని పిలవమని. కానీ, తనలా పిలవడంలేదు. సో.. తల్లీకూతుళ్లిద్దరికీ నేను ఆంటీనే.

"కృత్తికా! జ్ఞాపిక తమ్ముడెక్కడ ఉంటాడు? " అడిగాను.

ఉలిక్కిపడినట్టుగా చూసింది. ఆమె మొహంలో విషాదవీచిక కదలడం సెకనులో సగం సేపు నా దృష్టిలో పడింది.

కొన్ని క్షణాలాగి "ఇంకా ఏం చెప్పింది జ్ఞాపిక? " అడిగింది.

"అమెరికాలో ఏదో హాస్పిటల్లో ఉన్నా డని చెప్పింది, ఎనీ ప్రాబ్లెమ్? " అడిగాను.

హఠాత్తుగా కృత్తిక రెండు చేతుల్లో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడవసా గింది. ఆమె ఏడుపు చూస్తే నా గుండె చెరువైంది.. అంత బాధ కలిగించే విష యమా? నేను అనవసరంగా గుర్తు చేసానా? అని నన్ను నేను తిట్టుకుంటూ ఆమెని ఓదార్చడానికి ప్రయత్నించాను.

కొన్ని క్షణాల తరవాత చున్నీతో కన్నీళ్లు తుడుచుకుని బొంగురుపోయిన గొంతుతో 'సారీ' అంది.

"సారీ నువ్వు కాదు, నేను చెప్పాలి. నిన్ను బాధపెట్టాను.. అంత బాధ కలి గించే విషయమయితే చెప్పద్దులే కృత్తికా..." అన్నాను.

"లేదు లేదు, చెప్తాను. ఇంతకాలానికి నా మనసులో ఆవేదన పంచుకోవడానికి ఒక ఆత్మీయురాలు దొరికింది. చెప్తాను.." అంటూ చెప్పసాగింది..

"నాకు జ్ఞాపిక తరువాత ఒక బాబు పుట్టాడు.. కానీ, వెంటనే ప్రెగ్నెన్సీ వచ్చిం దని, సెకండ్ ఇష్యూకి గ్యాప్ ఉండాలని, ప్రెగ్నెన్సీ పోవడానికి మందులు వాడాను. కానీ, ఫలితం దక్కలేదు.. ఆ తరవాత అబార్షన్ చేయించుకోడానికి వెళ్లాను. డాక్టర్స్ నా ప్రాణానికి ప్రమాదం అని అబార్షన్ సంగతి మర్చిపోయి డెలివరీ అవగానే ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయించుకోమని చెప్పారు.. చేసేది లేక ఊరుకున్నాను.. కానీ, బాడ్‌లక్.. బాబు సరిగా పుట్టలేదు.."

"అంటే..? "

"ఇంటలెక్చువల్ డిజెబిలిటీ. మానసి కంగా ఎదగనిబాబు, శారీరకంగా కూడా సరిగా ఎదగలేదు. పీలగా ఉండేవాడు. ఐదేళ్లు వచ్చినా మాటలు రాలేదు. చూపుల్లో వెర్రితనం, నోటివెంట చొంగకా రుతూ.. జ్ఞాపిక వాడిని దగ్గరకు తీయని చ్చేదికాదు. తను వాడిని ముట్టుకునేది కాదు. ఈ బాధ భరించలేక కొంతకాలం హాస్పిటల్‌లోనే ఉంచేశాం. ఒక సైకియా ట్రిస్ట్ పర్యవేక్షణలో రెండేళ్లు ఉన్నాడు ట్రీట్‌మెంట్ కోసం.. వాడి కోసమే నేనూ ఉద్యోగంలో చేరాను. లక్షలు, లక్షలు ఖర్చు అయింది. కానీ కానీ.." కృత్తిక దుఃఖం అణచుకుంటున్నదానిలాగా కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయింది. తరువాత త న్ను తాను సంబాళించుకుంటూ "ఏ మాత్రం ఇంప్రూవ్‌మెంట్ లేదు.. కొంత కాలం మెంటల్లీ రిటార్డెడ్ స్కూల్స్‌లో చేర్చాం. మా దౌర్భాగ్యం! చాలామంది పిల్లలు పూర్తిగా కాకపోయినా కొంతైనా మారారు.. కానీ కానీ వీడు అసలు మార లేదు.. వాడే మందులు ఏమైపోతు న్నాయో అర్థం కావడంలేదు"

"ఇప్పుడెక్కడున్నాడు..? " వణుకుతున్న స్వరంతో అడిగాను.

"సిటీకి సుమారు యాభైకిలోమీటర్ల దూరంలో ఒక స్కూల్ ఉంది. ఇలాంటి జబ్బులపైన రీసెర్చి చేసింది ఒకావిడ. ఆ స్కూల్లో చేర్చాం. సంవత్సరానికి రెండు లక్షలదాకా ఖర్చవుతుంది. ఆ స్కూల్లో చేర్చి ఏడాది అవుతోంది. ఏమాత్రం.. ఆశ క..ల..గ..డం.." మాట మధ్యలోనే దుఃఖం అడ్డుపడింది కృత్తికకి.

నా గుండెల్లో అగ్నిపర్వతాలు పగిలిపో తున్నట్టు శరీరం ఆపాదమస్తకం వణికిపో తోంది. ఏమిటీ చిత్రం? నేను రాస్తున్న నవ లలోంచి రెండుపాత్రలు నా ముందుకొచ్చి నన్ను సవాల్ చేస్తున్నట్టుగా అనిపిస్తోంది. ముగింపు, ముగింపు.. అంటూ కలవరిం చావుకదా.. ఇప్పుడు చెప్పు ఎలా ముగి స్తావో అని వాళ్లు వేయి స్వరాలతో అరు



స్తున్నట్టుగా.. ఒళ్లు జలదరించినట్టయింది.

"తను బాబుని ముట్టుకోకపోయినా జ్ఞాపికకి వాడంటే ఏదో అభిమానం, మమకారం, ఆపేక్ష ఉండేవి. వాడిని హాస్పిటల్లో అడ్మిట్ చేసినప్పటి నుంచీ 'తమ్ముడేడి?' అని అడుగుతూ ఉండేది. తమ్ముడికి జ్వరం వచ్చిందని, అమెరికా హాస్పిటల్లో ఉన్నాడని, త్వరలో వస్తాడని, ఇద్దరూ

ఆడుకోవచ్చని చెబుతూ వస్తున్నాను. కానీ, ఎంతకాలం మోసం చేయగలను తనని? ”

కృత్తిక ఏడుస్తుంటే నా గుండె మెలితిప్పినట్టు అవుతోంది. ఆమె దుఃఖం చూడలేకపోతున్నాను.

అదే దుఃఖంతో చెప్పసాగింది “తన మనసులో అదే మాట ఫిక్స్ అయిపోయింది.. తను అదే భావనతో ఉంది. దాన్ని మేం తుడిచేయడానికి ప్రయత్నించడంలేదు. కాలం గడిచాక తను పెద్దదవుతున్నకొద్దీ భయం వేస్తోంది. తను అడిగే ప్రశ్నలకి నా దగ్గరకానీ, ఆయన దగ్గరకానీ సమాధానం లేదు. ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? ” వెక్కిళ్లు పెట్టసాగింది.

ఒక్కసారిగా నా గుండె చెరువైంది.. అప్రయత్నంగానే నా కళ్ల నుంచి రెండు నీటి బొట్లు జారిపడ్డాయి.

“అన్నీ సక్రమంగా ఉంటేనే బతకడం ఒక సాహసంగా మారిన ఈ రోజుల్లో అలాంటి బాబు బతికి ఏం చేస్తాడు చెప్పండి.. తల్లిగా నేను గుండెల్లో పెట్టుకోగలను.. కానీ, వాడు ఎదిగిన కొద్దీ వాడికి బతుకు బరువైపోతుంది.. నా చిన్నారి తండ్రి ఆ బరువు మోయడం నేను తట్టుకోలేను.. అందుకే.. అందుకే..”

నాపక్కన నిశ్శబ్దంగా ఒక విస్ఫోటం జరిగింది.. ఆ పొగల్లో ఏదో స్పష్టంగా కనిపిస్తుంటే అశక్తతతో నోట మాటరాక మూగగా ఆమెనే చూస్తూ భయంగా, అనుమానంగా అడిగాను.. అందుకే...

“మె.. మెర్సీ కిల్లింగ్.. వాడిని చంపేయమని.. కారుణ్యహత్యకు పాల్పడమని చెప్పాను”

“కృత్తికా! మీకు మతిపోయిందా? ” గట్టిగా అరిచాను.

కృత్తిక వెక్కుతూ అంది “మరి ఏం చేయను? డబ్బు మంచినీళ్లలా ఖర్చవుతోంది.. కానీ వాడిలో మార్పులేదు. వాడు బాగుపడితే చాలనుకున్నాం. కానీ, ఇలాగే పెరిగి పెద్దవాడైతే ఎలా? ఎలా బతుకుతాడు? ఎవరు వాడిని కళ్లల్లో పెట్టుకుని కలకాలం కాపాడగలుగుతారు? ఆంటీ మీరే చెప్పండి.. జ్ఞాపిక భవిష్యత్తు కూడా చూసుకోవాలి కదా.. అందుకే, అందుకే ఆ కసాయి నిర్ణయం తీసుకోవాల్సి వచ్చింది. డాక్టర్ దగ్గర నుంచి వచ్చే నిర్ణయం కోసం నేను నా మనసుని పాషాణంగా మార్చుకుని ఎదురు చూస్తున్నాను”

కృత్తిక రెండు చేతుల్లో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

నాకూ దుఃఖం ఆగలేదు.. చాలాసేపు మౌనంగా నేనూ, ఆమె ఏడుస్తూ ఉండిపోయాం.

“అలా జరగడానికి వీల్లేదు కృత్తికా! నన్ను అక్కడికి తీసుకుని వెళ్లు.. మనం వెళదాం” నెమ్మదిగా ఆమె భుజాల మీద చేయేసి అన్నాను.

“ఎందుకు? ” కన్నీళ్లతో ఆశ్చర్యంగా అడిగింది కృత్తిక.

“వెళదాం.. డాక్టర్‌తో నేను మాట్లాడతాను.. తప్పకుండా ఈ జబ్బుకి చికిత్స ఉంటుంది”

కన్నీళ్లతో పేలవంగా నవ్వింది “లిటిల్ ఏంజిల్స్ దానిపేరు.. దానికి అటాచ్ అయి చిల్డ్రన్‌హోమ్ కూడా ఉంది.. అన్నీ వాళ్లే చూసుకుంటారు”

“లిటిల్ ఏంజిల్స్” అని ఉచ్చరిస్తూ, అడిగాను “ఎప్పుడు వెళ్దాం? ”

“చెప్పాగా.. వాళ్లు ఎప్పుడు రమ్మంటే అప్పుడు”

“అలా కాదు.. రేపు వెళదాం” దృఢంగా అన్నాను.

అప్పటికప్పుడే నా మనసులో ఓ స్థిర నిర్ణయానికి నాంది పడింది.

“నాకు ధైర్యం సరిపోడం లేదాంటీ” వణికే స్వరంతో అంది కృత్తిక.

"లేదు కృత్తికా! నువ్వనుకున్నట్టు జరగదు.. బాబుని బతికించుకుందాం.. నేనున్నాగా.. మీ అమ్మలాంటిదాన్ని.. నమ్ము"

కృత్తిక చప్పున నా గుండెలమీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆమెని ఓదార్చడానికి నాకు మాటలు రాలేదు. మౌనంగా ఆమె వీపు మీద చేత్తో రాస్తూ, నా స్పర్శ ద్వారా ఆమెకి ధైర్యం కలిగించడానికి ప్రయత్నించాను. కాస్సేపటికి తేరుకుంది.

నేను మరి కొంచెంసేపు ఆమెకి ధైర్యం చెప్పి ఇంటికి వచ్చేసాను. ఆ రాత్రి డిన్నర్ కూడా చేయాలనిపించలేదు. కృత్తిక మాటలు, ఏడుపు చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నట్టుగా వినిస్తోంది.

మెర్సీ కిల్లింగ్.. మెర్సీ కిల్లింగ్! లేదు.. అలా జరక్కూడదు. తప్పకుండా తగ్గుతుంది. బాబు బాగవుతాడు. బాగుపడాలి.

గబాగబా కంప్యూటర్ దగ్గరకెళ్ళి ఆన్ చేశాను.. నా ఫైల్ ఓపెన్ అయిందాకా ఆ సమయం వృథా చేయకుండా నా బ్యాంక్ పాస్‌బుక్, చెక్‌బుక్ బ్యాగులో పెట్టుకున్నాను.

ఫైల్ ఓపెన్ అయింది.

కదం తొక్కుతున్నట్టుగా నా కలం పరుగులు పెడుతోంటే ఆ రాత్రి నన్నేదో ఉన్మాదం ఆవరించినట్టుగా నా నవల పూర్తిచేశాను.

మర్నాడు నేనూ, కృత్తిక నా కారులో బాబుని ఉంచిన చోటుకి వెళ్లాం. నగరానికి దూరంగా ప్రశాంతమైన పరిసరాల్లో చూడగానే మనసుని దోచుకునేలాగా ఉంది ఆశ్రమం.. అక్కడే హాస్పిటల్, అక్కడే హాస్టల్, అక్కడే పిల్లలకి స్పీచ్ థెరపీ, ఆటలు, పాటలు నేర్పే రకరకాల పరికరాలు..

గేటు తోసుకుని లోపలికి వెళ్లగానే నా కళ్లబడిన దృశ్యం నన్ను ముగ్ధురాల్ని చేసింది. పిల్లలు కొందరు అరుగుల మీద, కొందరు చెట్లకింద కూర్చున్నారు. మమ్మల్ని చూడగానే నలభై ఏళ్ల స్త్రీ ఎదురుగా వచ్చి. "రండి, రండి! నేనే మీకు కాల్ చేయాలనుకుంటున్నాను" అంటూ ఆహ్వానించి తన గదిలోకి తీసుకుని వెళ్లింది.

నేను ఆవిడని అనుసరించినా నా కళ్లు మాత్రం ఆవిడ గది కిటికీ బైట ఎదగని మనస్తత్వాలతో, వయసు పెరిగినా వీడని అమాయకత్వంతో కనిపిస్తున్న పిల్లలనే చూస్తున్నాయి.

ఆవిడ గదిలోకి వెళ్లగానే "బాబెలా ఉన్నాడు? " అడిగింది కృత్తిక.

ఆవిడ మారు మాట్లాడకుండా "రండి వెడదాం" అంది ముందుకు నడుస్తూ.

కృత్తిక నావైపు ఆందోళనగా, ఆవిడ వైపు అనుమానంగా చూస్తూ, ఆమెని అనుసరించింది. నేనూ వాళ్ల వెనక నడిచాను. ముగ్గురం ఆ హాస్టల్‌కి ఆనుకుని ఉన్న హాస్పిటల్‌కి వెళ్లాం.

చందమామలాంటి మొహం, చెంపకి చారెడేసి కళ్లు, కానీ చూపుల్లో శూన్యం, పలకలేని మౌనం.. తన ఎదురుగా ఎవరున్నారో కూడా అర్థం కాని అయోమయం.. మంచం దగ్గరికి ఆత్రుతగా వెళ్లిన కృత్తిక బాబునలా చూసి తట్టుకోలేని దానిలా నోటికి చెంగు అడ్డు పెట్టుకుని కుళ్లి కుళ్లి ఏడుస్తూ పక్కకి వెళ్లిపోయింది.

నేను బలవంతంగా దుఃఖం ఆపుకుంటూ అడిగాను, అక్కడికి వచ్చిన డాక్టర్‌ని "ఇతను మామూలుగా మారే అవకాశం లేదా? "

డాక్టర్ గంభీరంగా ఉంది. "నిజానికి ఈ జబ్బు ఉన్నవాళ్లు కచ్చితంగా అంతో ఇంతో ఇంప్రూవ్ అవుతారు.. చూశారుగా.. ఆ పిల్లల్ని"

బైట ఆవరణలో ఆడుకుంటున్న

కొందరు పిల్లల్ని చూపించింది.

"వాళ్లు మొదట్లో చాలా దారుణంగా ఉండేవాళ్లు.. ఇప్పుడు చూడండి.. వాళ్ల పనులు వాళ్లు చేసుకోగలుగుతారు. ఏదన్నా చెబితే అర్థం చేసుకుంటారు. మనం పలకమన్న మాటలు, చిన్నచిన్న పద్యాలు అస్పష్టంగా అయినా పలుకుతారు.. కానీ, ఈ బాబు.. ప్చ్. వెరీ బాడ్ లక్.."

నేను చటుక్కున డాక్టర్ చేయి పట్టుకున్నాను "అలా అనకండి.. బాబు మామూలుగా అవాలి.. ఎంత ఖర్చయినా ఫర్వా లేదు.. ప్లీజ్"

డాక్టర్ నా వైపు ఆశ్చర్యంగా చూసింది... "మీరెవరు? "

"నేను.. నేను.." తడబడ్డాను.

డాక్టర్ అంది.. "వాళ్లకి మీరేం అవుతారో నాకు తెలియదు.. కానీ వాళ్ల ఆవేదన, తాపత్రయం కళ్లారా చూస్తున్నదానిగా బాబు తల్లి కోరికను చట్టబద్ధంగానే మన్నించాలనుకున్నాను.. కానీ, బాబు పరిస్థితి చూస్తుంటే ఆ అవసరం లేదనిపించింది.."

"అంటే.. అంటే బాబు ఆరోగ్యం బాగు పడుతుందా? " ఆశగా, ఆత్రంగా అడిగా.

తల అడ్డంగా ఆడించింది డాక్టర్. "నో హోప్! ఆల్‌మోస్ట్ హీ ఈజ్ ఇన్ డెత్ బెడ్"

నేను నిలువెల్లా వణికిపోతూ బాబువైపు చూశాను. తల పక్కకి వాలిపోయి ఉంది.. నోట్లో నుంచి చొంగ కారుతోంది.

"అటు చూడండి.." కంపిస్తూ అరిచాను డాక్టర్‌తో.

డాక్టర్ విసురుగా మంచం దగ్గరకు వెళ్ళి బాబు చేయందుకుని పల్స్ చూసింది. ఆమె "ప్చ్.." అంటూ బాబు చేతిని వదిలేసింది. ఆ చేయి అచేతనంగా పక్కకు వాలింది.

కృత్తిక పరిగెత్తుకుని వచ్చింది.. కాసేపట్లో కృత్తిక హృదయ విదారకమైన రోదనతో, మిగతావాళ్ల వెక్కిళ్లతో విషాదం ఆవరించింది ఆ ప్రాంగణమంతా..

'అయ్యో! ఇందుకా నేను వచ్చింది ఇక్కడికి? నా కళ్లారా ఆ పసివాడి ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోడం చూడ్డానికా? ' నాకు దుఃఖం ఆగలేదు.

కాసేపట్లో కృత్తిక భర్త, అతని వెంట నలుగురు స్నేహితులు వచ్చారు. ఫార్మాలిటీస్ పూర్తిచేసి, బాబు మృత దేహాన్ని తీసుకుని వెళ్లిపోయారు. ఏడుస్తున్న కృత్తికను దగ్గరకు తీసుకుని బలవంతంగా నడిపిస్తూ కారువద్దకు అడుగులేస్తున్న ఆమెభర్త గాంభీర్యం చూస్తే భయమేసింది నాకు.

"అయామ్ సారీ" డాక్టర్ హీనస్వరంతో అంది.

నేను కళ్లు తుడుచుకుని నా బ్యాగులోంచి చెక్కు బుక్కు తీశాను.. తీసుకున్న నిర్ణయం అమలు పరచాల్సిన సమయం ఇదే.. ఇంతకాలం నేను సంపాదించి, కూడబెట్టిన డబ్బు సద్వినియోగం కావాలి.. భావిభారత పౌరులైన ఈ చిన్నారులు సంపూర్ణ ఆరోగ్యంతో కళ, కళలాడాలి.. అందుకు డబ్బు కావాలి.. ఆ డబ్బు నా దగ్గర ఉంది.. చక చకా అమౌంట్ రాసి, సంతకం చేసి ఆ చెక్కు డాక్టర్ చేతికిస్తూ అన్నాను "ఎవరి పేరుమీద రాయాలో మీరు రాసుకోండి.. ఇక ముందు ఈ సమాజంలో ఇలాంటి మరణాలు జరక్కుండా చూడండి.." అంటూ నిశ్చేష్టురాలై చూస్తున్న డాక్టర్‌ని పట్టించుకోకుండా పరిగెత్తుకుంటూ వెళ్లి కృత్తిక కూర్చున్న కారులో ఆమెకి మరో పక్క కూర్చుని, ఆమె ఒడిలోంచి బాబు దేహాన్ని తీసుకుని నా ఒళ్లో పెట్టుకున్నాను..

కారు కదిలింది..

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**అత్తిలి కస్తూరి బాయి**
ఇ.నెం. 19-12-308,
బైరాగి పట్టెడ, తిరుపతి,
చిత్తూరు జిల్లా
పిన్ : 517501

## చతురంగం - 34 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఆ | నం | 2 దం | | 3 నే | 4 తా | జీ | | 5 మో | 6 వి |
| మ | | 7 డ | జా | ర | గు | | 8 ఉ | ద | ధి |
| 9 ని | 10 దా | నం | | ము | | 11 జ్వ | ర | ము | |
| | వా | | 12 చీ | | 13 బ | ల | గం | | 14 న |
| 15 కో | న | 16 సీ | మ | | 17 కా | నం | | 18 కా | య |
| 19 క | ల | త | | 20 మ | సు | | 21 వి | మా | నం |
| | ము | | 22 మ | ధు | ర | 23 మీ | నా | క్షి | |
| 24 అ | | 25 ఉ | ద | రం | | 26 గ | య | | 27 ప |
| 28 మి | 29 స్వా | మ | రా | | 30 జ | డ | కు | 31 చ్చు | లు |
| 32 తం | తి | | 33 సు | నీ | త | | 34 డు | ము | కు |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. చుండూరు అప్పల నరసింహం, బాచుపల్లి, 2. బి. సత్యనారాయణ, కొత్తగూడెం, 3. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్, 4. యు. జాన్సీలక్ష్మి, హైదరాబాద్, 5. మండవెంకట జోగేశ్వరశర్మ, అరసవిల్లి, శ్రీకాకుళం జిల్లా, 6. కె. లక్ష్మీకమల, విజయవాడ, 7. యమ్. అలమేలు, మల్కాజిగిరి, 8. జి. ప్రభాకర్‌రావు, మల్లాపూర్, 9. కె. లక్ష్మీనరసింహారావు, విజయవాడ, 10. గేదెల రామారావు, ఏలూరు, 11. పి. జయశ్రీ, హైదరాబాద్, 12. ధరణి పార్థసారథి, డి.డి. కాలనీ, హైదరాబాద్, 13. సూరి నాగరాజు, రామవరప్పాడు, కృష్ణాజిల్లా, 14. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 15. యు. విజయశేఖర్‌రెడ్డి, కూకట్‌పల్లి, 16. డాక్టర్ శివభూషణం, కర్నూలు, 17. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 18. నెల్లుట్ల ప్రేమలత, ప్రగతినగర్, హైదరాబాద్, 19. కె. పద్మజ, సికింద్రాబాద్, 20. పొన్నపల్లి వెంకటప్పయ్య, నూజివీడు, 21. అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం, శేర్లింగంపల్లి, హైదరాబాద్, 22. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 23. పి. రంగనాథం నాయుడు, తిరుపతి, 24. సి. జనార్ధన సింగ్, నల్లకుంట, 25. టి. అంజలి, తిరుపతి, 26. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 27. వి.వి. సత్యనారాయణశెట్టి, తిరుపతి, 28. ఎమ్. వసంత, బోరబండ, 29. కె. నాగభూషణం, మౌలాలి, 30. కోడుగంటి విజయలక్ష్మి, హైదరాబాద్, 31. ఇందన మల్లికార్జున్‌రావు, ఏలూరు, 32. లలిత దేవులపల్లి, ఉయ్యూరు, కృష్ణా జిల్లా, 33. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 34. మద్దూరి లక్ష్మీరాజ్యం, హైదరాబాద్, 35. వి.వి. గోపాల్, విజయవాడ, 36. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 37. ఐరేని శ్రీనివాస్‌గౌడ్, కొంపల్లి, సికింద్రాబాద్, 38. సిహెచ్.వి.ఎస్.ఎల్. రాజేశ్వరి, కాకినాడ, 39. బి. ప్రభావతి, అలకాపురి, హైదరాబాద్, 40. ఎమ్. లలితకుమారి, గుంటూరు, 41. టి.వి.డి.ఎస్. సీతారామారావు, పంజగుట్ట, 42. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 43. ఎమ్. రామచంద్రరావు, హిల్‌కాలనీ, నల్గొండ జిల్లా, 44. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 45. జె. లక్ష్మి, ట్రూప్‌బజార్, హైదరాబాద్, 46. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 47. వంకాయల చిరంజీవి, రాజమండ్రి, 48. యనమండ్ర రామకృష్ణారావు, విశాఖపట్నం, 49. యనమండ్ర వెంకటేశ్వరరావు, విశాఖ, 50. ఎస్. నాగశ్వేత, బెంగళూరు, 51. ఎస్. శ్రీహరి, బెంగళూరు, 52. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 53. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 54. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 55. యన్. శేషఫణిశర్మ, కర్నూలు, 56. పి.వి. రవికుమార్, తిరుపతి, 57. కె. వెంకట బ్రహ్మమ్మ, బాపట్ల, 58. వి.వెంకటసత్యగంగరాజు, విశాఖ, 59. నార్నె చంద్రబాబునాయుడు, గుంటూరు, 60. పి. భవానీదేవి, గుంటూరు, 61. వి.పి. కిరణ్, బెంగళూరు, 62. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 63. గుడిపాటి కనకదుర్గ, బాపట్ల, 64. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 65. ఎన్.కె. అరవెల్లి, మహారాష్ట్ర, 66. ప్రతాపురం రామానుజాచారి, హన్మకొండ, 67. గుర్రపు పురుషోత్తం, హన్మకొండ, 68. ఆండ్ర అచ్యుతరామయ్య, తణుకు, 69. ఎస్. మణిమేగలై, తిరుపతి, 70. ఆర్. లక్ష్మి, శ్రీకాకుళం, 71. యు.యు.యు, ఎమ్మిగనూరు, 72. లక్ష్మణరావు మంచాళ, విశాఖ, 73. చాట్ల విజయకృష్ణ, కామారెడ్డి, 74. వి.ఆర్. వంశీకృష్ణ, రాయచోటి,

*(మిగతా 128 పేజీలో..)*

# చతురంగం - 35 ఆధారాలు

## అడ్డం

1. కేసీఆర్ అధ్యక్షుడుగా ఉన్న పార్టీ పొట్టిపేరు (3)
3. వసంతం, 'మిస్టర్‌పెళ్లాం' నాయిక (3)
5. స్థలం (2)
7. శేషం (3)
9. 'మార్చురీ'కి తెలుగు (4)
11. 'కొత్త'కు వ్యతిరేకం (2)
13. యుద్ధం (3)
14. రక్తవాహిక (2)
15. మాంసము, బురద (4)
16. సారాంశం, రసం (2)
18. ఎక్కువ, సర్వత్రా పనికిరానిది (2)
19. 'జయం' సినిమా నాయిక (2)
20. 'జయ'ను పిలవండి (2)
22. భారతీయ మహిళల్లో అత్యధికులు ధరించే వస్త్రం (2)
23. జటాయువు సోదరుడు (3)
24. స్థిరత్వం (4)
27. కలం రాయాలంటే కావాల్సింది, ఝాన్సీతో తనికెళ్ల తీసిన ఆర్ట్ ఫిలిం (2)
28. నిలువు 19 మరో రకంగా (3)
32. విల్లుంటే చాలదు... ఇదీ కావాలి మరి (3)
33. గోవిందుడే...గోవులకు పతిగా... (4)
35. '- - రాతిరీ జాబిలమ్మా..!' (2)
36. ఒకనాటి వెండితెర హాస్యనటి (3)
37. నాజూకు.. సున్నితం... అటునుంచి (3)

## నిలువు

1. 'సైకిల్' ఎన్నికల గుర్తుగా ఉన్న పార్టీ పొట్టిపేరు (3)
2. స్నేహితురాలు (2)
3. బాగా జిడ్డుగా ఉండే తైలము (4)
4. రాత్రి (2)
5. శివరాత్రికి చేసేది (3)
6. గారాబం (2)
8. 'చంద్రముఖి'లో రజనీకాంత్ ఊతపదం (4)
10. కోతి (3)
12. ఓ నది, సూర్యపుత్రి (3)
16. సామాన్యం (2)
17. రామాంజనేయ యుద్ధానికి ఈ రాజు కారకుడు (3)
18. పుడమి (3)
19. సరస్సులో పుట్టిన తామరపువ్వే (4)
20. 'జపం' బహువచనం (3)
21. గాంధీగారికి దేని క్షీరం ప్రియం? (2)
25. ఉప్పు (4)
26. ఆడవాళ్లు అందంగా అల్లుకునేది తిరగబడింది (2)
29. అల, బుల్లితెర నటి (3)
30. క్రయవిక్రయాలు చేసే వృత్తి (3)
31. - - - తొక్కనేల? (3)
32. పెళ్లికి కావాల్సిన వాటిలో ఇదీ ఒకటి (2)
34. లోపల గింజలేని ధాన్యం తలకిందులు (2)

*(127 పేజీ తరువాయి)* 75. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 76. యన్. అరుంధతి, కరీంనగర్, 77. కందికుప్ప వెంకటరమణ, బెంగళూరు, 78. ఎస్.సి. సీతాదేవి, ఆత్రేయపురం, తూ.గో. జిల్లా, 79. షేక్ నజీర్‌బాషా, కోట, నెల్లూరు జిల్లా, 80. సి.కె. శాస్త్రి, గుంటూరు, 81. తువ్వా మాధవమోహన్‌రెడ్డి, కర్నూలు, 82. పక్కి శ్రీదేవి, చీపురుపల్లి, విజయనగరం జిల్లా, 83. సిరివెల్లి ఆదిత్య, కర్నూలు, 84. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, 85. అద్దంకి శ్రీరామచంద్రమూర్తి, దేవరకొండ, 86. దేవళ్రాజు లలితాదేవి, చైతన్యపురి, 87. దేవళ్రాజు వెంకటనరసింహారావు, చైతన్యపురి, 88. గెడ్డం రామస్వామి, వీరవరం, తూ.గో. జిల్లా, 89. కె. లక్ష్మీనారాయణ, నిజామాబాద్, 90. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 91. తాండ్యాల రామచందర్, చెన్నై, 92. కె. సుబ్రమణ్యం, అనంతపూర్, 93. పి. లక్ష్మీప్రసన్న, మెహదీపట్నం, 94. ఎం.వి. సోమసుందర్‌రావు, వనస్థలిపురం.

# చతురంగం - 35

రూ.150/- బహుమతి

గడువు తేది : ఫిబ్రవరి 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 | ■ | 5 | 6 |
| | ■ | 7 ఖి | 8 | | ■ | 9 | 10 | | |
| 11 | 12 | ■ | 13 | | | ■ | 14 | | ■ |
| ■ | 15 ప | | | | ■ | 16 | | ■ | 17 |
| 18 | | ■ | | ■ | 19 | | ■ | 20 | |
| | ■ | 21 | ■ | 22 | | ■ | 23 | | |
| 24 | 25 | | 26 | ■ | 27 | | ■ | | ■ |
| ■ | | ■ | 28 | 29 | జ | ■ | 30 | ■ | 31 |
| 32 | | | ■ | | ■ | 33 | | 34 | |
| 35 | | ■ | 36 | | | ■ | 37 | తా | |

పంపినవారి పేరు: ------------------------------------------

వయసు (      ) చిరునామా : ------------------------------------

------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ----------------



**ఆధారాలు**

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు.

★ చతురంగం, చతురప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం.

# మల్లాదివారి చతురోక్తులు



అటు సాహిత్యం లోను, ఇటు సినీ రంగంలోను తమ అసాధారణ ప్రతిభని కనబరిచినవారు మల్లాది రామకృష్ణశాస్త్రి. కృష్ణాతీరం నుంచి మెరీనాతీరం వరకు మల్లాదివారు జరిపిన సాహితీయాత్ర మాట అటుంచితే, ఆయన గొప్ప చమత్కారి అని ఎన్నో సందర్భాల్లో వెల్లడయింది. ఆయన చతురోక్తులు కొన్ని..

## నేనూ నీలాంటోడ్నే!

ఒక సందర్భంలో మల్లాదివారు సాహితీ బృందంతో తమ ఇంట సమావేశమైనప్పుడు ఒక మూగ కోయవాడు వచ్చి సౌంజ్ఞలతో తాను జోస్యం చెప్తానన్నాడు. "వద్దు, వెళ్లు' ' అని అక్కడివారు హస్తాభినయంతో ఎంత చెప్పినా అతను కదలట్లేదు. అది చూసిన మల్లాదివారు లోపలికి వెళ్లి, ఒక తాళపత్ర గ్రంథాన్ని అతనికి చూపించారు. ఆ కోయ వాడు మల్లాదివారికి నమస్కరించి, క్షణం ఆలస్యం చేయకుండా వెళ్లిపోయాడు.

మల్లాదివారు ప్రయోగించిన 'చిట్కా' ఎవ రికీ అర్థం కాలేదు. వారి ముఖంలోని భావాలు పసిగట్టిన మల్లాదివారు "నేనూ జ్యోతిష్కుడ్నే అన్నట్లు ఈ తాళపత్ర గ్రంథాన్ని చూపించానంతే.. అతను పారిపో యాడు!" అన్నారు.

మల్లాదివారి సమయస్ఫూర్తికి, హాస్యప్ర జ్ఞకు అక్కడివారికి నోట మాట రాలేదు!

## ఇంకా ఏడ్పించడం ఎందుకు?

ప్రేమ్‌చంద్ 'నిర్మల' నవల ఆధారంగా అభ్యుదయ భావాలుగల జి. రామినీడు 'మా ఇంటి మహాలక్ష్మి' చిత్రం నిర్మించారు. నవలని అనుసరిస్తూ సినిమాని కూడా దుఃఖాంతం చేద్దామనుకుని, ఎందుకైనా మంచిదని మల్లాదివారి అభిప్రాయం అడిగారాయన.



మల్లాదివారు అందుకు సమ్మతించక "చిత్రంలో పాత్రలన్నీ కష్టాలు పడతాయి. ఇవి చాలవన్నట్లు, చివర్లోనూ సినిమాని దుఃఖాంతం చేసి, ప్రేక్షకులను కష్టపెట్టి, వారి నేడ్పించడం ఎందుకు? " అన్నారు.

రామినీడు మల్లాదివారి మాటను గౌరవించారు. దాంతో విడుదలయ్యాక ఆ సినిమా సుఖాంతమై నిర్మాతకీ సుఖసంతోషాలు తెచ్చిపెట్టింది.

# ఎందుకు మాట్లాడాలో?

సినీ పరిశ్రమలోని చాలామంది తెలుగు వారు ఇంగ్లీషులోనే మాట్లాడుకుంటూ తమ ఆంగ్ల భాషా 'పరిజ్ఞానాన్ని' వెల్లడిస్తూ ఉంటారు. కాని మల్లాదివారు సరళమైన



తెలుగులోనే ఎవరితోనైనా మాట్లాడేవారు. "మీరెందుకు ఇంగ్లీషులో మాట్లాడరు? " అని ఒకరు మల్లాదిని అడిగారు. అనేక భాషలతో పాటు ఆంగ్ల భాషనీ కాచి వడపోసిన మల్లాదివారు "మనకి ఇంగ్లీషు వచ్చని తెలియ చేయడానికి మాట్లాడాలా? లేకపోతే అవతలి వారికి అర్థమవదని ఆనందించడానికి మాట్లాడాలా? " అన్నారు చిరునవ్వుతో..



# శత్రుఘ్నుడి జంటేది?

సినిమా రంగంలోకి అడుగుపెట్టడానికి ముందు మల్లాదివారు 'కృష్ణా పత్రిక'లో అనేక చిత్రాలను సమీక్షించారు. ఆయన సునిశిత దృష్టినుంచి ఏ సన్నివేశమూ తప్పించుకోలేకపోయేది.




వేలు పిక్చర్స్ 'సీతా కళ్యాణం' చిత్రాన్ని సమీక్షిస్తూ 'వివాహ దృశ్యాలలో రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు ధర్మపత్నులతో కనిపించారు. అయితే చివరికి అగ్ని ప్రదక్షిణ ఘట్టంలో మూడే జంటలు ఉన్నాయి. శత్రుఘ్నుడి జంట లేదు. ఏమిటీ వైపరీత్యం? '- అని రాశారు.

చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభమేమిటనుకున్నారు నిర్మాత, దర్శకులు. మల్లాదివారి దృష్టిలో పడ్డందుకు కక్కలేక, మింగలేక మిన్నకుండిపోయారు.

# అది నా కలం పేరు ?

తెలుగు చలన చిత్రసీమలో 'సీనియర్' అనే పేరు మీద వెలువడిన పాటలు శాస్త్రిగారు రాసినవేనని ప్రచారంలో ఉండేది. ఎందుకంటే అప్పటికే చలనచిత్రరంగంలో రచయితగా, నిర్మాతగా, దర్శకుడిగా, నేపథ్య గాయకుడిగా ప్రసిద్ధి చెందిన సముద్రాల రాఘవాచార్య



'సముద్రాల సీనియర్' పేరుతో రచనలు చేసేవారు. ఆయనకు పని ఒత్తిడి ఎక్కువయినప్పుడు మల్లాదివారితో వాటిని చేయించుకునేవారు.

అందుకే అందులో నిజానిజాలు తెలుసుకోవాలని కొందరు మల్లాదివారినే నేరుగా ఆ విషయంపై కదిలించారు. దానికాయన "ఇప్పుడు భాగవతుల శివశంకర శాస్త్రి అనే పేరుగల కవి ఆరుద్ర పేరుతో ఎలా రాస్తున్నారో నేనూ అలాగే మారుపేరుతో రాస్తున్నాను. అది నా కలం పేరని ఎందుకు అనుకోకూడదు? " అన్నారు మల్లాదివారు తడుముకోకుండా. దాంతో ఆయనను ప్రశ్నించినవారు పక్కున నవ్వేశారు.

# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?

ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ. 280/- చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది



## చతుర విపుల



ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
గుబాళింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే పరిమళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది

అది నూతన సంవత్సర శుభవేళైనా
పుట్టిన రోజైనా.. పెళ్లి రోజైనా..
పండుగయినా పబ్బమైనా సరే
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..

# కొత్తగాలి...



కేజ్రీవాల్ అంటే చాలు
'క్రేజ్' మొదలయ్యింది
ఇంటిచెత్తకే కాదు
సంఘం చెత్తకీ చీపురే!

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ, హైదరాబాద్

# కొత్తగాలి...

**ఉదయ కిరణం**
**అస్తమించడం**
**నిజంగా**
**'చిత్రం!'**

- *యు. విజయశేఖర రెడ్డి,*
*కూకట్‌పల్లి*

## కొత్తగాలి...

**నిరంతరం హృదంతరంలో**
**ప్రేమకోసం తపిస్తూ బతకడం**
**ఎండమావుల్లో**
**నీళ్లకోసం వెతకడం!**

– యిర్రి భక్తవత్సలరావు,
చిలకలూరిపేట

# కొత్తగాలి...



కలలా వచ్చి
అలలా వెళ్లేది స్నేహం కాదు
తోడుగా వచ్చి నీడగా
ఉండేది స్నేహం

– ఎ. వినోద్ కుమార్,
పుల్లంపేట, కడప జిల్లా

# కొత్తగాలి...



**మనిషికీ మనిషికీ మధ్య**
**నాడు అనుబంధం**
**నేడు అగాధం**

– ఆర్.ఎస్. హైమవతి,

చెన్నై

# కొత్తగాలి...



**సినీ మాయా జగత్తులో**
**పాకుడురాళ్లపై నడవలేక**
**అధోజగత్తుకు జారుతున్న**
**ఉదయ కిరణాలెన్నో!?**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

# కొత్తగాలి...



రోజూ పని ఇరవై గంటలు
జీతం భత్యం లేని కొలువులు
బోనస్‌గా సాధింపులు
ఆ ఉద్యోగి పేరే ఇల్లాలు!

– ఈరంకి విజయ,
రావాన్, చత్తీస్‌గఢ్

## కొత్తగాలి...



**ఆధునిక భారతంలో**
**అవినీతి, ఆధ్యాత్మికత**
**సమాంతరంగా**
**'అభివృద్ధి' చెందుతున్నాయి**

– *తాజీప్రసాద్,*

చెన్నై

## కొత్తగాలి...



హైటెక్ బస్సుల్లో ప్రయాణం
హైలెవెల్లో ప్రాణాంతకం
హైవేల్లో ఉన్నాడు యముడు
'వోల్వో' కోసం కాసుకున్నాడు!

– *జడగం నాగేశ్వరుడు,*

హైదరాబాదు

# కొత్తగాలి...



మనిషికి
నవ్వు అందం!
చెట్టుకు
పువ్వు అందం!!

– గుర్రం శ్రీనివాస్,
చెరుకుపల్లి, గుంటూరు జిల్లా

# కొత్తగాలి...



**కవి**
**కలం సైనికుడు**
**నిశ్శబ్ద మార్పుకు**
**వైతాళికుడు**

– వల్లభాపురం జనార్దన్,
మహబూబ్‌నగర్

## కొత్తగాలి... 

**లక్షలు లేనివాడు**
**పేద**
**లక్ష్యం లేనివాడు**
**నిరుపేద!**

– వి.వి.యస్.మూర్తి,
చొదిమెళ్ల, ప.గో. జిల్లా

# కొత్తగాలి...



**వృద్ధాప్యం ఫలం కాదు**
**పండుటాకు**
**ఎవరిక్కావాలి?**
**నేలకి తప్ప!**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

# మనసున ఉన్నదీ...

★ జనవరి చతురలో ప్రచురించిన నవల 'కొల్లేరు కంటనీరు' ఆ ప్రాంత రైతుల దురవస్థను చిత్రించింది. శీను వంటి చిన్నపిల్లలు చదువులేకుండా తిరగడం, ఆస్తులు హరించుకుపోవడం, సారవంతమైన భూములు చేపల చెరువులుగా మారడంలాంటి కాలానుగుణమైన మార్పులకు ఆ నవల అద్దం పట్టింది. పిచ్చయ్యలాంటి వ్యక్తులు ఉంటే రైతులలో చైతన్యం తేవచ్చనే విషయాన్ని తేటతెల్లం చేశారు. మంచి నవలను ప్రచురించినందుకు కృతజ్ఞతలు.

– ***చింతపల్లి విజయలక్ష్మి,*** విజయవాడ

★ జనవరి నవల 'కొల్లేరు కంటనీరు'లో ప్రకృతి అందచందాలతో పాటు, వికృత విలయ తాండవ విషాదచేష్టలను కథానాయకుడి బాల్య స్మృతుల నేపథ్యంలో రచయిత చక్కగా వివరించారు. మనిషి స్వార్థం, సంకుచిత మనస్తత్వం ప్రకృతిలోని చెట్టుచేమ, పశుపక్ష్యాదులకు ఎలా శాపంగా మారతాయో కళ్లకు కట్టినట్లు చిత్రించారు. అక్షరధార, చతురకతలు, కాలాతీతం మమ్మల్నెంతగానో అలరించాయి.

– ***యు. చిట్టిబాబు,*** కొత్తపాల్వంచ, ఖమ్మంజిల్లా

★ నీళ్లు ఎక్కువైతే ఎలాంటి ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుందో కళ్లకు కట్టినట్లు రచయిత వివరించారు 'కొల్లేరు కంటనీరు' నవలలో. కొల్లేటి అందాలను సజీవచిత్రంగా కళ్లముందు నిలిపారు. ఆడవాళ్లు కాలకృత్యాలు తీర్చుకోవడానికి సైతం ఎంత ఇబ్బంది పడాల్సి వస్తుందనేది హృదయాన్ని కలచివేస్తుంది.

– ***టి. అంజలి,*** తిరుపతి

★ అక్కినేని కుటుంబరావు నవల 'కొల్లేరు కంటనీరు' చదివాక రచయిత ఆత్మకథను చదువుతున్నామా అనే అనుభూతి కలిగింది. కొల్లేరు, ఆ పరిసరప్రాంత జీవకోటి.. క్రిమికీటకాలు, పశుపక్ష్యాదులు, ప్రకృతి అందచందాలు, ప్రకోపాలన్నింటినీ ప్రత్యక్షంగా తిలకించినట్లనిపించింది. జలపాతపు స్వచ్ఛమైన నీటిలా, తేట తెలుగు ప్రవాహంలో తడిసి ముద్దయినట్లుగా మనసు ఆనందంతో నిండిపోయింది. మొత్తంగా ఓ మంచి నవల చదివిన సంతృప్తి కలిగింది.

– ***మహమ్మద్ తహసీన్ అలి,*** వరంగల్

★ జనవరి 'చతుర'కు శ్రీహిత ముఖచిత్రం కొత్తదనాన్ని నింపింది. కుటుంబరావు నవల 'కొల్లేరు కంటనీరు' కంటతడి పెట్టించింది. కొత్తగాలి కవితలు బాగా ఆకట్టుకున్నాయి.

– ***అగతముడి చాందిని,*** శ్రీకాకుళం

★ జనవరి 'చతుర' ఆకర్షణీయంగా ఉంది. చతురకతలు చాలా బాగున్నాయి. 'కొత్తగాలి' కవితలు బాగా చదివిస్తున్నాయి. 'చతురంగం' మెదడుకు మేత పెడుతోంది. అక్కినేని కుటుంబరావు నవల 'కొల్లేరు కంటనీరు' పాఠకుల నుంచి చక్కటి ప్రశంసలనందుకుంది.

– ***యం. శ్యామల, శ్రీనివాసరావు,*** నర్సీపట్నం

★ అక్కినేని కుటుంబరావు నవల 'కొల్లేరు కంటనీరు' చాలా అద్భుతంగా ఉంది. ఈ నవల చదివినంతసేపు ఆ రోజుల్లోకి వెళ్లి శ్రీను, లక్ష్మి, బేబీవంటి పిల్లలతో పిల్లలమై కొల్లేటి ఆనందాలు అనుభవించాం. అప్పటి అందాలూ, బాధలూ, ప్రజల జీవనశైలీ స్మృతిలో మెదిలాయి. కొల్లేరు మనకి కమ్మటి జ్ఞాపకం. వర్తమానం మాత్రం విషాదకరంగానే ఉంది. జరిగిన తప్పిదాన్ని ఏనాటికీ సరిదిద్దుకోలేమా?

– ***ఎస్.సి. సీతాదేవి,*** ఆత్రేయపురం

★ జనవరి నవల నిరుపేద కుటుంబాల పరిస్థితులకు దర్పణం పట్టింది. కొల్లేరు సరస్సు ప్రాకృతిక వాతావరణాన్ని, మారుమూల పల్లెటూరి రాజకీయ, సామాజిక, మానవతాదృక్పథాన్ని కళ్లకు కట్టింది. 'అక్షరధార'లో అందిస్తున్న అంశాలు ప్రతి వ్యక్తీ అవలంబించదగినవి.

– ***టి.వి.డి.ఎన్. సీతారామారావు,*** పంజాగుట్ట

---

**చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082**

ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

మునిపల్లె రాజు




# పూజారి

**'పూజారి' నవల 1952లో ప్రచురితమైనప్పటికీ ఎంతోమంది సాహితీప్రియులకి నేటికీ గుర్తుండిపోయింది. దిగులు, ఉదాసీనత, నిర్లిప్తత, నిరాసక్తతలాంటి విభిన్న మనస్తత్వ వ్యక్తీకరణలను చిత్రీకరించడం పెద్ద సవాలైనా రచయిత మునిపల్లెరాజు అలవోకగా దాన్ని సాధించారీ నవలలో. ఈ నవల ఆధారంగా బి.ఎన్.రెడ్డి దర్శకత్వంలో నిర్మించిన 'పూజాఫలం' సినిమా 1964 జనవరి 1న విడుదలైంది. ఆ సినిమా వచ్చి యాభైఏళ్లయినా అందులోని 'పగలే వెన్నెల.. జగమే ఊయల' సంగీతప్రియులను నేటికీ ఉయ్యాలలూగిస్తూనే ఉంది.**

చిన్న కథనైనా, నవలనైనా సినిమాగా తీయడం చాలాకష్టం. ఎందుకంటే కథా రచనలో వర్ణించినదంతా దృశ్యరూపంగా తెరమీదకి రాదు. 'అతను మన్మథుడిలా ఉన్నాడు' అని కథలో రాసేయవచ్చు. అది దృశ్యంగా మార్చటం చాలా సున్నితమైన ప్రక్రియ. అలాగే ఓ రచనను సినిమా చేయాలనుకున్నప్పుడు కథా గమనం, కాలంలాంటి అనేక ఇబ్బందులు తలెత్తుతాయి. వీటన్నిటికన్నా కష్టమైంది మనస్తత్వ చిత్రణ.


మునిపల్లె రాజు

దిగులు, ఉదాసీనత, నిర్లిప్తత, నిరాసక్తత.. ఇలాంటి విభిన్న వ్యక్తీకరణలను చిత్రీకరించడం పెద్ద సవాలు. 'పూజారి' నవలకి పునాది మానసిక ప్రపంచమే. అందుకే, 'పూజాఫలం' చిత్రం ఎందరికో నచ్చినా, ప్రఖ్యాత దర్శకులైన బి.ఎన్. రెడ్డికి ఎంతో కీర్తినిచ్చినా, రచయిత మునిపల్లెవారికి కొన్ని అభ్యంతరాలు ఉండిపోయాయి.

'పూజారి' నవల ఆరంభమే ఎంతో గాఢమైంది. రచయిత ప్రత్యేక తాత్వికత, అంతర్దృష్టి ఎలాంటిదో తెలిపే ఆరంభం. ఆ ఊరి పార్క్‌తో కథ మొదలవుతుంది.

ఆ పార్క్ ఆలనాపాలనా ఎవరికీ పట్టనట్టుగా ఉన్న పరిస్థితి.. అది ఉపయోగంలో ఉన్నా ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళు వాడుతున్నారు. శిథిలావస్థకి చేరుతున్న దాని పరిస్థితిగానీ, పచ్చగా సౌందర్యంతో ఉండాల్సిన దాని అవసరాన్ని గానీ గుర్తించినవాళ్ళు లేరు. పార్క్ ప్రజా జీవితానికి, సామాజిక చైతన్యానికి, వ్యక్తి వికాసానికి కూడలి. ఆ విషయాన్ని రచయిత సూచిస్తూ, నవలానాయకుడు మధు జీవితాన్ని పాఠకులకి పరిచయం చెయ్యటానికి చక్కగా వాడుకున్నారు. నవల ఆరంభానికి ఇంతటి సృజనాత్మక తాత్విక శిల్పం చాలా అరుదుగా చూడగలుగుతాం.

పెద్ద జమీ అంతటి ఆస్తికి ఏకైక వారసుడు మధు. చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోయారు.

ఎవరూ తీర్చలేని లోటు అది. తాతగారు మధుని సంరక్షించినా, క్షయ వ్యాధి కారణంగా ఆరోగ్యం కోసం మదనపల్లె శానిటోరియం, నీలగిరి కొండల్లో కాలం గడుపుతున్నాడు. నమ్మకమైన గుమాస్తా రామకృష్ణయ్య, సొంత బిడ్డలా సాకిన ఇంటి నౌకరు రంగప్ప ఎవరూ లేని మధుని ఎంతో అపురూపంగా చూసుకుంటుంటారు. ఆస్తి, సౌకర్యం, సంరక్షణా వున్నా మధుకి ఉత్సాహం లేదు. ఒంటరిగా గడచిన బాల్యం దానికి చాలా వరకు కారణమైతే, అతని దిగులు మనస్థత్వం కూడా దానికి తోడవుతుంది. 'అతడు నిరాశా వేదాంతి' అన్న ఒక్క వాక్యంతో మధు తత్వానికి రచయిత పటం కట్టగలిగారు. 'తను జన్మించింది.. తనదైన ప్రతి వస్తువునూ, తను కోరిన ప్రతిదాన్నీ కోల్పోవటానికేననే సంక్షోభిత నమ్మకంతో అతను జీవనయాత్ర సాగిస్తున్నాడు' అంటారు మధు గురించి. ఈ తత్వమే 'పూజారి' నవల ఆయువుపట్టు. నవల ఆరంభంలోని పార్క్‌కి, మధుకి సామీప్యం చదువరుల మనసుల్లో మెదుల్తుంది.

అతని అనాసక్త జీవితానికి భిన్నంగా, మధుకి రెండు అలవాట్లున్నాయి. ఒకటి సంగీతం పట్ల ఆసక్తి, అభిరుచి. రెండోది అంతగా చదువుకోవాల్సిన అవసరం లేకపోయినా, క్రమం తప్పకుండా కాలేజీకి వెళ్లటం. తప్పనిసరిగా చెయ్యాల్సిన కార్యాలేం అతనికి లేవు. ఇల్లు, ఆస్తి వ్యవహారం అంతా రామకృష్ణయ్య, ఇంటి పనంతా నౌకరు రంగప్ప చూసుకుంటారు.

ఊళ్ళో దొంగతనాలు ఎక్కువగా ఉండటం వల్ల తాతయ్య సలహామేరకు, ఆ పెద్ద ఇంటి కిందిభాగం ఓ బేంక్ మేనేజర్‌కు అద్దెకిచ్చారు. ఆయన కూతురు ప్రీతి. ఆ ఇంటికి ప్రీతి రాక, ఓ అనూహ్య అనుభవం మధుకి. మధు తీరుకి పూర్తిగా భిన్నమైనది ప్రీతి తీరు. ఆమెతోటి తొలి, మలి పరిచయాలే మధుని ఓ మధురానుభూతిగా కమ్మేశాయి. ఆమె అల్లరి, చొరవ, అతని ప్రమేయం లేకుండానే వచ్చి వెళ్లటం.. 'గాలివాన వలె వచ్చి, పూలజల్లు వలె పోయింది' అన్న ఒక వాక్యంతో ప్రీతి నడవడిని, మధు పరిస్థితిని కళ్ళకు కట్టించారు రచయిత. కొద్ది కాలంలోనే ప్రీతి, మధుకి సర్వస్వం అయిపోయింది. అస్తమానం ఆమె ధ్యాసే. 'నిరాశా పరివేధిత వేదాంతంలో సున్నితమైన జడునిగా మారిన మధు, ఆ వసంత వాయు ప్రసారంతో తిరిగి చైతన్యవంతుడు కాసాగాడు. ప్రీతి వసంతవాయువు' అంటారు రచయిత. 'ఆ విశ్వాస దేవతను చూచి బతుకునే నమ్మవచ్చు, మృత్యువునే కౌగలించవచ్చు' అన్నంత మార్పు మధులో. ఆడపిల్లతో మాట్లాడటమే ఎరగని మధుకి అదో దైవానుభూతి.

ప్రీతిలాగే, మధుకి పట్నంలో చదువు దగ్గర మరో పరిచయం అయింది. అది శ్రీరాంతో. అతడు కావడానికి పేదవాడైనా, ధ్వనించే ఆత్మ బలం లాంటివాడు. భవిష్యత్తుమీద గొప్ప నమ్మకం. 'శ్రీరాం మధుకి బాగా నచ్చాడు. ఆత్మీయత ఏర్పడింది. కొంచం తరచిచూస్తే.. ప్రీతి ఎందుకు నచ్చిందో, మధుకి శ్రీరాం కూడా అందుకే నచ్చాడు. మధుకి నచ్చింది, తనలో లేని, వాళ్ళలో ఉన్న ఆశ, ఆత్మబలం.

ఇటువంటి మధు మానసిక జీవనయానం 'పూజారి' నవల. ప్రీతిని ప్రేమిస్తూనే, 'ఆమెను ప్రేమించటం వృథా' అన్న నిర్లిప్తత. తను కోరుకున్నది ఏదీ తనకి దక్కదు, ప్రీతీ దక్కదన్న భయపూరిత నిరాశ. చివరికి అలాగే జరుగుతుంది. ప్రీతి మధు జీవితంలోకి ఎంత అకస్మాత్తుగా వచ్చిందో, అంత అకస్మాత్తుగానే అంతర్ధానమైంది. బాంక్ మేనేజర్ గారికి ట్రాన్స్‌ఫర్ వల్ల ఆ ఊరునుంచి వెళ్లిపోయారు.

ఈ నవలలో మరో బలమైన పాత్ర, గుమాస్తా రామకృష్ణయ్య కూతురు సుశీల. మధుపట్ల ఆమెది ఓ అజ్ఞాత మూగ ఆరాధన. ప్రీతి వెళ్లిపోయిన తర్వాత, తాతగారి మరణంతో నిరాశలో కూరుకుపోయి, కోర్టు తగాదాలలో ఆస్తి చిక్కుకున్న సమయంలో మధు మరింతగా కృంగిపోతాడు. రామకృష్ణయ్య మంచమెక్కిన ఆ సమయంలో సుశీలే, అహర్నిశ శ్రమతో ఇంటిని, మధుని సంరక్షిస్తుంది. ఈ క్రమంలో సుశీల సౌశీల్యతకి దగ్గరైన మధు ఆమెని అర్ధాంగిగా స్వీకరిస్తాడు.

కొన్నాళ్ళపాటు నీలనాగిని అన్న వేశ్యా లోలత్వంలో మధు సర్వం మరచిపోవటం, ఆ ఇంటి డబ్బు, నగలు కరిగిపోవటం లాంటి సంఘటనలు ఈ నవలలో ఉన్నాయి.

సుశీల, మధు వివాహం. దానికి ముందు వెనకగా ప్రీతి, శ్రీరాం వాళ్ళకి తారసపడి మేలు చెయ్యటం.. నవలలోనూ, 'పూజాఫలం' సినిమాలోనూ వున్నా, రెండింటికీ చాలా భేదం వుంది. 'పూజాఫలం'లో మధుకి తాత్కాలిక మానసిక అనారోగ్యం కలిగితే, శ్రీరాం డాక్టరుగా, అతని భార్య ప్రీతి తన ఆనాటి 'పగలే వెన్నెల' పాట

# కథల రారాజు.. మునిపల్లె రాజు

తెలుగుకథను సుసంపన్నం చేసిన రచయితల్లో అగ్రగణ్యులైన మునిపల్లె రాజు 1925, మార్చి16న గుంటూరు జిల్లాలో పుట్టారు. ఆయన భారత రక్షణ మంత్రిత్వశాఖలో ఇంజనీరింగ్ సర్వీసులో ఉద్యోగం చేశారు. అస్తిత్వవాద ఆందోళనలను తన కథల్లో అత్యద్భుతంగా చిత్రించారు. మేజికల్ రియలిజం అనే విలక్షణమైన సాహితీ ప్రక్రియలో రచనలు చేసిన కొద్దిమంది తెలుగు ప్రముఖుల్లో ఆయన ఒకరు. 'మునిపల్లె రాజు కథలు', 'పుష్పాలు-ప్రేమికులు-పశువులు', 'దివో స్వప్నాలతో ముఖాముఖి', 'అస్తిత్వనదం ఆవలి తీరాన' అనేవి ఆయన కథాసంపుటాలు. 'వేరొక ఆకాశం-వేరెన్నో నక్షత్రాలు', 'అలసిపోయినవాడి అరణ్యకాలు' అనే కవితా సంపుటాలు కూడా ఆయన సాహితీ కృషిలో భాగమే. రచయితలు, కవులమీద ఆయన రాసిన అరుదైన సాహిత్య వ్యాసాలన్నీ 'జర్నలిజంలో సృజన రాగాలు', 'సాహితీ మంత్రనగరిలో సుస్వరాలు' పేరిట రెండు పుస్తకాలుగా వెలువడ్డాయి.

చాలా చిన్నవయసు నుంచే సాహిత్యంపై మక్కువ పెంచుకున్న మునిపల్లెరాజు తెలుగులో తొలితరం ఆధునిక రచయితలందరినీ చదివారు. దాంతోపాటు సుప్రసిద్ధ రష్యన్ రచయితలైన పుష్కిన్, గోగోల్, దోస్తోయేవ్‌స్కీ, టాల్‌స్టాయ్, గోర్కీ రచనల చేత ప్రభావితమై, ప్రేరణ పొందారు.

'అస్తిత్వనదం ఆవలి తీరాన' కథా సంపుటికి ఆయన కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డును పొందారు. తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురస్కారాన్ని, గోపీచంద్ పురస్కారాన్ని పొందారు.

---

స్మృతితో అతనికి స్వస్థత చేకూరుస్తారు. ఆ తర్వాత సుశీల, మధు చేరువతో సినిమా సుఖాంతం అవుతుంది. పూజారి నవలలో అలా లేదు. పెళ్ళయి కొన్నాళ్ళు సంసారం తర్వాత ఏడో నెలలోనే ఓ ఆడపిల్లని ప్రసవించి సుశీల మరణిస్తుంది. తర్వాత ఆ పుట్టిన పిల్లా మరణిస్తుంది. యాదృచ్ఛికంగా శ్రీరాం దగ్గరకి చేరిన మధుకి చెడిన ఆరోగ్యం కుదుటపడినా, అనుకోని పరిస్థితులు ఎదురై, తన ఆస్తిలోంచి సైంటిస్ట్ శ్రీరాం పరిశోధనలకి అవసరమైన డబ్బుని అందేలా చేసి, తన ఊళ్ళోని శిథిల దేవాలయం చేరతాడు. 'ఆ శిథిల మందిరం ఇప్పుడు కళకళలాడుతోంది. ఆ మందిరం ప్రాంగణంలోనే కొత్త పూజారి కుటీరం' అని నవలని ముగిస్తారు మునిపల్లె రాజు. ఇది విషాదాంతం.

ఈ నవల స్థూలంగా త్రిముఖ ప్రేమకథ. అప్పటి కొన్ని కథల్లోల్లాగే జమీందారీ నాయకుడు, పేదనాయికా, వీళ్ళిద్దరికీ భిన్నమైన ఉపనాయికా ఈ కథలోనూ ఉన్నారు. కానీ ప్రముఖమైన తేడా అల్లా ఈ పాత్రల వెనుకనున్న మానసిక ప్రపంచం, తాత్విక నేపథ్యం, వాటి ప్రతిభ ఈ నవలకి పూర్తిగా భిన్నత్వాన్ని కూర్చి అత్యున్నత స్థాయికి తీసుకెళ్ళింది. యాభయ్యోదశకం నాటికి తెలుగు సాహిత్యం మీద, బెంగాలీ నవలల ప్రభావం ఉద్ధృతంగా వుంది. 'పూజారి' నవల విషయంలోనూ ఈ బెంగాలీ క్లాసిక్స్ ప్రభావం కనిపిస్తుంది. అయినా ఈ నవలలోని పరిసరాలు, పాత్రలు, మనస్థత్వాలు పూర్తిగా తెలుగు జీవితానివే. అదే 'మునిపల్లె'వారి ప్రత్యేక ప్రతిభ.

పలు తరహా రచనలు ఎన్నో మునిపల్లె రాజు చేసినా 'పూజారి' అంత సుదీర్ఘ రచన మరొకటి లేదనే చెప్పాలి. ప్రఖ్యాత కథకులైనా ఆయన 'పూజారి'ని కథగా రాయలేదు. నవలావిస్తృతినే ఇచ్చారు. పెద్దకథగానైనా రాయటానికి కుదరని వస్తువిది. మంచి నవలాస్థాయికి ఇదో గీటురాయి.

తమ విస్తృత అనుభవంతో దర్శకులు బి.ఎన్. రెడ్డి, డి.వి.నరసరాజు 'పూజాఫలం' చిత్రాన్ని నవరసభరితంగా తీర్చిదిద్దారు. చాలా మంచి సినిమా అన్న పేరుతోపాటు ఆర్థికంగా విజయాన్ని గడించారు. ప్రేక్షక ఆదరణ ఎంతగానో లభించిన చిత్రమిది. అయినా సినిమాకోసం మూలకథలో చేసిన మార్పుల విషయంలో మునిపల్లెవారికి నిర్దిష్ట అభిప్రాయాలున్నాయి.

1952 నాటికి ఇంతగా మనస్థత్వ విశ్లేషణ మీద ఆధారపడిన తెలుగునవలలు అరుదు. మనిషిని అర్థం చేసుకోటంలో మానవతాదృక్పథంతో పాటు, శాస్త్రీయ అవగాహన తోడై ముందుకి సాగుతున్న కాలమది. అపజయభావం అనేది ఓ మానసిక శాఖ. దానికి ప్రతిరూపంగా మధుపాత్రని రూపొందించారు రచయిత. అది బలంగా చూపించే క్రమంలోనే 'పూజారి' నవల

